**Islam Insani Huqooq ka Pasban**
(Telugu)

# మానవ హక్కుల రక్షణ ఇస్లామ్

మూలం
మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరి

అనువాదం
ఎస్.ఎమ్. మలిక్

# విషయసూచిక

# ముందుమాట

భువిలో పుట్టిన ప్రతి శిశువు కొన్ని హక్కులతోపాటు పుడతాడు. అయితే ప్రపంచం ఆ హక్కుల్ని ఒకప్పుడు అతనికిస్తే మరొకప్పుడు అతను వాటికి వంచితుడయ్యాడు. ఒకరికి వారి హక్కులు లభించకపోవడం సాధారణ విషయం కాదు. ఆ హక్కుల మూలంగానే ఆయా వ్యక్తుల ఉన్నతి, మహత్తు, అభివృద్ధి ముడివడి ఉన్నాయి. ఆ హక్కులే అతన్ని ఔన్నత్యాలకు చేర్చగలవు. అవే అతనికి లేకపోతే అతను హీన స్థాయికి, దిగజారిన స్థితికి చేరి అటువంటి జీవితమే గడపడానికి బద్ధుడయి పోతాడు. అతను పరిణితి చెందే అవకాశాలన్నీ ఎండమావులయి పోతాయి. అయితే - ఈ హక్కులేవి? మానవులందరికీ ఈ హక్కులు సమానంగా వర్తిస్తాయా? లేదా వీరి మధ్య వ్యత్యాసముందా? ఈ హక్కుల సాధన ఎలా సాధ్యమవుతుంది? వాటి రక్షణ ఎలా జరగాలి? అనే ప్రశ్నలు మిగులుతాయి. కొన్ని చారిత్రక కారణాల వల్ల ఈ ప్రశ్నలు నేటి కాలంలో వాతావరణమంతటా మార్మోగుతున్నాయి.

అనేక దేశాల్లో ఈ హక్కుల స్థితిగతుల పరిశీలన జరిగే వ్యవస్థ ఉంది, దాన్ని సమీక్షించడం, సమర్థించడం, ప్రశ్నించడం కూడా జరుగుతుంది. సమాజంలో దాని పట్ల చైతన్యం తెచ్చే ప్రయత్నమూ జరుగుతుంది. చట్టం న్యాయస్థానాల ద్వారా వాటిని పరిరక్షించే ఏర్పాటు కూడా జరుగుతుంది. దీనిగ్గాను సామాజిక, ఆర్థిక, రాజకీయ శక్తినీ వినియోగించడం జరుగుతుంది. ఈ ప్రయత్నాల ప్రాముఖ్యతను, విలువను ఎవరు కాదనలేరు. అనేక సందర్భాలలో ఈ ప్రయత్నాలకు ఉత్తమ ఫలితాలు సయితం కానవస్తున్నాయి. అయితే దీనితోపాటు ఓ ప్రశ్న కూడా తప్పకుండా బలవత్తరంగా ముందుకు వస్తుంది. ఈ ప్రయత్నాలు సదా నిష్పక్షపాతంగా, వివక్ష రహితంగానే జరిగాయా? అంతర్జాతీయ స్థాయిలో మానవ హక్కుల పర్యవేక్షకులు ఇటువంటి ప్రయత్నాలను హక్కుల అణచివేతను దాచిపెట్టడానికి వినియోగించుకోవడం లేదు కదా?

మానవ హక్కుల విషయంలో ఇస్లామ్ అతి స్పష్టమయిన భావనను ముందుం చుతుంది. అది దాని వైఖరిని ఎంతో ప్రస్ఫుట రూపంలో ప్రదర్శిస్తుంది. అది వ్యక్తికి, సమాజానికి, సమాజంలో విభిన్న వర్గాలకు హక్కులను నిర్ణయించింది. ఈ హక్కులు వారికి ప్రాప్తమయ్యేలా జాగ్రత్తలూ తీసుకుంది. ఏ ఏ వ్యక్తులు, వర్గాల హక్కులు హరించబడేవో వారికి మద్దత్తుగా నిలబడి సమర్థించింది. ఎవరయితే ఆ హక్కుల్ని కాజేసేవారో వారిని తీవ్రంగా విమర్శించడంతోపాటు గట్టిగా మంద లించింది. ప్రపంచంలోనూ, పరలోకంలోనూ మాచెడ్డ పర్యవసానాలను ఎదుర్కోవలసి ఉంటుం దని హెచ్చరించింది. సమాజం హక్కులు కోల్పోయిన వారి పట్ల ఉత్తమంగా ప్రవర్తిం చాలని బోధన, ఉపదేశాలను చేయడమే కాక సమాజంలో సానుభూతి, ప్రేమాను రాగాల వాతావరణాన్ని సృజించింది.

మానవ హక్కుల ఈ ప్రయత్నాలన్నింటికీ దివ్యఖుర్ఆన్ బోధనలే ప్రాతి పదిక. వీటికి హదీసు ప్రవచనాల్లో వివరణలు, విశదీకరణలున్నాయి, ఆచరణాత్మక విధానాలూ ఉన్నాయి. దివ్యఖుర్ఆన్‌లోనూ, హదీసు వచనాల్లోనూ వీటి చర్చ, సాధారణ శాసన గ్రంథాల్లా లేదు. చట్టం పుస్తకాలు హక్కుల్ని అధికరణల రీత్యా ప్రస్తావించి అవసరమయితే వాటి వివరణల్నీ పేర్కొంటాయి. దివ్యఖుర్ఆన్ చర్చా విధానం నైతికంగానూ చట్టపరంగానూ రెండు విధాలా దృఢంగా ఉంటుంది. అది నైతికత ఆధారంగా ప్రస్తావించిన సందర్భంలో హక్కుల నిర్వహణను స్వరూప స్వభావాల అనివార్యమయిన ఆవశ్యకతగా పేర్కొంటుంది. ప్రతి ఒక్కరి హక్కుల్ని నిర్వర్తించిన వారిని ప్రశంసిస్తుంది, వారు ఆదరణీయులని ప్రకటిస్తుంది. ఇలాంటి వారు ఇహపరాల్లో ఉభయత్రా సాఫల్యాన్ని, విజయాన్ని సాధిస్తారని శుభవార్తను అందజేస్తుంది. అలాగే అన్యాయాలు, అక్రమాలు, హక్కుల అణచివేత జరిపే వారికి కలగబోయే ఘోరమయిన పర్యవసానాలను గురించి భయపెడుతుంది. పరలోక జీవితంలో నరక ప్రాప్తిని గురించి హెచ్చరిస్తుంది. దీనితోపాటు అది హక్కులను గురించి చట్టపరమయిన భాషలోనూ ప్రస్తావిస్తుంది. అందులో ఒకే చోట హక్కులకు సంబంధించిన అన్ని విషయాలూ చర్చించడం జరగదు. తరచుగా ఒకచోట ఒక హక్కుకు చెందిన ఒక కోణాన్ని ప్రస్తావిస్తే మరో చోట మరో కోణాన్ని పేర్కొంటుంది.

హదీసుల విషయంలోనూ ఇదే పద్ధతి మన ముందుకు వస్తుంది. అందువల్ల

ఒక హక్కును గురించి తెలుసుకోదలిస్తే దివ్యఖుర్‌ఆన్ మొత్తాన్నీ, హదీసుల సమస్త భాండాగారాన్ని పరిశీలించడం తప్ప గత్యంతరం లేదు. ఇస్లామీయ ఫుకహా (ధర్మశాస్త్ర నిపుణులు) షరీఅత్‌వేత్తలు (Jurists – న్యాయశాస్త్రవేత్తలు) ఈ విషయాన్ని బాగా సవివరంగా పరిశీలించారు. హక్కులను నిర్ధారించి క్రోడీకరించారు. వారు తమ కాలానుగుణంగా, పరిస్థితుల రీత్యా ఈ రంగంలో కృషి సలిపారు. ఇస్లామీయ శాసనాంగాన్ని అవగతపరచుకోవడంలో దీని ద్వారా బహుధా ప్రయోజనం పొందవచ్చు.

నాకు (ఈ పుస్తక రచయితకు) ఈ విషయం పట్ల చాలా కాలంగా ఆసక్తి ఉండేది. దీనికి సంబంధించిన కొన్ని కోణాలపైన కొన్ని వ్యాసాలు సయితం వ్రాయడం జరిగింది. ఈ పుస్తకం కూడా ఆ విషయానికి సంబంధించిన ఒక కృషి మాత్రమే. ఇందులో నేరుగా ఈ విషయానికి సంబంధించిన ఖుర్‌ఆన్ హదీసుల బోధనల్ని సవివరంగా అందజేయడానికి ప్రయత్నం జరిగింది. ఈ విషయంలో ప్రాచీన పండితులు, ధర్మవేత్తలు జరిపిన అనన్య కృషి ద్వారా సయితం ప్రయోజనం పొందే ప్రయత్నం జరిగింది. ఏ హక్కులను గురించి, రచయిత వ్రాసిన ఇతర రచనల్లో, వ్యాసాల్లో సవిస్తరంగా చర్చించడం జరిగిందో వాటిని ఈ పుస్తకంలో క్లుప్తంగా, ఇంకా కొన్ని వాక్యాల్లో మటుకే ప్రస్తావించడం జరిగింది. ఇంత చేసి కొన్నిహక్కుల ప్రస్తావన జరగలేకపోయింది. కాని మొత్తం పుస్తకాన్ని అధ్యయనం చేయడం ద్వారా అన్ని హక్కుల సందర్భంలోనూ ఇస్లామ్ దృక్పథాన్ని సునాయాసంగా అర్థం చేసుకోవడం సాధ్యమే.

మానవ హక్కులకు సంబంధించిన ఆధునిక భావనలకు సంబంధించిన విషయాలు, డా. ఎస్. సుబ్రహ్మణ్యన్ (Dr. S. Subraminian) వ్రాసిన Human Rights - International Challenges అనే పుస్తకం ద్వారా గ్రహించాము. ఈ గ్రంథం రెండు సంపుటాలలో ప్రచరించబడింది.

ప్రస్తుత పుస్తకం పూర్తిగా చట్టపరమయిన రీతిలో రచించబడలేదు. ఏ హక్కును ప్రస్తావించినా దివ్యఖుర్‌ఆన్, హదీసుల వెలుగులో దాన్ని వివరించడం, విశదీకరించడం జరిగింది. సందర్భానుసారం సమాజంపైన దాని ప్రభావం కూడా సూచించడం జరిగింది. అనేక చోట్ల ఒక్కో హక్కు చట్టపరమయిన స్థానాన్ని విశదీక రించడంతో

పాటు దానికి సంబంధించిన ఇస్లామీయ నైతిక బోధనల్ని సయితం పొందుపరచడం జరిగింది. నైతికతకు, చట్టానికీ గల సంబంధం బలవత్తరమయింది. ఒక వ్యక్తిలో నయినా సమాజంలోనయినా నైతిక స్పృహ జాగృతమయితే అది చట్టం కన్నా అధికంగా క్రియాశీలమవుతుంది. అటువంటి సందర్భంలో మనిషి ఎటువంటి బయటి వత్తిడి లేకుండానే సంతోషంగా ప్రతి ఒక్కరి హక్కుని నిర్వర్తించడానికి సిద్ధమవుతాడు. కొన్ని సందర్భాలలో ఫుకహా (ధర్మశాస్త్ర నిపుణులు) వెలిబుచ్చిన అభిప్రాయాలు, వారి మధ్యగల విభేదాలు సయితం ఉటంకించడం జరిగింది. దీనివల్ల హక్కుల కొత్త కోణాలు విశదమవుతాయి. షరీయఅత్ (ధర్మశాస్త్రంలో) గల విస్తృతి, సాధ్యాసాధ్యాలు కూడా ముందుకు వస్తాయి. ఇస్లామ్‌కు సంబంధించిన ప్రామాణిక మయిన సమాచారాన్ని అందజేయడానికి ప్రయత్నం చేశాము - వీటిని ఏ సందర్భంలోనయినా సరే విశ్వసనీయంగా ప్రస్తావించవచ్చు.

ఈ చిన్న ప్రయత్నంలో కొన్ని చిన్న పెద్ద కొరతలు ఉండటం సాధ్యమే. పండితులు వాటిని తప్పక గుర్తుచెయ్యాలని అభ్యర్థిస్తున్నాము; అల్లాహ్ సద్ఫలితాన్ని అందజేస్తాడు, ఈ రచయిత కృతజ్ఞతలు తెలుపుకుంటాడు, రాబోయే ఎడిషన్లలో వాటిని సంస్కరించడం జరుగుతుంది. అల్లాహ్ దీన్ని స్వీకరించాలని, ఇందులో జరిగిన పొరపాట్లను మన్నించాలని వేడుకుంటున్నాము.

**- జలాలుద్దీన్ ఉమరి**

13.11.2004



అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# మానవ హక్కుల భావన

## చారిత్రక పూర్వరంగం

ప్రపంచంలో బలవంతులు బలహీనులూ అయిన మానవులు నేడూ ఉన్నారు, నిన్నా ఉన్నారు, రేపు కూడా ఉంటారు. మానవ నైజం కోరేదాని ప్రకారం, బలశాలి అయిన మానవుడు తన శక్తిని దురుపయోగం చేయరాదు, బలహీనుల పట్ల ప్రేమ, సానుభూతి, సహకారం, తోడ్పాటు వైఖరిని అవలంబించాలి. బలవంతుడయిన మనిషి శక్తి, బలహీనుడి అశక్తతను దూరం చేసి అతన్ని పైకి లేవనెత్తడానికి ఉపయోగ పడాలి. బలవంతుడు బలహీనుణ్ణి, జీవన సంగ్రామంలో వెనుకబడకుండా ఉండేలా సముద్ధరించాలి. కాని వాస్తవం ఏమిటంటే, గత చరిత్ర సాక్ష్యమిచ్చేదీ, నేటి పరిశీలన తెలిపేదీ ఏమిటంటే, అత్యధిక సందర్భాలలో మానవ నైజం కోరే ఈ విషయం నెరవేరలేదు.

శక్తిమంతుని చేతుల్లో అనేక హక్కులు, అధికారాలు ప్రోగయిపోయాయి. బలహీనునికి వాటిలో ఎంతో కొంత దొరకడమో లేదా దొరకకపోవడమో జరిగింది. బలశాలికి తన బలం మత్తులో తన బాధ్యతలేవో గుర్తులేకపోయాయి. బలహీనుడేమో తన బాధ్యతల భారంలో అణగారుతూపోయాడు. బలవంతుడు తన హక్కులు అధికారాలను అవధుల్లేకుండా వినియోగించుకున్నాడు. బలహీనుడు తన దౌర్భాగ్యానికి కన్నీరు కారుస్తూ ఉండిపోయాడు. ఒక్కోసారి బలశాలురయినవారి పటిష్ఠమయిన చేతులు అతన్ని బాగా అణగబట్టాయి, చితికివేశాయి, అతను ఎక్కిళ్ళుపెట్టి ఏడ్వనూ లేకపోయాడు, కాళ్ళూ చేతులూ కొట్టుకోలేకపోయాడు, ఫిర్యాదు చెయ్యడం బహుదూర విషయం!

ఈ వైఖరి వల్ల ఒకటి మాత్రం తేలింది. విభిన్న కాలాల్లో, విభిన్న ప్రాంతాల్లో హక్కుగలవారు, బాధ్యులయినవారు వేర్వేరుగా శాశ్వత వర్గాలుగా ఏర్పడసాగారు. ఒక వైపున చుట్టుప్రక్కలనున్న సమస్త వనరులపైన స్వామ్యం, అధికారంగల వర్గముంటే మరో వైపున ప్రతి వస్తువుకూ వంచితులయిన ప్రజల వర్గం ఉండేది. ఒక

వైపున భోగవిలాసాలు, సుఖశాంతులు తాండవిస్తే మరో వైపున జీవితమే తన మనుగడ కోసం ఆవేదన చెందుతూ ఉండేది. బలవంతుల వర్గం చేతుల్లో అధికారం, పరిపాలన, చట్టం, విద్య, కళలు, ఆర్థిక వనరులు, సంస్కృతీ నాగరికతలు, సామాజిక వ్యవస్థ అన్నీ ఉన్నాయి. ఆ వర్గంలోనే పాలకులు, మంత్రులు, రాజ్యాధికారులు, సేనా నాయకులు, జ్ఞాన సంపన్నులు, కళా నిపుణులు, సంస్కృతీ నిర్మాతలు, సమాజకర్తలు అందరూ పుట్టారు. వారే ప్రతి గడపకు స్వాములు, ప్రతి భవంతికి అధిపతులు అయ్యారు. వారికి ప్రతిగా బలహీన వర్గం వీటిలో ఏ ఒక్కటీ తనకు చెందినదని తలపోయనూ లేదు. బ్రతుకు కూడా కేవలం బలవంతుల వర్గానికి దాని అవసరం ఉంది గనకనే అది కొనసాగుతోంది. ఈ వర్గం జీవం లేని యంత్రంలా దాని బలంలో వృద్ధికి పనిముట్టుగా మారింది. బలవంతుడు తాను అర్హుడుకాని అనేక హక్కులకు అధర్మంగా స్వామి అయి కూర్చున్నాడు. మరో వైపున బలహీనుడు తన న్యాయబద్ధ మయిన హక్కులకు సయితం వంచితుడయిపోయాడు. బలహీనుడు తన హక్కులకు పోరాడటం అలా ఉంచి వాటిని గురించి ప్రస్తావన కూడా చేయనటువంటి స్థితిలోకి వచ్చేశాడు.

కొన్ని సందర్భాలలో ఇలా ఎంతో సుదీర్ఘకాలం వరకు కొనసాగింది. ఫలితంగా ఉభయవర్గాలూ ఇదే ప్రకృతి నియమమని భావించసాగాయి. బలవంతులయిన వారి వర్గం అనుకున్నది లేదా దానికి ఇలా బోధించడం జరిగింది – దానికి ప్రాప్తమయిన దంతా అది దానికి స్వతహాగా గల హక్కు, అధికారం, యోగ్యతల మూలంగా ప్రాప్త మయింది. ఆ వర్గం, అందులో మరెవరి వాటా ఏదీ లేకుండా స్వంతంగా అన్నింటికీ అధికారం, స్వామ్యం కలిగి ఉంది అని నిర్ధారితమయిన విషయంగా అంగీకరించడం జరిగింది. అలాగే బలహీన వర్గం ప్రజలు తమ ఉపేక్ష పట్ల సహనంతో, సంతృప్తితో బ్రతకసాగారు. ఇదే తమ భాగ్యంలో అనాది నుండి వ్రాయబడి ఉందని తలపోయ సాగారు. అప్పుడప్పుడు ఈ వర్గాల మధ్య సంఘర్షణ, పోరాటం కూడా జరిగిన సందర్భాలూ ఉన్నాయి. తిరుగుబాటు కూడా జరిగింది. అయినప్పటికీ పరిస్థితుల్లో మార్పు అన్నది పెద్దగా గోచరించలేదు. ఈ చిత్రం ఎంతో భయానకమయినదిగా అగుపడుతుంది. అంతకన్నా భయానకమయిన ప్రశ్న మరొకటి ఉంది. మానవ జాతి చరిత్ర అంతా అన్యాయం అక్రమాల చరిత్రేనా? అది ఎన్నడూ న్యాయం, అనుగ్రహం, శాంతి అన్నది చవిచూడలేదా? సుదీర్ఘ మానవ చరిత్రలో అత్యధిక ఆదమ్ సంతానం తన హక్కులను గురించి ఏమరుపాటుకు లోనయి ఏమీ ఎరుగకుండా సదా ఉపేక్షకే

గురవుతూ వచ్చిందా? ఎన్నడూ మానవుల ఈ హక్కులను గురించి గళం విప్పి చాటేవాడే లేకపోయాడా? వారి హక్కుల గురించి పోరాడి, వారి హక్కుల్ని అప్ప జెప్పేవారే ఎవ్వరూ పుట్టలేదా?

సమాధానంగా, ప్రపంచం న్యాయం, సమానత్వం వంటి ఉదాహరణలు తప్పక చూసింది, అయితే ఇతోధికంగా దౌర్జన్యమే చరిత్రలో వ్రాయబడిందన్న విషయం ముందుకు వస్తుంది. అధికార సత్తాగలవారు, బలవంతులు సదా చరిత్రలో చీకటి అధ్యాయాలనే పెంచుతూ వచ్చారు. ఫలితంగా ఇదో కొంత కాలం ముందు, కొన్ని శతాబ్దుల ముందు మానవ హక్కుల భావన అతి తీవ్రంగా పైకి వినరాసాగింది. దానికి కృషి మొదలయింది. అది అనతి కాలంలోనే ఒక సర్వసామాన్య ఉద్యమంగా రూపుదాల్చింది. దాని కేంద్రం యూరపు, ముఖ్యంగా బ్రిటిష్, ఫ్రాన్స్ దేశాలు. ఆ తరువాత అమెరికా కూడా ఈ దిశలో ముందుకు సాగింది.

ప్రపంచ చరిత్రలో, మత గ్రంథాలలో ప్రాథమిక మానవ హక్కుల ప్రస్తావన అయితే కానవస్తుందని, కాని వాటిని ఈ పేరుతో పిలువడం జరగలేదని అంటారు. ఆధునిక చరిత్రకారుల దృష్టిలో మానవ హక్కుల భావన ప్రపంచానికి మహా నిబంధనావళి (Magna Carta) ద్వారానే పరిచయమయింది. ఇది బ్రిటిష్ చక్రవర్తి జాన్ (John) కాలంలో జూన్ 15, క్రీ.శ. 1215న ఆమోదించబడింది. ఈ నిబంధనావళి గురించి ఒక అపోహ ఉంది. దీని ద్వారా బ్రిటిష్ ప్రజలకు వ్యక్తిగత రాజకీయ స్వాతంత్ర్యం ప్రాప్తమయిందని అంటారు. ఇది వాస్తవం కాదు. కొన్ని వర్గాల హక్కుల్ని పరిశీలించవలసిందని చక్రవర్తికి పెట్టుకున్న ఒక అభ్యర్థన తప్ప ఇది మరేమీ కాదు. దానికి ఇంతకన్నా మహత్తు మరేమీ లేదని చెప్పవచ్చు.

పాశ్చాత్య దేశాలలో ఈ సందర్భంలో ఇతర ప్రయత్నాలూ అనేకం జరిగాయి.

రెండవ కాన్కర్డ్ చక్రవర్తి (Concard-II) ఒక ప్రణాలి ద్వారా పార్లమెంటు అధికారాలను నిర్దిష్టపరిచాడు.

1188లో తొమ్మిదవ అల్ఫానోస్ చక్రవర్తి (Alfanso-IX) కాలంలో అక్రమ నిర్బంధం (Habeas Corpus) అన్నది అన్యాయమయినదన్న నియమాన్ని అంగీకరింపజేయించడం జరిగింది.

1766లో ఫ్రాన్స్‌లో ప్రఖ్యాత తత్వవేత్త రూసో (Rousseave) సామాజిక ఒప్పందం వ్రాశాడు. అతన్ని ఫ్రెంచ్ విప్లవానికి ఆద్యుడని అంటారు. దాని ఆధారంగానే

1789లో ఫ్రాన్స్‌లో Declaration of the Rights of Man మానవ హక్కుల ప్రకటన ముందుకు వచ్చింది.

1776లో అమెరికా రాష్ట్రం వర్జీనియాలో ఏర్పాటయిన సమావేశంలో George Mosion సంకలనం చేసిన మానవ హక్కుల నియమావళిని ఆమోదించడం జరిగింది.

ఈ సందర్భంలో ఇంకా అనేక ప్రయత్నాలు జరిగాయి. ఐక్యరాజ్య సమితి కూడా విభిన్న సందర్భాలలో దీనికి సంబంధించిన ప్రతిపాదనలు అనేకం ఆమోదించింది. చివరికి 1948 డిసెంబరు 10న అది Universal Declaration of Human Rights ని ఆమోదించింది. ప్రపంచంలోని అనేక జాతుల, దేశాలు దీన్ని సమర్థించాయి. దీన్ని సమర్థించని జాతులు సయితం దీన్ని వ్యతిరేకించలేదు. ఈ విధంగా దీన్ని ప్రపంచ రాజ్యాల ఏకగ్రీవ నియమావళిగా పేర్కొంటారు. ఏ ప్రభుత్వమూ దీన్ని కాదనడమో, వ్యతిరేకించడమో చెయ్యడం లేదు. దీన్ని మానవ హక్కుల చరిత్రలో ఒక విప్లవాత్మక చర్యగా పేర్కొంటారు.

మానవ హక్కుల ఈ ప్రపంచ నియమావళిలో, వ్యక్తి స్వేచ్ఛ, న్యాయం, సమానత్వం కేంద్రీయ స్థానంలో ఉన్నాయి. ఇది ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కులతోపాటు రాజకీయ హక్కుల్ని సయితం పేర్కొంటుంది. ఇందులో ప్రతి వ్యక్తికిగల ఈ హక్కుల్ని అంగీకరించడం జరిగింది – అతని పట్ల సమానత్వం పాటించాలి, ఒకరికన్నా అధికంగానో మరొకరికన్నా అధమంగానో భావించరాదు. అతనికి ధన ప్రాణాల భద్రత ప్రాప్తం కావాలి. దానిపైన ఎటువంటి బలాత్కారం, హింస జరగరాదు; అతనికి న్యాయం ప్రాప్తం కావాలి. అదే విధంగా విశ్వాసం, మతం, భావ వ్యక్తీకరణ, సంస్థ ఏర్పరచుకునే, ప్రయాణం, ఒక చోటు నుంచి మరో చోటికి నివాసం మార్పునకు, ఇష్టం ప్రకారం పెళ్ళి చేసుకునేందుకు, కుటుంబం ఏర్పాటుకు హక్కు ఉన్నట్టు అంగీకరించడం జరిగింది. విద్య, ప్రభుత్వంలో పాల్గొనటం, ఉద్యోగం, విశ్రాంతి, ప్రైవేటు జీవితంలో జోక్యంలేని విధంగా గడిపే స్వేచ్ఛ కూడా అతని ప్రాథమిక హక్కుగా ఆమోదించడం జరిగింది.

ఈ ప్రణాళిలోని గొప్పదనం ఏమిటంటే, ఇది వ్యక్తికి అతని ప్రాథమిక హక్కులు ప్రాప్తమయ్యేలా చేస్తుంది. ఇందులో పాలక వర్గం చేసే దౌష్ట్యాల బారి నుండి పౌరులను కాపాడే ఏర్పాటుంది. ప్రజల్ని శక్తికి సరోవరంగా, పాలకులను వారి సమక్షంలో

జవాబుదారులుగా నిర్ణయించడం జరిగింది. న్యాయం, సమానత్వాలు సులువుగా ప్రాప్తమయ్యేలా ప్రయత్నించడం జరిగింది. వ్యక్తికి విద్య, ప్రగతి, సంపన్నతను సాధించే అవకాశాలు ప్రాప్తమయ్యేలా శ్రద్ధ వహించాలని తెలుపడం జరిగింది.

దీనికి రెండవ కోణం ఏమిటంటే, ఇందులో కొన్ని మౌలికమయిన లోపాలున్నాయి. వాటిని ఇట్టే వదలిపెట్టలేము. ఈ లోపాల వల్ల దాని వల్ల ఆశించిన ఫలితాలు వెలువడటంలేదు.

ఈ ప్రణాలి వెనక సాధికార శక్తి ఏదీ లేదు. మరో విధంగా చెప్పాలంటే, ఒక జాతి చేత దాన్ని పాటింపజేయగల ఏ ఉన్నత శక్తీ లేదన్న మాట. ఈ విధంగా పరిశీలిస్తే ఇది కేవలం ఒక బోధనగా, ఉపదేశ సూత్రావళిగా మాత్రం మిగులుతుంది. దీన్ని ఒక పవిత్ర పత్రంగా భావించే దేశాల్లోనూ, దీని స్తోత్రగానం ఎంత ఘనంగా జరిగినా మానవ హక్కుల ఉల్లంఘన ఉదంతాలు ఇతోధికంగా కొనసాగుతున్నాయి. ఈ హక్కుల్ని పర్యవేక్షించే సంస్థలు ప్రపంచంలో అనేకం పని చేస్తున్నాయి. అవి ఎంతో ప్రయోజనకరమయిన సేవలూ అందజేస్తున్నాయి. వాటిలో ఒకటి European Court of Human Rights. ఇందులో యూరపు దేశాల్లో మానవ హక్కుల ఉల్లంఘన కేసులు నమోదవుతూ ఉంటాయి. వాటి సంఖ్య వందల్లో కాదు వేలల్లోనే ఉంది.

ఈ నాగరిక దేశాల్లో అంతర్గతంగా ఏ ప్రమాణంలో మానవ హక్కుల ఉల్లంఘన జరుగుతుందో అంతకన్నా ఎన్నో రెట్లు అధికంగా అంతర్జాతీయ స్థాయిలో ఆ దేశాలే ఆ ఉల్లంఘనకు పాల్పడుతూ ఉంటాయి. బలవంతులయిన జాతులకు, అభివృద్ధి చెందిన దేశాలకు ఈ హక్కుల్ని పాటించేవారుగా చేయడం బలహీన జాతులకు సాధ్యమయ్యే పనికాదు. అల్జీరియా, పాలస్తీనా, కోసోవా, బోస్నియా, ఇరాక్ మొదలయిన దేశాల స్థితులు దీనికి మంచి ఉదాహరణలు. పాలస్తీనాలో ఏ విధంగా నయితే మానవ హక్కుల్ని కాలరాయడం జరుగుతున్నదో దాన్ని ఐ.రా.స. పరిశీలనా కమిటీ బాధ్యులయిన వారు అంగీకరించారు.

ఈ ప్రణాలి వ్యక్తి, రాజ్యం రెంటి హక్కుల్ని సరిగ్గా నిర్దిష్ట పరచదు. దీని ద్వారా, వ్యక్తి హక్కులేవో, ఎక్కడి నుండి రాజ్య అధికారాల పరిధి ప్రారంభమవుతుందో స్పష్టంగా లేదు.

మతం విషయంలోనూ దీని వైఖరి అస్పష్టంగా ఉంది. ఇందులో ఏ వ్యక్తి అయినా ఏ మతాన్నయినా స్వీకరించవచ్చు, దాన్ని అవలంబించవచ్చు అన్న హక్కు

అయితే ఉంది, కాని మతం మానవుని హక్కుల్ని, విధుల్ని నిర్దేశిస్తుందన్న వారసత్వాన్ని ఇందులో విస్మరించడం జరిగింది. అసలు ప్రశ్న ఏమిటంటే, వ్యక్తి వాటిని ఆచరించగలడా? ఆచరించలేడు, కేవలం ఓ ప్రత్యేక పరిధిలోనే ఆచరించగలడన్నదే నిజమయితే అసలు మత స్వేచ్ఛ అనడంలో అర్థమేముంది?

ఈ ప్రణాళి, మానవుడు స్వేచ్ఛాయుత జీవి అన్న భావన ప్రధానంగా ఉనికి లోకి వచ్చింది, అతను స్వయంగా తన కొరకు శాసన నిర్మాణం చేసుకోగలడు అన్న భావమూ అందులో ఉంది. మనిషికి దైవికమయిన ఏ మార్గబోధన కూడా అవసరం లేదన్న అర్థమూ అందులో ఇమిడి ఉంది. లేదా దీన్ని మరో విధంగానూ చెప్పాలంటే, ఇదొక మతరహిత, సెక్యులర్ ప్రణాలి అని చెప్పవచ్చు. ఇందులో సహజంగానే సెక్యులర్ సిద్ధాంతాలు వృద్ధిచెందే ఇటువంటి ఉద్యమాలే వెలిసే, విస్తరించే అవకాశాలు అలాగే ఈ భావాలతో సామరస్యం పొందే శీల చరిత్రను వ్యాప్తి చేసే అవకాశాలే అధికంగా ఉంటాయి. ఆచరణాత్మకంగా ఇదే జరుగుతోంది కూడా. స్వేచ్ఛాయుత ఆలోచనా సరళి, వ్యక్తి స్వేచ్ఛ అనే పేరుతో ప్రతి వ్యవహారంలో నాస్తికత్వం, దైవనిరాసక్తత, వహీ, దైవదౌత్యం, పరలోకం వంటి విశ్వాసాల నిరాకరణలకు సంబంధించిన బుద్ధి క్రియారూపంలో కానవస్తుంది. నీతి, నడవడిని చెడగొట్టే ఉద్యమాలు నడపడానికి, ప్రపంచంలో ఓ ప్రత్యేక సంస్కృతీ నాగరికతల్ని చెలామణి చెయ్యడానికి శాయశక్తులా ప్రయత్నించడం జరుగుతోంది. దీన్నే ప్రగతిగా, ఆధునిక జ్ఞానోదయంగా భావించడం జరుగుతోంది.

దీనికి భిన్నంగా ఒక ధార్మిక ఉద్యమం నడపాలన్నా, ధార్మిక, నైతిక ప్రమాణాలను చెలామణి చెయ్యాలన్నా, వాటి ప్రచారం చెయ్యాలన్నా అవకాశాలు అతి పరిమితం. అవకాశం ప్రాప్తమయినా దాని మార్గంలో ఎన్నెన్నో అవరోధాలు చోటు చేసుకుంటాయి. ప్రచార, ప్రసార సాధనాల ద్వారా ఈ ఉద్యమాలకు వ్యతిరేకంగా వాతావరణాన్ని సృష్టించడం జరుగుతుంది. ఇటువంటి ఉద్యమాల రూపు రేఖల్ని వక్రీకరించి చిత్రించడం జరుగుతుంది. ఛాందసవాదం, మౌలిక వాదం (Fundamentalism) వంటి నిందలు మోపి వాటిని స్వీకాం

యోగ్యం కాకుండా చెయ్యడం జరుగుతుంది. ఇంకా అవకాశం దొరికినట్లయితే బలంతో వాటిని అణచే దుష్ట కుయుక్తులు సయితం అనుసరించడం జరుగుతుంది. స్వేచ్ఛాయుత ఆలోచనలు కావాలన్న వాదనలన్నీ ఈ విషయంలో గాలిలో ఎగిరిపోతాయి.

నేడు మానవ హక్కుల చర్చ నలువైపులా జరుగుతోందన్నది వాస్తవమే. ఈ విషయంలో కొన్ని శ్లాఘనీయ ప్రయత్నాలు జరుగుతున్నాయన్నదీ నిజమే. వీటితోపాటు ఈ హక్కుల ఉల్లంఘన సయితం అనుదినం సాగుతోందన్న యదార్థాన్నీ, దాన్ని అరికట్టే ఏ ఉపాయమూ సఫలం కావడం లేదన్న వాస్తవాన్నీ కాదనలేము.

ఇస్లామ్ దైవం అవతరింపజేసిన ధర్మం. ఇది ఇహపరాల ఉభయ సాఫల్యాలకు హామీనిచ్చే ధర్మం. దీనిలోని ఓ కోణం, అది మానవ హక్కుల కావలి అన్నది. అది దాని రక్షక వ్యవస్థగా మనముందుకు వస్తుంది. ఇంకా ఈ హక్కుల ఉల్లంఘనను అరికట్టే ప్రభావవంతమయిన విధానాలను అది అవలంబిస్తుంది. ఇది కేవలం ఏదో భక్తిప్రతిపత్తులతోనో భావాత్మకమయిన సంబంధాన్ని వ్యక్తపరిచే ప్రకటన కాదు. వాస్తవంగా ఇస్లామ్ ఓ విశాల రూపంలో, ఎంత లోతుగా, ఎటువంటి దూరదృష్టితో, మరెంత సూక్ష్మంగా ఈ కోణాన్ని తేటతెల్లం చేసిందో దాని దృష్టాంతం ప్రపంచంలో ఎక్కడా ప్రాప్తం కాదు. ఏ రాజ్యాంగంలోనూ, ఏ నిబంధనావళిలోనూ దీనికి సాటి కానరాదు. స్పష్టంగా తెలిసేదేమిటంటే, అనేక విషయాల్లో ప్రపంచం ఇస్లామ్ ద్వారా ప్రయోజనం పొందినట్లే ఈ వ్యవహారంలోనూ ఇస్లామ్ పాద చిహ్నాలను అది అనుసరించింది. అయితే ఈ సత్యాన్ని అంగీకరించే సాహసం, విశాల హృదయం ఇంకా దానికి ప్రాప్తం కాలేదు. ఇస్లామీయ విధానాన్ని పూర్తిగా అనుసరించకపోవడం చేత ఆధునిక మేధ రెండు అతివాదాలకూ లోనయింది, సంతులనాన్ని కోల్పోయింది. దీన్ని పట్టి చూపెట్టడం నేడు ఎంతయినా అవసరం. ఇస్లామీయ ఆలోచనాసరళిలో గల సంతులనాన్ని, సామంజస్యతను బహిర్గతపరచడం కూడా చాలా అవసరమయిన విషయం.



# 1. మౌలిక భావనలు

మానవుడు తొలుత సుదీర్ఘకాలం వరకు అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతూ ఉండేవాడని, చాలా కాలానికి క్రమేణ జ్ఞానకాంతిని పొందాడని ప్రచారంలో ఉన్న భావానికి ఇస్లామ్ కడు విరుద్ధం. దాని ప్రకారం తొలి మానవుడు, తొలినాడే దైవం ప్రదానం చేసిన మార్గబోధనతోనే ప్రపంచంలోకి కాలుపెట్టాడు; భువిని ఆ విధంగా కాంతిమయం చేసి వసించాడు. ఆ తరువాత కాలగమనంలో ప్రతి యుగంలోనూ అవసరం ఏర్పడినప్పుడల్లా మానవ మార్గబోధనకు, మార్గదర్శకత్వానికి ఏర్పాట్లు జరుగుతూ వచ్చాయి. దేవుని సందేశహరులు మానవునికి దేవుని హక్కులేవో, తోటి మానవుల హక్కులేవో విడమర్చి తెలుపుతూ వచ్చారు.

వారు ఓ ప్రక్కన మానవునిపైన తారసిల్లే అల్లాహ్ హక్కులేవో తెలుపడంతో పాటు రెండవ ప్రక్కన తోటి మానవ సోదరుల ఏ హక్కులు వారిపైన ఏర్పడతాయో ప్రస్ఫుటపరిచారు. ఈ బోధనల్లో ఒకే దైవం ఆరాధనతోపాటు తత్కాలానుగుణ్యమయిన షరీఅత్ (తోటి మానవుల పట్ల వ్యవహారసరళి) వ్యవస్థ కూడా ఉండేది. మానవుడు దేవుని హక్కును నిర్వర్తించకపోతే దాన్ని దైవప్రవక్తలు విమర్శించారు, ఖండించారు. బహుదైవారాధనను రూపుమాపారు, తౌహీద్ (దేవుని ఏకత్వం)ని స్థాపించారు. మానవుడు తోటి మానవుల హక్కుల్ని కొల్లగొట్టినట్లయితే వారు దానికి వ్యతిరేకంగానూ గళం విప్పారు, అన్యాయం, అక్రమం, అత్యాచారాలను అంతమొందించి న్యాయస్థాపనకు తమ ప్రయత్నాలను కొనసాగించారు. పరమ ప్రభువు వారికి అధికారాన్ని అనుగ్రహిస్తే హక్కుగల ప్రతి వ్యక్తికీ అతని హక్కును ఇప్పించారు. సమాజంలో న్యాయం, ధర్మాలను ఆచరణాత్మకంగా నిలబెట్టారు.

మానవ చరిత్రతోపాటే వహీ (దైవవాణి), రిసాలత్ (దైవదౌత్యం, దైవ మార్గదర్శకత్వం)ల చరిత్రకూడా తోడునీడగా కలసి ఉంది. ఈ సత్యాన్ని త్రోసిపుచ్చి మానవ చరిత్రను అధ్యయనం చెయ్యడం అసంపూర్ణమయిన, అనృతమయిన అధ్యయనం.

ఇస్లామ్ మానవునికి ఏ హక్కులనిచ్చింది, ఏ మేరకు ఇచ్చింది అన్న విషయాన్ని

సవివరంగా అధ్యయనం చేసే ముందు స్వయంగా మానవుని గురించి ఇస్లామ్ దృక్కోణాన్ని అవగతపరచుకోవడం అవసరం. ఎందుకంటే మూలతః ఈ హక్కులన్నీ ఈ దృక్కోణానికే లోబడి ఉంటాయి. ఆ దృక్కోణం వల్ల ఏర్పడే సహజమయిన, సహేతుకమయిన పరిణామంగా ముందుకు వస్తాయి, దాని ఆధారంగానే వివరమయిన రూపునూ ధరిస్తాయి. అందువల్ల ప్రథమంగా మానవుని పట్ల ఇస్లామ్ దృష్టికోణం ఏమిటో విశదంగా తెలుసుకుని ఆ తరువాత మానవ హక్కులను తెలుసుకోవడం సమంజసం.

## 1. అల్లాహ్ మాత్రమే సృష్టికర్త, స్వామి

ఇస్లామ్ ఒక యదార్థాన్ని పూర్తి బలాన్ని ఉపయోగించి మరీ వక్కాణిస్తుంది, దాన్ని విశ్వసించవలసిందన్న సందేశాన్నీ అందజేస్తుంది. అది - అల్లాహ్ మాత్రమే ఈ విశ్వాన్నంతటినీ సృష్టించినవాడు, ఆయనే దీనంతటికీ స్వామి. భూమ్యాకాశాలు, వీటిలోని సమస్తం ఆయన సృష్టించినదే, ఆయనకు చెందినదే. ఇందులో మరెవరూ ఆయనకు సహవర్తులు కారు. మానవుడు నేలపైన ఈ ప్రభువుకు ప్రతినిధి, ఆయన పక్షాన నియక్తుడయిన ఉప పాలకుడు (అల్ బకర : 30). మానవుని బాధ్యత ఆ ప్రభువు ఆదేశాల పాలన, వాటిని జారీ చెయ్యడం. ఇదే మానవుని పరీక్ష కూడా. ఈ యదార్థాన్ని నమ్మి అంగీకరించడం వల్ల సామాజిక జీవితంలో మహత్తరమయిన విప్లవం సంభవిస్తుంది. అదేమిటంటే, ఈ ప్రపంచం, ఇందులోని ప్రతి చిన్న పెద్ద వస్తువు పై నుంచి ఒకే వ్యక్తి లేదా వంశం, లేదా సంస్థకున్న పరమ స్వామ్యం, గుత్తాధిపత్యం అంతమయిపోతుంది. మానవుడు తన వద్ద ఉన్నదేదయినా అది అల్లాహ్ ప్రసాదించినదే అన్న విషయాన్ని ఒప్పుకుని మరీ జీవితం గడపడానికి బద్ధుడయిపోతాడు; అసలు యజమాని తాను కాడు ఆయనే అనీ, వీటినుపయోగించే విషయంలో తాను ఆయన అభీష్టానికి ఆయన ఆదేశాలకు బద్ధుడనీ, వీటిని స్వేచ్ఛగా ఉపయోగించుకోవడం తనకు అధర్మమనీ,ఇక్కడ ఏ వ్యక్తి ఏ స్థాయిలో వ్యవహరిస్తున్నాడో ఆ స్థాయిలోనే అతన్ని పరీక్షించడం జరుగుతోందని నమ్ముతాడు.

**ఆయనే కదా మిమ్మల్ని భువిలో తన ప్రతినిధిగా చేసినవాడు, మరి మీలో కొందరిని కొందరికి ప్రతిగా ఉన్నతపరిచాడు, తద్వారా మీకు ప్రసాదించబడిన**

وَهُوَ الَّذِىْ جَعَلَكُمْ خَلٰٓئِفَ الْاَرْضِ
وَ رَفَعَ بَعْضَكُمْ فَوْقَ بَعْضٍ دَرَجٰتٍ
لِّيَبْلُوَكُمْ فِىْ مَآ اٰتٰكُمْ ؕ اِنَّ رَبَّكَ

سَرِيْعُ الْعِقَابِ ۖ وَ اِنَّهٗ لَغَفُوْرٌ رَّحِيْمٌ ۝ (الانعام:١٦٥)

**వాటి విషయంలో మిమ్మల్ని పరీక్షించాలని. నిస్సందేహంగా నీ ప్రభువు అతి శీఘ్రంగా శిక్షించేవాడు, నిశ్చయంగా ఆయన క్షమా శీలుడు, కరుణామయుడు.**

***(అన్ఆమ్ : 165)***

ఇదొక అతిస్పష్టమయిన ప్రకటన, ప్రపంచంలో ఏ వ్యక్తికి లేదా ఏ వర్గానికి పరమ ప్రభువు అధికారం, శ్రేష్ఠత, ఉన్నత స్థానం, ధనసంపదలు అనుగ్రహించాడో అవి అతనికి పరీక్షలు. మనిషిని వాటి ద్వారా పరీక్షించడం జరుగుతోంది, అతను తన స్థానాన్ని, స్థితిని ఏ విధంగా వినియోగిస్తున్నాడన్నదే పరీక్ష. బలహీనులు, ఉపేక్షితులు, అగత్యపరుల ఎడల అతని వైఖరి ఏమిటి అన్నదీ పరీక్ష. అతని ఈ వైఖరినిబట్టి అల్లాహ్ అతనితో వ్యవహరిస్తాడు.

ఇదే విషయాన్ని ఈ ఆయత్ క్లుప్తంగా ఇలా తెలుపుతోంది -

اَلَّذِىْ خَلَقَ الْمَوْتَ وَالْحَيٰوةَ لِيَبْلُوَكُمْ اَيُّكُمْ اَحْسَنُ عَمَلًا ؕ وَهُوَ الْعَزِيْزُ الْغَفُوْرُ ۝ (الملک:٢)

**ఎవరయితే జనన మరణాలను సృజించాడో - మిమ్మల్ని పరీక్షించడానికి, మీలో ఎవరు సదాచరణను అవలంబిస్తారో అని - ఆయన మహా శక్తి సంపన్నుడు, ఎంతో అనుగ్రహప్రదాత.** ***(అల్‌ముల్క్ : 2)***

## 2. మానవ మనుగడ అల్లాహ్ నిర్ణయబద్ధం

ప్రపంచంలో అన్ని వైపులా అల్లాహ్ అభీష్టం, నిర్ణయాధికారం సక్రియగా ఉంది. ఇక్కడ పుట్టే ప్రతి మనిషి ఆయన నిర్ణయం ప్రకారమే పుడతాడు. ఆయన ఇతనికి ఎక్కువో తక్కువో జీవన వ్యవధిని ఇష్టపడి ప్రసాదిస్తాడు. ఆ నిర్ణయం ప్రకారమే మనిషి ఇక్కడి నుండి వెనక్కి రప్పించుకోబడతాడు, అప్పుడే మనిషి పరలోక పయనం ప్రారంభమవుతుంది.

يٰۤاَيُّهَا النَّاسُ اِنْ كُنْتُمْ فِىْ رَيْبٍ مِّنَ الْبَعْثِ فَاِنَّا خَلَقْنٰكُمْ مِّنْ تُرَابٍ ثُمَّ مِنْ نُّطْفَةٍ ثُمَّ مِنْ عَلَقَةٍ ثُمَّ مِنْ

**జనులారా, మీకు మరణానంతర జీవితం పట్ల ఏదయినా అనుమానమున్నట్లయితే (చూడండి) మేము మిమ్మల్ని మన్నుతో సృష్టించాము - తిరిగి రేతస్సుతో, ఆపైన రక్తం ముద్దతో, అప్పుడు మాంసం**

مُّضۡغَةٍ مُّخَلَّقَةٍ وَّ غَيۡرِ مُخَلَّقَةٍ لِّنُبَيِّنَ لَكُمۡ ؕ وَ نُقِرُّ فِى الۡاَرۡحَامِ مَا نَشَآءُ اِلٰۤى اَجَلٍ مُّسَمًّى ثُمَّ نُخۡرِجُكُمۡ طِفۡلًا ثُمَّ لِتَبۡلُغُوۡۤا اَشُدَّكُمۡ ۚ وَمِنۡكُمۡ مَّنۡ يُّتَوَفّٰى وَمِنۡكُمۡ مَّنۡ يُّرَدُّ اِلٰۤى اَرۡذَلِ الۡعُمُرِ لِكَيۡلَا يَعۡلَمَ مِنۡۢ بَعۡدِ عِلۡمٍ شَيۡـًٔا ؕ

(الحج:٥)

కండతో, దాని రూపం సంపూర్ణమూ కావచ్చు అసంపూర్ణమూ కావచ్చు- దీని ద్వారా మా సృష్టిశక్తి మీకు విశదపరచాలని ఉద్దేశిస్తాము. అప్పుడు మేము మిమ్మల్ని తల్లుల గర్భాశ యంలో నిర్ణీత సమయం వరకు భద్రపరుస్తాము. ఆ తరువాత మేము మిమ్మల్ని శైశవ స్థితి నుండి తీసి యవ్వనప్రాయం వరకు తీసుకువెడతాము, అలా మీరు యవ్వన శక్తికి చేరాలని. మీలో ఒకరికి మృత్యువు ఆసన్నమవుతుంది, మరొకరు నికృష్ట వయసుకు తిరిగి పంప బడతారు, అప్పుడు అన్నీ ఎరిగి కూడా ఏమీ ఎరుగని స్థితికి చేరిపోతాడు.

***(అల్ హజ్జ్ : 5)***

ఇదే సత్యాన్ని మూ'మిన్ సూరాలోనూ తెలుపడం జరిగింది -

هُوَ الَّذِىۡ خَلَقَكُمۡ مِّنۡ تُرَابٍ ثُمَّ مِنۡ نُّطۡفَةٍ ثُمَّ مِنۡ عَلَقَةٍ ثُمَّ يُخۡرِجُكُمۡ طِفۡلًا ثُمَّ لِتَبۡلُغُوۡۤا اَشُدَّكُمۡ ثُمَّ لِتَكُوۡنُوۡا شُيُوۡخًا ۚ وَمِنۡكُمۡ مَّنۡ يُّتَوَفّٰى مِنۡ قَبۡلُ وَلِتَبۡلُغُوۡۤا اَجَلًا مُّسَمًّى وَّلَعَلَّكُمۡ تَعۡقِلُوۡنَ ○

(المؤمن:٦٧)

ఆయనే మిమ్మల్ని మన్నుతో సృజించిన వాడు, మళ్ళీ రేతస్సుతో, ఆపైన రక్తపు ముద్దతో అటు తరువాత మిమ్మల్ని శిశువు రూపంలో వెలికితీస్తాడు. ఆపైన మీకు వ్యవధినిస్తాడు, మీరు యవ్వన ప్రాయానికి చేరాలని, తరువాత ముసలివారవ్వాలని. మీలో ఎవరయినా ఈ దశకు పూర్వమే మరణిస్తారు - ఎందుకంటే మీరు ఓ నిర్దిష్ట కాలం వరకు చేరిపోవాలని - బహుశా మీరు గమనిస్తారేమోనని, ఆలోచిస్తారేమో నని. ***(అల్ మూ'మిన్ : 67)***

ఈ ఆయత్‌లలో పరమ ప్రభువు అల్లాహ్ శక్తిసామర్థ్యాలు, జనన మరణాల విషయంలో ఆయన ఔచితీవిజ్ఞతలు, నిర్ణయాలను గురించి ప్రస్తావించడం జరిగింది. ఆయన ఏ వ్యక్తికి ఎంత జీవితం ప్రసాదించాలని కోరుకుంటాడో అది అనుగ్రహిస్తాడు.

ఒకరు శైశవంలోనే అంతమయితే మరొకరు సరిగ్గా యవ్వన ప్రాయంలో ఇహలోకాన్ని వీడిపోతాడు, మరొకడు వృద్ధాప్య దశ వరకు చేరి మృత్యువును ఆలింగనం చేసు కుంటాడు. దీని ద్వారా, దేవుని శక్తి వల్ల పరలోకం సంభవించడమూ అసంభవం కాదని వాదించడం జరిగింది. దీని ద్వారా, ఏ వ్యక్తికి ఎంత జీవితం ప్రాప్తించినా అది దైవదత్తమే అన్న విషయమూ ద్యోతకమవుతుంది. దైవం కోరినంత కాలం అతనికి బ్రతికే హక్కు ఉంది; ఎవరయినా అతన్ని ఈ హక్కు నుండి వంచితునిగా చేస్తే అతను పెద్ద అపరాధం చేసినవాడవుతాడు.

## 3. విశ్వం ద్వారా ప్రయోజనం పొందే హక్కు

పరమ ప్రభువు అల్లాహ్ ఈ సువిశాల జగత్తును మానవునికి అత్యంత అనుకూలమయినదిగా సృజించాడు. ఇందులో ప్రపంచ జీవితానికి కావలసిన అత్యుత్తమ సామగ్రి పొందుపరచి ఉంచాడు. భూమీ సముద్రాలు ఇతనికి స్వాధీనం చెయ్యబడ్డాయి. భూమి ఇతని నివాస స్థలం, ఇతని బసకు, జీవనానికి అనువయినదిగా ఇది నిర్మించబడింది; ఇతను దీని గాలి, నీరు, సూర్యుని వేడిమి, చంద్రుని చల్లదనం, రేయింబవళ్ళ భ్రమణం, సముద్రాల లోతు, నదుల ప్రవాహం- అన్నింటి ద్వారా ప్రయోజనం పొందగలడు. వీటినన్నింటినీ తన శ్రేయోలాభాల కొరకు వాడుకోగలడు. అల్లాహ్ ఇతనికి హక్కునిచ్చాడు, మానవునిగా ఎటువంటి అడ్డు అయిపూ లేకుండా ఈ వరప్రసాదాల ద్వారా ప్రయోజనాలు పొందడానికి -

اَللّٰهُ الَّـذِىْ خَلَقَ السَّمٰوٰتِ وَالْاَرْضَ وَ اَنْـزَلَ مِنَ السَّمَـآءِ مَـآءً فَاَخْـرَجَ بِـهٖ مِـنَ الثَّمَرَاتِ رِزْقًـا لَّـكُمْ ۚ وَ سَخَّـرَ لَـكُمُ الْفُلْـكَ لِتَـجْرِىَ فِى الْبَـحْرِ بِـاَمْرِهٖ ۚ وَ سَخَّـرَ لَكُمُ الْاَنْهٰـرَ ۞ وَ سَخَّرَ لَكُمُ الشَّمْسَ وَالْقَمَرَ دَآئِبَيْنِ ۚ وَ سَخَّرَ لَكُمُ الَّيْلَ

**ఆయనే అల్లాహ్, ఆయన ఆకాశాలను, భూమిని సృష్టించినవాడు, ఆకాశాన్నుండి నీటిని కురిపించాడు, తద్వారా మీకు పండ్లు ఫలాల ఉపాధి కల్పించాడు. మీకు ఓడలను అధీనపరిచాడు. అవి ఆయన ఆదేశం మేరకు సముద్రాలలో తేలుతూ పయనిస్తుంటాయి. మీకు నదులనూ అధీన పరిచాడు, మీ కొరకు సూర్యచంద్రులనూ అధీనపరిచాడు. అవి నిత్యం భ్రమణంలో ఉంటాయి. మీ కొరకు రేబవళ్ళను అధీన పరిచాడు, మీకు మీరు ( మీ ప్రకృతి)**

وَالنَّهَارَ ۝ وَ اٰتٰكُمْ مِّنْ كُلِّ مَا سَاَلْتُمُوْهُ ؕ وَ اِنْ تَعُدُّوْا نِعْمَتَ اللّٰهِ لَا تُحْصُوْهَا ؕ اِنَّ الْاِنْسَانَ لَظَلُوْمٌ كَفَّارٌ ۝ (ابراہیم:۳۲-۳۴)

కోరినవన్నీ బహూకరించాడు. మీరు దేవుని వరప్రసాదాలను లెక్కపెట్టాలని అనుకుంటే లెక్కపెట్టలేరు. నిస్సందేహంగా మానవుడు మహా దుర్మార్గుడు, మహా కృతఘ్నుడు. *(ఇబ్రాహీమ్ : 32 - 34)*

ఇదే మాటను మరో చోట ఈ పదాలలో సెలవీయబడినది:

اَلَمْ تَرَوْا اَنَّ اللّٰهَ سَخَّرَ لَكُمْ مَّا فِى السَّمٰوٰتِ وَمَا فِى الْاَرْضِ وَ اَسْبَغَ عَلَيْكُمْ نِعَمَهٗ ظَاهِرَةً وَّ بَاطِنَةً ؕ وَمِنَ النَّاسِ مَنْ يُّجَادِلُ فِى اللّٰهِ بِغَيْرِ عِلْمٍ وَّلَا هُدًى وَّلَا كِتٰبٍ مُّنِيْرٍ ۝ (لقمٰن:۲۰)

మీరు గమనించలేదా, అల్లాహ్ మీ కొరకు ఆకాశాలలో ఉన్నవీ, భూమిలో ఉన్నవి సకల వస్తువుల్ని (మీ సేవలో) అధీనపరిచాడు. ఇంకా మీ కొరకు తన వరప్రసాదాలన్నీ వ్యక్తమయ్యేవీ గుప్తమయినవీ అన్నీ పరిపూర్ణంగావించాడు. జనుల్లో కొందరు అల్లాహ్‌ను గురించి, ఎటువంటి జ్ఞానం లేకుండానే, ఎటువంటి మార్గబోధన లేకుండానే ప్రకాశమానమయిన ఏ గ్రంథమూ లేకుండానే జగదాలాడుతుంటారు. *(లుక్మాన్ : 20)*

దీన్నిబట్టి తేలేదేమిటంటే, అల్లాహ్ మానవుల కొరకు ఈ ప్రపంచంలో అసంఖ్యాకమయిన వరప్రసాదాలు సృష్టించాడు. ఆయనే వీటి ద్వారా ప్రయోజనం పొందే హక్కునూ ప్రసాదించాడు. అల్లాహ్ అనుగ్రహించిన ఈ వరప్రసాదాలను అతన్నుండి ఎవ్వరూ పరిహరించలేరు. ఎవరయినా అలా చేస్తే అతను అతిహీనమయిన దౌర్జన్యానికి ఒడిగట్టినవాడవుతాడు, తన హద్దులను మీరినవాడవుతాడు.

## 4. మానవుడు కేవలం ఒక్కే దైవానికి దాసుడు

మనిషి ఏకైక దైవానికి దాసుడు. ఆయన దాస్యం, విధేయతలనే అతను పాటించాలి. అతను ఇక్కడ మరెవరికీ దాసుడు కాడు. కాబట్టి అన్ని రకాల దాస్యాల నుండి స్వేచ్ఛ పొంది మనడం అతని హక్కు. వాస్తవానికి అతను స్వేచ్ఛ గలవాడయ్యే మనగలగాలి. ఏ మనిషికీ మరో మనిషిని తన దాసునిగా చేసుకునే అధికారం లేదు,

బలవంతాన తన దాస్యం చేయించుకునే హక్కులేదు. ఫిర్ఔన్, బనీ ఇస్రాయీల్ పట్ల ఇలాగే వ్యవహరించాడు. అతను వారిని తన దాసులుగా చేసుకున్నాడు. మహనీయ మూసా (అ) అతనికి వ్యతిరేకంగా ఎలుగెత్తిచాటారు. తాను దైవసందేశహరుణ్ణని, దైవదాస్య సందేశాన్ని అందజేస్తున్నానని అతనికి చెప్పారు. ఆయన సందేశంలో ఓ కోణం బనీ ఇస్రాయీల్‌ని అతను ఏ యాతనకు గురిచేసిపెట్టాడో దాన్ని అతను మానుకోవాలన్నదీ, వారిని ఈజిప్ట్ వదలి వలసపోయేందుకు అనుమతించవలసిం దన్నదీ ఉంది. దీనికి బదులుగా ఫిర్ఔన్, తాను మహనీయ మూసా (అ) పట్ల ఆయన ప్రారంభ కాలంలో చేసిన ఉపకారాలను ప్రస్తావించాడు. దానికి మూసా (అ) ఇలా అన్నారు:

وَ تِلْكَ نِعْمَةٌ تَمُنُّهَا عَلَيَّ اَنْ عَبَّدْتَّ بَنِيٓ اِسْرَآئِيْلَ○

(الشعراء:٢٢)

**నీవు ఎత్తిపొడుస్తున్న ఉపకారం చెయ్యి దానికి కారణం నీవు బనీ ఇస్రాయీల్‌ని దాసులుగా చేసిపెట్టుకోవడం.**

***(అష్ షూ'రా : 22)***

ఫిర్ఔన్, హజ్రత్ మూసా (అ) పట్ల ఏదయినా మేలు చేసి ఉన్నా, ఒక ప్రత్యేక వ్యక్తి పట్ల సానుభూతి చూపడం, మానవత రీత్యా వ్యవహరించడం, ఆ వ్యక్తికి చెందిన జాతినంతటినీ బలవంతపు పంజా క్రింద అణగద్రొక్కడానికి అతనికి తగిన అనుమతినివ్వదు, దాన్ని దాస్య జీవితం గడిపేందుకు బలవంతపెట్టే హక్కునివ్వదు, దాని స్వాతంత్ర్యపు హక్కు దానికుందీ, ఉంటుంది. నీవు ప్రస్తావించే మేలుకు అసలు కారణం కూడా ఆ ఊడిగం చేసే జాతిని సమూలంగా తుడిచిపెట్టాలని నీవు పన్ను తున్న ఎత్తుగడ నుండి నేను భద్రంగా ఉండాలన్నదే. నేను ఆ బానిస జాతికి చెందిన సంతానమే అని నీవు గ్రహించలేకపోయావు.

హజ్రత్ మూసా (అ) సందేశాన్నీ, బనీ ఇస్రాయీల్ విముక్తి కోరికనూ ఫిర్ఔన్ అసహ్యంగా తృణీకరించాడు. అతను ఇలా అన్నాడు, మూసా, అతని సోదరుడు హారూన్ సంబంధం మాకు చెందిన బానిస జాతితోనే ఉంది. మేము అతన్ని దైవ సందేశహరునిగా, మాకు నాయకునిగా ఎలా స్వీకరించగలం? ఫిర్ఔన్, అతని జాత్యహంకారం, పరమప్రభువు మార్గబోధనను స్వీకరించడంలో అడ్డునిలిచింది. అప్పుడు అతన్ని నీల్ నదిలో ముంచివేయడం జరిగింది.

فَقَالُوٓا اَنُؤۡمِنُ لِبَشَرَيۡنِ مِثۡلِنَا وَ قَوۡمُهُمَا لَنَا عٰبِدُوۡنَ۝ فَكَذَّبُوۡهُمَا فَكَانُوۡا مِنَ الۡمُهۡلَكِيۡنَ۝

(المؤمنون:٤٧،٤٨)

వారిలా అన్నారు, మేము మావంటి ఇద్దరు మనుషులను (మూసా, హారూన్‌లను) విశ్వసించాలా? వాస్తవానికి వారి జాతి మాకు లోబడి విధేయమయినదే. కనుక వారు వారిరువురిని తిరస్కరించారు, హతమార్చబడిన జాతుల కోవకు చెందిన వారయిపోయారు.

*(అల్ మూ'మినూన్ : 47, 48)*

ఇది అల్లాహ్ పక్షాన ప్రకటన, ఆయన శాసనం తత్కాలపు ఎటువంటి ఫిర్‌ఔన్‌నయినా అసలే భరించదు. ప్రభుత, అధికారం అన్నవి ఒక వర్గం మరో వర్గాన్ని లోబరచుకుని పాలితులుగా బానిసలుగా చేసుకోవడానికి కాదు. రాజ్యంలో ఏ ఒక్కరి హక్కు మరొకరికన్నా తక్కువ కాదు. అందరి హక్కులు సమానమయినవి. ప్రభుత్వం ఏ మాత్రం ఆ హక్కుల ఎడల కావలిగా వ్యవహరించాలి.

## 5. మతపరమయిన దాస్యం

రాజకీయ దాస్యంతోపాటు మతపరమయిన దాస్యం కూడా ఇస్లామ్ ప్రకారం విరుద్ధమయినది. అది పోపు పాలన, బ్రాహ్మణత్వంలాంటి మతపరమయిన సంస్థలను అంతమొందించింది. మనిషి, ప్రవక్తల బోధనల ప్రకారం దైవంతో నేరుగా సంబంధం ఏర్పరచుకోగలడని, ఆయన్ని సంస్మరించగలడని, ఆయన ఆరాధన చేయగలడని, ఆయనకు మొక్కుబడులు, త్యాగాలు సమర్పించుకోగలడని చాటింది. కష్టాల్లో ఆయన వైపునకు మరలి, ఆయనకు మొరపెట్టుకోగలడని తెలిపింది.

وَاِذَا سَاَلَكَ عِبَادِىۡ عَنِّىۡ فَاِنِّىۡ قَرِيۡبٌ ؕ اُجِيۡبُ دَعۡوَةَ الدَّاعِ اِذَا دَعَانِ فَلۡيَسۡتَجِيۡبُوۡا لِىۡ وَلۡيُؤۡمِنُوۡا بِىۡ لَعَلَّهُمۡ يَرۡشُدُوۡنَ۝

(البقرة:١٨٦)

నిన్ను నా దాసులు నన్ను గురించి ప్రశ్నించినట్లయితే నేను అతి సమీపాన ఉన్నానని తెలుపు. మొరపెట్టుకునేవాని మొరను వింటాను, దాన్ని స్వీకరిస్తాను. కాగా వారున్నూ నా ఆదేశాలను పాలించాలి, నన్ను విశ్వసించాలి; తద్వారా వారు సన్మార్గ బోధన పొందగలరని ఆశించవచ్చు.

*(అల్ బకర : 186)*

అల్లాహ్‌తో సంబంధానికి ఏ దేవి, దేవత, లేదా ఏ పోపు, పండితుడు, పురోహితుడు- ఎవరి మాధ్యమమూ అవసరం లేదు.

اَلاَ لِلّٰهِ الدِّيْنُ الْخَالِصُ ط وَالَّذِيْنَ اتَّخَذُوْا مِنْ دُوْنِهٖٓ اَوْلِيَآءَ مَا نَعْبُدُهُمْ اِلَّا لِيُقَرِّبُوْنَآ اِلَى اللّٰهِ زُلْفٰى ط اِنَّ اللّٰهَ يَحْكُمُ بَيْنَهُمْ فِىْ مَا هُمْ فِيْهِ يَخْتَلِفُوْنَ ۵ اِنَّ اللّٰهَ لاَ يَهْدِىْ مَنْ هُوَ كٰذِبٌ كَفَّارٌ ○

(الزمر:٣)

జాగ్రత్త, ప్రత్యేకమయిన శుద్ధదాస్యం అల్లాహ్‌కే చెందినది. ఎవరయితే ఆయన్ని కాదని ఇతర సమర్థకుల్ని కల్పించుకున్నారో వారిని గురించి వారు, మేమయితే వారిని పూజించేది వారు మమ్మల్ని దైవంతో సన్నిహితం చేస్తారనే అని అంటారు. నిస్సందేహంగా, వారు నేడు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేస్తున్న విషయాల పట్ల వారి మధ్యన తీర్పు చేసి తీరుతాడు. అల్లాహ్, అబద్ధాలాడే వానికీ, సత్యాన్ని తిరస్కరించేవానికీ నిశ్చయంగా సన్మార్గం చూపడు. *(అజ్ జుమర్ : 3)*

దీనికి అతి స్పష్టమయిన అర్థం ఏమిటంటే, రాజకీయంగాను, మతపరంగానూ ఏ రూపంలోనూ మానవుణ్ణి ఇతరులకు లోబడినవానిగా చేయడం ఖండితంగా అధర్మం. మానవునికి స్వేచ్ఛా భాగ్యం లభించడం, అతను ఏ వ్యక్తికి గాని మరే సంస్థకుగాని బానిస కాకుండా మనడం అతని హక్కు.

## 6. మానవుడు ఆదరణీయుడు

అల్లాహ్ మానవునికి తన ఇతర అసంఖ్యాక సృష్టితాలపైన ఘనత, శ్రేష్ఠత నిచ్చాడు.

وَلَقَدْ كَرَّمْنَا بَنِىْٓ اٰدَمَ وَحَمَلْنٰهُمْ فِى الْبَرِّ وَالْبَحْرِ وَرَزَقْنٰهُمْ مِّنَ الطَّيِّبٰتِ وَفَضَّلْنٰهُمْ عَلٰى كَثِيْرٍ مِّمَّنْ خَلَقْنَا تَفْضِيْلاً ○

(الاسراء:٧٠)

మేము ఆదమ్ సంతానానికి గౌరవాదరణలు అనుగ్రహించాము. నేలపైనా నీటిలోనా వారికి ప్రయాణానికి వాహనమిచ్చాము. వారి అన్నపానీయాలకు పరిశుద్ధ పదార్థాలను ప్రసాదించాము. మా సృష్టితాలు అనేకంపైన వారికి ఘనత నిచ్చాము. *(అల్ ఇస్రా : 70)*

మానవునికి ఇతర సృష్టితాలపైన గల ఘనత, శ్రేష్ఠతలలో కొన్ని కోణాలను స్వయంగా దివ్యఖుర్‌ఆన్ అతి స్పష్టంగా వక్కాణించింది, కొన్నింటి విషయంలో సంకేతప్రాయంగా నుడివింది.

అల్లాహ్ మానవునికి అత్యుత్తమ సృజనను అనుగ్రహించాడు. అతను తన శారీరక నిర్మాణం, రూపురేఖలు, ఒడ్డూ పొడవు, అవయవ సౌష్టవం, బాహ్యారూపం దృష్ట్యా ప్రపంచంలో అత్యంత సుందరమయిన సృష్టి. అత్ తీన్ సూరాలో ఇలా ఉంది:

وَلَقَدْ خَلَقْنَا الْإِنْسَانَ فِيْٓ اَحْسَنِ تَقْوِيْمٍ○ (التين:۴)

**మేము మానవుణ్ణి అత్యంత సుందర రూపంలో సృష్టించాము. *(అత్ తీన్:4)***

మరో చోట ఇలా ఉంది:

وَصَوَّرَكُمْ فَاَحْسَنَ صُوَرَكُمْ (التغابن:۳)

**ఆయన మీ రూపురేఖల్ని తీర్చిదిద్దాడు, మీకు ఎంతో అందమయిన రూపు రేఖల్ని ప్రసాదించాడు. *(అత్ తగాబున్ : 4)***

మరో సందర్భంలో ఇలా సెలవిచ్చాడు:

اَلَّذِیْ خَلَقَکَ فَسَوّٰکَ فَعَدَلَکَ○ فِیْٓ اَیِّ صُوْرَةٍ مَّا شَآءَ رَکَّبَکَ○ (الانفطار:۴)

**నిన్ను సృష్టించిన ఆ దైవం నీ అవయవాలను పొందికగా, సవ్యంగా రూపు దిద్దాడు, వాటిలో సమతూకాన్ని, సామంజస్యతను రూపొందించాడు, ఏ రూపంలో తలిస్తే ఆ రూపంలో నిన్ను ఏర్చికూర్చాడు.**

***(అల్ ఇన్‌ఫితార్ : 4)***

మానవుడు మాటలాడే జీవి. అతనికి మాటలాడే శక్తి ప్రసాదించబడింది. అతనికి మాటలాడే సామర్థ్యం కలదు. తన నోటితో తాను తలచినదేమో ప్రకటించగలడు.

خَلَقَ الْإِنْسَانَ○ عَلَّمَهُ الْبَيَانَ○ (الرحمٰن:۳،۴)

**ఆయన మానవుణ్ణి సృష్టించాడు; అతనికి మాటలాడటం నేర్పించాడు.**

***(అర్ రహ్మాన్ : 3, 4)***

కలం ద్వారానూ అతను తన అభిప్రాయాలను వ్యక్తం చేయగలడు.

**اَلَّـذِیْ عَلَّمَ بِالْقَـلَمِ○ (العلق:۴)**

**ఆయన మానవునికి కలం ద్వారా విద్య నేర్పాడు.** ***(అల్ అలక్ : 4)***

ఈ ప్రత్యేకత మరే ప్రాణికీ లేదు; అది నోరు, కలం కలిగి వాటి ద్వారా తన ఆలోచనల్ని ఇతరులకు తెలుపజాలదు. ఇవే గనక మానవుని నుండి పరిహరించబడితే అతను పశుప్రాయమయిపోతాడు. అల్లాహ్ మానవునికి ఉత్తమ శరీరంతోపాటు మనో మస్తిష్కాలను సయితం ప్రసాదించాడు.

**وَجَعَلَ لَكُمُ السَّمْعَ وَالْاَبْصَارَ وَالْاَفْئِدَةَ ؕ قَلِیْلاً مَّا تَشْكُرُوْنَ○ (السجدة:۹)**

**ఆయన మీకు చెవులూ కళ్ళూ హృదయం ప్రసాదించాడు. కాని మీరు ఆయనకు కృతజ్ఞులవడం బహు అరుదు.** ***(అస్ సజ్ద : 9)***

**وَاللّٰهُ اَخْرَجَكُمْ مِّنْ بُطُوْنِ اُمَّهٰتِكُمْ لاَ تَعْلَمُوْنَ شَیْئًا ۙ وَّجَعَلَ لَكُمُ السَّمْعَ وَالْاَبْصَارَ وَالْاَفْئِدَةَ ۙ لَعَلَّكُمْ تَشْكُرُوْنَ○ (النحل:۷۸)**

**అల్లాహ్ మిమ్మల్ని మీ తల్లుల కడుపులలో నుండి వెలికితీశాడు- అప్పుడు మీకు ఏ విషయమూ తెలియదు. (ఇంకా) ఆయన మీకు చెవులు, కళ్ళు, హృదయం అనుగ్రహించాడు. (తద్వారా మీరు అనేక విషయాలను తెలుసుకో గలిగారు) అలా, మీరు కృతజ్ఞులవ్వాలని చెయ్యడం జరిగింది.** ***(అన్ నహ్ల్ : 78)***

మనిషికి ఆలోచించే అర్థం చేసుకునే, పరిశీలించే గమనించే సామర్థ్యం కలదు. అతను సంఘటనల ద్వారా ఫలితాలను రాబడతాడు, అనునిత్యం సరికొత్త ప్రయోగాలు చేస్తుంటాడు. అత్యంత ఆధునిక పరిశ్రమ, చేతిపనులు అతని ప్రయత్నా లకు ఫలితంగా ఉత్పన్నమయినవే. ఆశ్చర్యకరమయిన ఆవిష్కరణలు, సృజనలు అతని ద్వారానే వెలుగు చూస్తాయి. అతను తన కొరకు కొంగ్రొత్త సాధనాలను అన్వేషిస్తుంటాడు. ఈ విధంగా భౌతిక వృద్ధివికాసాల వైపునకు అతను ముందడుగు వేస్తుంటాడు.

వివేచన ఆధారంగా మనిషి మంచీచెడుల మధ్య వ్యత్యాసాన్ని పాటిస్తాడు, పనుల మంచీ చెబ్బరలను, సవ్యాపసవ్యాలను నిర్ణయిస్తాడు. వ్యవహారాల్లో తన అభిప్రాయాన్ని నిర్దిష్టపరుస్తాడు. తన ఇష్టంతో ఏదో ఒక కోణాన్ని అవలంబిస్తాడు. ఇదే మహత్తు మనిషిని ఒక బాధ్యతాయుత వ్యక్తిగా చేస్తుంది.

ఇవి మానవుని గౌరవాదరణలకు సంబంధించిన కొన్ని కోణాలు. వీటిని వ్యతిరేకించడం దైవం ఇతనికి ప్రసాదించిన ఈ గౌరవాదరణలకు ప్రతికూలమయిన విషయం. మానవ స్థానం నుండి అతను దిగజారి పశువు స్థానానికి చేరిపోయేలా మానవుని పట్ల వ్యవహరించడం అసాంతం అత్యాచారం. మానవ గౌరవాదరణలకు ప్రతికూలమయిన ప్రతి విషయాన్ని ఇస్లామ్ వ్యతిరేకిస్తుంది. ఆకలిదప్పులు, ఆహార కొరత, అపరిశుద్ధమయిన ఆహారం తినడానికి మానవుడు అశక్తుడవడం, అసాధారణ మయిన, భరించరాని కష్టం, శ్రమలను అతనిపైన మోపడం, మానవునికి వైద్య సౌకర్యాలు లేకపోవడం, మానవుడు తన ప్రకృతిసిద్ధమయిన నిర్మాణం కోల్పోయేటటు వంటి శిక్షలు విధించడం- ఇవన్నీ అతని సృజన సౌందర్యాన్ని వికృతం చేసే విషయాలు. ఇటువంటి అమానుష వైఖరి నవలంబించడాన్ని ఇస్లామ్ ఎటువంటి పరిస్థితిలోనూ అనుమతించదు. అదే విధంగా మానవుణ్ణి విద్యాకాంతికి దూరం చెయ్యడం, తద్వారా అతని ఆలోచనాశక్తికి వికాసం ప్రాప్తం కాకుండా చెయ్యడం, అతని బౌద్ధికశక్తులు నిరుపయోగమయి స్తబ్దతకు గురి అయ్యేలా అతని నోటికీ కలానికీ బంధనాలు విధించడం- ఇవన్నీ అక్రమ చర్యలు. ఇవన్నీ మానవాదరణకు అత్యంతా వశ్యకమయిన అనివార్య విషయాలు. ఇస్లామ్ ఇవన్నీ అత్యంత సుందరంగా సవ్యంగా పరిపూర్ణమవ్వాలని ఆశిస్తుంది.

## 7. అల్లాహ్ నిజమయిన పాలకుడు

మానవుడు సామూహికతాభిలాషి. అందరి నుండి దూరమయి జీవించడం అతని ప్రకృతికి విరుద్ధం. అతను సమాజంలో ఒక భాగంగా జీవించాలని కోరుకు ంటాడు. సమాజం అతని మౌలిక అవశ్యకత కూడా. అతని జీవితావసరాలు అతని సామాజిక జీవితం గడిపేందుకు బలవంతపెడతాయి. అతను ఇతరుల సహాయంతోనే తన అవసరాలను నెరవేర్చుకోగలుగుతాడు. సమాజంలో ఒక వ్యక్తిగా అతనికి కొన్ని హక్కులున్నాయి. అతనిపైన కొన్ని బాధ్యతలూ ఉన్నాయి. ఇతని ఈ హక్కుల్ని నెరవేర్చడం ప్రతి నాగరిక సమాజానికి తప్పనిసరి. మరే బాధ్యతలు సమాజం తరఫున అతనిపైనా మోపబడతాయో వాటిని నెరవేర్చడం అతని బాధ్యత. ఈ హక్కులు, బాధ్యతలు వ్యక్తిపైన మోపబడతాయి, కుటుంబం, సమాజం, తెగతోపాటు రాజ్యం కూడా తన పాత్రను తప్పనిసరిగా ఇందులో నిర్వహించవలసి ఉంటుంది.

ఈ హక్కులు, బాధ్యతల్ని ఎవరు నిర్ణయిస్తారు. స్వయంగా వ్యక్తే నిర్ణయించుకోవాలా లేదా మరే వ్యక్తి అయినా నిర్ణయిస్తాడా లేదా సమాజంలోని సంప్రదాయాల ద్వారా దీన్ని నిర్ణయించడం జరుగుతుందా? లేదా రాజ్యం ప్రభుత్వం దీన్ని నిర్ణయిస్తుందా లేదా ఇవన్నీ ఆయా పరిధుల్లో తమ నిర్ణయాలు వేర్వేరుగా తీసుకుంటారా లేక అందరూ కలసి ఉమ్మడి నిర్ణయాలు గైకొంటారా? ఇస్లామ్ దీనికి సమాధానంగా తెలిపేదేమిటంటే, దీన్ని నిర్ణయించే అధికారం కేవలం అల్లాహ్‌కు మాత్రమే ఉంది. ఆయనే చట్ట నిర్మాత, చట్టాన్ని నిర్మించే హక్కు ఆయనకు మాత్రమే ఉంది. ఆయనే ప్రతి ఒక్కరి హక్కును సయితం నిర్ధారిస్తాడు, బాధ్యతలనూ విశదపరు స్తాడు. వ్యక్తి, సమాజం, ప్రభుత్వం- అందరూ ఆయనకు బద్ధులయినవారే. చట్ట నిర్మాణం బాధ్యత, హక్కు ఆయన మరొకరికెవరికీ అనుగ్రహించలేదు. అలాగే ఏ మతపరమయిన వ్యక్తిత్వానికీ, సంస్థకూ, సమాజానికీ, రాజ్యానికీ ఆయన ఈ హక్కునివ్వలేదు. కొన్ని సందర్భాలలో మానవ నిర్మిత శాసనానికి మతపరమయిన పవిత్రతనివ్వడం జరుగుతుంది. ఇస్లామ్ దీన్ని తప్పయినదని, మిథ్య అని పరిగణిస్తుంది.

అరబ్బులు స్వయంగా కొన్ని పదార్థాలను హలాల్, లేదా హరామ్‌గా నిర్ధారించి దానికి దైవ శాసన రూపాన్నిచ్చారు. దీన్ని ఖుర్ఆన్ కఠినంగా విమర్శించింది. ఒక పదార్థాన్ని హరామ్‌గానో హలాల్‌గానో నిర్ణయించడం కేవలం అల్లాహ్ అధికారం అని చాటింది. ఎవరయినా స్వయంగా ఈ పనికి పూనుకుని, దాన్ని అల్లాహ్‌కు ఆపాదించడం అల్లాహ్ సన్నిధిలో అది అపవాదుగా, కల్పనాశిల్పంగా పరిగణించబడుతుంది. దీనికి పాల్పడిన వారు ఇహపరాల్లో సాఫల్యం పొందలేరు.

وَلاَ تَقُوْلُوْا لِمَا تَصِفُ اَلْسِنَتُكُمُ الْكَذِبَ هٰذَا حَلٰلٌ وَّ هٰذَا حَرَامٌ لِّتَفْتَرُوْا عَلَى اللّٰهِ الْكَذِبَ ۗ اِنَّ الَّذِيْنَ يَفْتَرُوْنَ عَلَى اللّٰهِ الْكَذِبَ لاَ يُفْلِحُوْنَ ۝ (النحل:١١٦)

**మీ నోళ్ళు చెప్పే అబద్ధాల ఆధారంగా ఇది హలాల్ అని, ఇది హరామ్ అనీ పలక్కండి. ఈ విధంగా మీరు అల్లాహ్ పైన అబద్ధపు ఆరోపణ చేస్తున్నారన్న మాట. మరెవరయితే అల్లాహ్ పైన అపవాదును ఆరోపిస్తారో వారు సఫలత నొందలేరు. (అన్ నహ్ల్ : 116)**

యూదులూ క్రైస్తవులు తమ పండితులు, ధర్మశాస్త్రవేత్తలు తమ మత గురువులు పూర్తిగా చట్టనిర్మాణం చేసే హక్కునిచ్చారు. వారు ధర్మసమ్మతమయిన వాటినీ

ధర్మసమ్మతం కానివాటినీ స్వేచ్ఛగా నిర్ణయించే వారు. వారు దేన్ని ధర్మసమ్మతంగా నిర్ణయిస్తే అది ధర్మసమ్మతంగా పరిగణించబడేది. మరి దేన్ని ధర్మసమ్మతం కాదని ఆదేశపత్రం జారీ చేస్తారో అది ధర్మసమ్మతం కాకపోయేది. ఖుర్‌ఆన్ ఈ వైఖరిని గట్టిగా ఖండించింది. ఏ పండితునికీ, ఏ ధర్మవేత్తకు, ఏ భిక్షువుకు, మరే సన్యాసికీ, తాను స్వయంగా చట్టనిర్మాత కాగల, చట్ట నిర్మాణం చేయగల అధికారం లేదు. ఇది కేవలం అల్లాహ్ బాధ్యత, ఆయనే తన దాసులయిన మానవులకు షరీఅత్ (ధర్మ శాస్త్రాన్ని) శాసనాలను అందజేస్తాడు.

اِتَّخَذُوْٓا اَحْبَارَهُمْ وَ رُهْبَانَهُمْ اَرْبَابًا مِّنْ دُوْنِ اللّٰهِ وَالْمَسِيْحَ ابْنَ مَرْيَمَ ۚ وَمَآ اُمِرُوْٓا اِلَّا لِيَعْبُدُوْٓا اِلٰهًا وَّاحِدًا ۚ لَآ اِلٰهَ اِلَّا هُوَ ۭ سُبْحٰنَهٗ عَمَّا يُشْرِكُوْنَ ○
(التوبة:٣١)

**వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులు, ధర్మవేత్తలు, సన్యాసుల్ని తమ ప్రభువులుగా చేసుకున్నారు, మర్యమ్ సుతుడు క్రీస్తును సయితం వారలా భావించారు. వాస్తవానికి వారికి ఒకే దైవాన్ని ఆరాధించాలని ఆదేశించడం జరిగింది. ఆయన తప్ప మరే దైవం లేదని బోధించడం జరిగింది. ఆయన పరిశుద్ధుడు, వారు పాల్పడే షిర్క్ (బహుదైవభావన)కు ఆయన అతీతుడు.** ***(అత్ తౌబా : 31)***

గ్రంథవహులకు తౌరాత్ ఇవ్వబడింది. దాని వెలుగులో జీవితం గరపాలని, తమ వ్యవహారాలను నిర్ణయించుకోవాలని బోధించడం జరిగింది. దాని తొలినాటి అనుయాయులు ఈ బోధనను అనుసరించారు, ఆచరించారు. వారు దాన్ని పూర్తిగా నిబద్ధతతో పాటించారు. ప్రపంచం సమక్షంలో దానికి సాక్షులుగా నిలిచారు. కాని ఆ తరువాత వారిలో చెడుగు చోటు చేసుకున్నప్పుడు దైవగ్రంథాన్ని వెనక్కి నెట్టివేశారు. దానికి భిన్నంగా స్వేచ్ఛాయుత ఫత్వాలు, నిర్ణయాలు, తీర్పులు అల్లాహ్ గ్రంథం స్థానం లోకి వచ్చాయి. తద్వారా వారిలో తిరస్కారం, మార్గవిహీనతలు, ఫలితంగా వినాశం ప్రారంభమయ్యాయి.

اِنَّآ اَنْزَلْنَا التَّوْرٰىةَ فِيْهَا هُدًى وَّنُوْرٌ ۚ يَحْكُمُ بِهَا النَّبِيُّوْنَ الَّذِيْنَ اَسْلَمُوْا لِلَّذِيْنَ هَادُوْا وَ الرَّبّٰنِيُّوْنَ وَالْاَحْبَارُ

**మేము తౌరాత్‌ని అవతరింపజేశాము. అందులో సన్మార్గ బోధన, జ్యోతి ఉన్నాయి. దానికనుగుణంగానే ప్రవక్తలు, అల్లాహ్ విధేయులు, వారి ధర్మభిక్షువులు, పండి**

بِمَا اسْتُحْفِظُوْا مِنْ كِتٰبِ اللّٰهِ وَكَانُوْا عَلَيْهِ شُهَدَآءَ ۚ فَلَا تَخْشَوُا النَّاسَ وَاخْشَوْنِ وَلَا تَشْتَرُوْا بِاٰيٰتِيْ ثَمَنًا قَلِيْلًا ۗ وَمَنْ لَّمْ يَحْكُمْ بِمَآ اَنْزَلَ اللّٰهُ فَاُولٰٓئِكَ هُمُ الْكٰفِرُوْنَ ○ (المائدة:۴۴)

**తులు యూదుల వ్యవహారాలయి తీర్పులు చేసేవారు. వారిని దైవగ్రంథాన్ని పరిరక్షిం చాలని కోరడమయినది. వారిని దానికి సాక్షులుగానూ చేయడమయినది. కనుక నీవు జనులకు భయపడవద్దు, నాకే భయ పడు. నా ఆయత్‌ల ద్వారా అత్యల్ప మయిన ప్రయోజనాలను కొనుక్కోకండి. ఎవరయితే అల్లాహ్ అవతరింపజేసిన ఈ ఆదేశాలకను గుణంగా తీర్పులు చేయరో వారే దైవ తిరస్కారులు.** ***(అల్ మాఇద:44)***

ఈ విషయం ఏ వ్యక్తి లేదా ఏ సంస్థకు చెందిన అతీతమయిన ఆధిక్యతను, నిర్నిబంధమయిన పాలనాధికారాన్ని, దాని భావనను సయితం అంతమొందించింది. ఒకరి హక్కులను నిర్ణయించే హక్కు లేదా వారి బాధ్యతల్ని తెలిపే బాధ్యతను ఏ ఒక్కరికీ అది ప్రదానం చేయలేదు. మానవుడు స్వయంగానూ తన హక్కుల్ని, బాధ్యతల్ని నిర్ణయించుకునేందుకు అధికారం కలిగిలేడు. ఈ విషయంలో ప్రతి ఒక్కరు దైవం ప్రసాదించిన చట్టం వైపునకు మరలవలసిందే.

## 8. అన్వయ కృషికి హక్కు ఉంది

అయితే ఇప్పుడు ప్రస్తావించిన విషయాలలో, అల్లాహ్ ఆదేశాల పరిధిలో మనిషి చేసే చట్ట నిర్మాణం గురించి చెప్పడం జరగలేదు. ఈ చట్ట నిర్మాణానికి అనుమతి స్వయంగా అల్లాహ్ తానే ఇచ్చాడు. ఇలా దైవాదేశాల పరిధిలో మనిషి చట్టం చేసేందుకు జరిపే కృషినే ధార్మిక పరిభాషలో 'తఫక్కుహ్' 'ఇజ్తిహాద్' అని అంటారు. దీని పరిధి సువిస్తరమయింది. ఇలాంటి అవకాశం ఒక సజీవమయిన శాశ్వత శాసనాంగానికి అనివార్యం. ఇదే లేకపోతే అది అనుదినం మార్పు చెందే జీవితంతో పాటు తోడుగా సాగజాలదు.

దివ్యఖుర్ఆన్‌లో మునాఫికులను (కపటులను) గురించి వారు, శాంతికి, భయానికి సంబంధించిన సమాచారాలను, ఎటువంటి సత్యాసత్యాల బోధన లేకుండా వ్యాపింపజేసేవారు. దానివల్ల దేశంలో శాంతిభద్రతల ముప్పు వాటిల్లేది. ఈ విషయంలో సరయిన పద్ధతి ఏదీ అన్నదాన్ని ఇలా విశదీకరించడం జరిగింది.

وَ اِذَا جَآءَ هُمْ اَمْرٌ مِّنَ الْاَمْنِ اَوِ الْخَوْفِ اَذَاعُوْا بِهٖ ؕ وَلَوْ رَدُّوْهُ اِلَى الرَّسُوْلِ وَ اِلٰى اُولِى الْاَمْرِ مِنْهُمْ لَعَلِمَهُ الَّذِيْنَ يَسْتَنْبِطُوْنَهٗ مِنْهُمْ ؕ وَلَوْلَا فَضْلُ اللّٰهِ عَلَيْكُمْ وَرَحْمَتُهٗ لَا تَّبَعْتُمُ الشَّيْطٰنَ اِلَّا قَلِيْلًا ۝ (النساء:٨٣)

**ఏదయినా కాస్త తృప్తికరమయిన లేదా భయంగొలిపే వార్త విన్నంతనే వీరు దాన్ని సర్వత్రా వ్యాపింపజేస్తారు; దానికి బదులుగా వారు దాన్ని ప్రవక్త వద్దకు, తమ బాధ్యులయిన నాయకుల వద్దకు చేరవేసి నట్లయితే, వారి మధ్య అవగాహనా సామర్థ్యమున్న వారికి తెలిసిపోయేది, దాని ద్వారా సరయిన ఫలితాన్ని గ్రహించడం సాధ్యమయ్యేది. మీపైన అల్లాహ్ అనుగ్రహం, ఆయన కారుణ్యం లేకపోతే (మీ బలహీనతల కారణంగా) కొందరు తప్ప మీరందరూ షైతాన్ వెంటపడి పొయ్యేవారు.** ***(అన్ నిసా : 83)***

ఇందులో అతి స్పష్టంగా నిర్దేశించడం జరిగింది, ప్రభుత్వ వ్యవహా రాల్లో సున్నితమయిన వాటి విషయంలో ఏదో అనుమానం ఆధారంగా, అంచనాల ఆధారంగా వ్యవహారాలను నెరపరాదు. ఏవయినా వదంతులు వినవస్తే వాటిని వ్యాపింపజేయడానికి బదులు దైవ సందేశహరులు, బాధ్యులయిన అధికారులకు, అసలు విషయం లోతుపాతుల్లోకి చూసే అవగాహనాశక్తి గలవారికి వినిపించాలని, వారికి అందజేయాలని చెప్పడం జరిగింది. దైవసందేశహరులు (స) జీవితకాలంలో ఆయనకు, పరిపాలనాధికారులకు చేరవెయ్యాలని ఆదేశమయింది. ఆయన తరువాత ఆయన బోధనల వైపునకు మరలాలని, 'అధికారం గలవారి'వైపునకు మరలాలని ఆదేశం. వారి బాధ్యత, సముదాయానికి సరయిన పరిస్థితిని వివరించడం. 'అధికారం గలవారు' అంటే అధికారులు, నాయకులే కాక ధర్మవేత్తలు, ధర్మశాస్త్ర నిపుణులు కూడా చేరి ఉన్నారు. ఎందుకంటే ధార్మిక సమస్యల అన్వయం వారి వల్లనే సాధ్యం. అధికారుల వలెనే వారి నిర్దేశాలు సయితం అమలుపరచవలసి ఉంటుంది.[1]

ఇది సున్నితమయిన సమాయాల్లో సమస్యల అన్వయం, అన్వయ కృషికి సంబంధించిన అతి స్పష్టమయిన ఆదేశం. ఇది సదా అమలులో ఉంటుంది.[2]

---

1. వివరాలకు చూడండి, జస్సాస్, అహ్కాముల్ ఖుర్ఆన్ : 2 : 269, 272
2. అన్వయ కృషికీ, అన్వయానికీ సంబంధించిన అతి సున్నితమయిన సరిహద్దులు,

## 9. నీతికీ చట్టానికీ గల సంబంధం

మానవునిలో నైతిక స్పృహ ఉంటుంది. ఉన్నత నైతికత వల్ల ప్రేమ పుట్టడం, దుష్ట నైతికత మూలంగా ద్వేషం జనించడం మానవ నైజంలో సహజం. ఈ కారణం గానే మానవునిలో వేల నైతిక చెడుగులున్నా అతను మటుకు ఉత్తమమయిన నైతిక నడవడినే ఇష్టపడతాడు. దుర్మార్గపు నీతిని ద్వేషిస్తాడు. అతనిలో ఈ నైతిక స్పృహ జాగృతమయి బలోపేతమయిపోతే అతను నాగరికతకు, సంస్కారానికి పెట్టిన పేరయిపోతాడు. మరెవరికీ ఎవరి పట్లనూ ఎటువంటి నిష్ఠూరం మిగులదు. ఇస్లామ్ మానవుని ఈ భావానికే జీవితాన్నీ శక్తినీ ప్రసాదిస్తుంది. అది మానవ హక్కుల ఒక పట్టిక తయారు చేసి మానవుని కొరకు పొందుపరచలేదు. నిజానికి నైతికతతో దాని సంబంధాన్ని నెలకొల్పింది. అనేక చట్టపరమయిన హక్కుల్ని అది మానవుని నైతిక సుగుణాల రూపంలో ముందుంచుతుంది. వాటిని పాటించాలని పురికొలుపుతుంది. వాటి సద్ఫలితాన్నీ పుణ్యాలనూ వివరిస్తుంది. వాటిని ఉల్లంఘిస్తే కలిగే అతి కఠిన మయిన దుష్పరిణామాలను గురించి హెచ్చరిస్తుంది.

అది ఈ హక్కుల విషయంలో వ్యక్తిలోని అంతరాత్మను జాగృతపరుస్తుంది. సమాజంలో దానికనుగుణ్యమయిన వాతావరణాన్ని సృజిస్తుంది. మానవ హత్య, సంతాన హత్య, చోరీ, దుర్నీతి కార్యం, అపనామాలు పెట్టడం, నిందలు మోపడం, అపనిందలు వెయ్యడం, హక్కులు కాజెయ్యడం, అన్యాయం, అక్రమం వంటి దుష్కా ర్యాలను అది 'ఫిస్క్' 'ఫుజూర్' (పాతకం) బృహద్పాపంగా పరిగణిస్తుంది. దానికి కఠోర అభిశాపాన్ని వినిపిస్తుంది. వీటికి భిన్నంగా మానవతకు గౌరవాదరణలు కలిగే ఏ కోణమయినా దాన్ని అది శ్లాఘిస్తుంది. దానికి పుణ్యఫలాలను ప్రస్తావిస్తుంది. ఈ విధంగా మానవ హక్కులు ఇస్లామ్ దృష్టిలో కేవలం చట్టపరమయిన అంశాలే కావు, నిజానికి అవి మానవుని ఉన్నత నైతికత నడవడికీ ప్రతీకలు.

## 10. దైవం సమక్షంలో జవాబుదారీతనం

ఇస్లామ్ ఒక వైపున మానవ హక్కులకు చట్టపరమయిన నైతికమయిన రక్షణ కల్పించింది, మరో వైపున ఆ హక్కుల రక్షణకు ఆదరణాభావాన్ని నెలకొల్పింది. దాని ప్రకారం ఈ చట్టం దైవదత్తమయింది. ఆయన నియమించిన హద్దులూ పరిధులతో దానికి గట్టి సంబంధముంది. దాన్ని పాటించడం ఎట్టి పరిస్థితిలోనూ తప్పనిసరి అయినది. దాన్ని పాటించడం వల్ల మనిషి రేపు ప్రళయ దినాన దైవం తరఫున బహు

మానాలకు, గౌరవాదరణలకు పాత్రుడవుతాడు. దాన్ని అతిక్రమించడం మూలాన దైవం సమక్షంలో జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. అప్పుడు భయంకర మయిన యాతనకు గురికావలసి వస్తుంది. అల్లాహ్ దాసులయిన సదాచార జనుల ఒక గుణమేమిటంటే, వారు అల్లాహ్ నిర్ణయించిన హద్దులు, పరిధుల (చట్టాల)ను పరిరక్షిస్తారు; వాటిని మరెవరూ జవదాట కుండా కాపాడతారు. దీన్ని కొన్ని ఉదాహరణలతో అర్థం చేసుకుందాము.

వారసత్వంలో బంధువుల హక్కుల్ని గురించి విశదీకరించిన తరువాత ఇలా సెలవీయడం జరిగింది:

تِلْكَ حُدُوْدُ اللّٰهِ ۭ وَمَنْ يُّطِعِ اللّٰهَ وَ رَسُوْلَهٗ يُدْخِلْهُ جَنّٰتٍ تَجْرِىْ مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ خٰلِدِيْنَ فِيْهَا ۭ وَ ذٰلِكَ الْفَوْزُ الْعَظِيْمُ ۝ وَ مَنْ يَّعْصِ اللّٰهَ وَ رَسُوْلَهٗ وَ يَتَعَدَّ حُدُوْدَهٗ يُدْخِلْهُ نَارًا خَالِدًا فِيْهَا ۠ وَلَهٗ عَذَابٌ مُّهِيْنٌ ۝

(النساء:١٣،١٤)

**ఇవి అల్లాహ్ నెలకొలిపిన హద్దులు (నియమాలు). అల్లాహ్‌ను, ఆయన సందేశహరుణ్ణి అనుసరించినవారిని అల్లాహ్, దిగువన కాలువలు ప్రవహించే స్వర్గ వనాలలో ప్రవేశింపజేస్తాడు. వారక్కడే సదా నివసిస్తారు. ఇదే మహత్తరమయిన సాఫల్యం; మరెవరయితే అల్లాహ్, ఆయన సందేశహరుని ఆజ్ఞల్ని పాలించరో, ఆయన హద్దులను అతిక్రమిస్తారో అటువంటి వారిని అయన నరకంలో ప్రవేశింపజేస్తాడు. వారందులోనే ఎల్లప్పటికీ ఉంటారు. అటువంటివానికి పరాభవ కరమయిన యాతన ఉంటుంది.**

***(అన్ నిసా : 13, 14)***

దివ్యఖుర్ఆన్ హక్కుల నిర్వర్తనను పరలోక విశ్వాసంతో ముడిపెట్టింది. ఈ విశ్వాసం మనిషిని ఈ హక్కులను నిర్మూలించకుండా వారిస్తుంది, వాటి ఆదరణకు కట్టుబడి ఉండేలా చేస్తుంది. అధర్మంగా ప్రాణాలు తీయడం చట్టబద్ధంగా నేరమే కాదు, మహాపాతకం. ఒక చోట, విశ్వాసులు, బహుదైవారాధనకు, ప్రాణహానికి, మాన భంగానికీ పాల్పడరని సెలవీయడం జరిగింది. ఆ తరువాత ఇలా తెలుపడం జరిగింది:

وَ مَنْ يَّفْعَلْ ذٰلِكَ يَلْقَ اَثَامًاۙ○ يُضٰعَفْ لَهُ الْعَذَابُ يَوْمَ الْقِيٰمَةِ وَ يَخْلُدْ فِيْهٖ مُهَانًا○ اِلَّا مَنْ تَابَ وَ اٰمَنَ وَ عَمِلَ عَمَلًا صَالِحًا فَاُولٰٓئِكَ يُبَدِّلُ اللّٰهُ سَيِّاٰتِهِمْ حَسَنٰتٍؕ وَّكَانَ اللّٰهُ غَفُوْرًا رَّحِيْمًا○ (الفرقان:٦٨-٧٠)

**ఎవరయితే వీటికి ఒడిగడతాడో, అతను అపరాధానికి శిక్షను పొందు తాడు, పరలోకాన అతనికి రెండింతల శిక్ష పడుతుంది. అందులో అతను నీచుడయి, పరాభవంపాలయి ఎల్లప్పుడూ పడి ఉంటాడు. అయితే ఎవరయితే పశ్చాత్తా పంతో మరలుతాడో, విశ్వసిస్తాడో, సదాచరణను అలవరచుకుంటాడో ఇటు వంటి వారి తప్పిదాలను అల్లాహ్ సత్కార్యాలుగా మార్చివేస్తాడు. అల్లాహ్ ఎంతో మన్నించేవాడు, మరెంతో దయగలవాడు. (అల్ ఫుర్కాన్ :68-70)**

అజ్ఞాన కాలంలో అమ్మాయిల్ని సజీవంగా పూడ్చిపెట్టేవారు. ఈ జుగుప్సాకర మయిన పాపాన్ని ఖుర్ఆన్ ఈ విధంగా విమర్శిస్తుంది:

وَ اِذَا الْمَوْءٗدَةُ سُئِلَتْ○ بِاَيِّ ذَنْۢبٍ قُتِلَتْ○ (التكوير:٨،٩)

**అప్పుడు సజీవ ఖననానికి గురయిన అమ్మాయిని, ఏ పాపం కారణంగా నిన్ను చంపడం జరిగింది? అని అడగబడు తుంది. *(అత్ తక్వీర్ : 8, 9)***

అనాథ సొమ్మును అధర్మంగా కాజెయ్యడాన్ని నిరోధిస్తూ చేసిన నిషేధాజ్ఞల తరువాత ఇలా హెచ్చరించడం జరిగింది:

اِنَّ الَّذِيْنَ يَاْكُلُوْنَ اَمْوَالَ الْيَتٰمٰى ظُلْمًا اِنَّمَا يَاْكُلُوْنَ فِيْ بُطُوْنِهِمْ نَارًاؕ وَّ سَيَصْلَوْنَ سَعِيْرًا○ (النساء:١٠)

**ఎవరయితే అనాథల సొమ్మును అధర్మంగా కబళిస్తారో వారు తమ కడుపుల్ని అగ్నితో నింపుకుంటున్నారు. వారు అనతికాలం లోనే నరకంలో ప్రవేశిస్తారు.**

***(అన్ నిసా : 10)***

ఒక చోట అప్పగింతల్ని తిరిగి వప్పగించవలసిందని ఆదేశించడం జరిగింది. అందులో ధనసంబంధమయిన అమానతులూ చేరి ఉన్నాయి. అలాగే పదవులు, బాధ్య తలు, హోదాలూ ఉన్నాయి. ఆ తరువాత ఇలా సెలవీయడం జరిగింది:

إِنَّ اللّٰهَ يَأْمُرُكُمْ أَنْ تُؤَدُّوا الْأَمٰنٰتِ إِلٰٓى أَهْلِهَا ۙ وَ إِذَا حَكَمْتُمْ بَيْنَ النَّاسِ أَنْ تَحْكُمُوْا بِالْعَدْلِ ۚ إِنَّ اللّٰهَ نِعِمَّا يَعِظُكُمْ بِهٖ ۚ إِنَّ اللّٰهَ كَانَ سَمِيْعًا ۢ بَصِيْرًا ○ (النساء:٥٨)

నిస్సందేహంగా అల్లాహ్ మీకు ఆదేశిస్తున్నాడు, అప్పగింతల్ని వాటికి తగిన వారికి అప్పగించండి; జనుల మధ్య తీర్పు చెప్పవలసి వస్తే న్యాయబద్ధంగా తీర్పు చెయ్యండి; నిశ్చయంగా అల్లాహ్ మీకు ఉత్తమమయిన ప్రబోధన చేస్తాడు. నిస్సందేహంగా అల్లాహ్ సర్వం వినేవాడు, సర్వం కనేవాడు కూడా.

*(అన్ నిసా : 58)*

ప్రళయంలో లెక్కలు అడగటమయినా, పరలోకంలో జవాబు చెప్పుకోవడమయినా మనిషిలో జనిస్తే బహుశా మానవ హక్కుల ఉల్లంఘన అంటూ జరగదు. ఈ భావన లేకపోవడం చేతనే హక్కుల నిర్వర్తనా మార్గంలో పెద్ద అవరోధం.



# ౨. వ్యక్తికి చెందిన స్వీయ, వైయక్తిక హక్కులు

## జీవించి మనగలిగే హక్కు

వ్యక్తి హక్కుల్లో అన్నింటికన్నా ప్రధానమయిన హక్కు బ్రతికుండే హక్కు దీనిమీదనే ఇతర హక్కులు ఆధారభూతమయి ఉంటాయి. ఈ హక్కునే కాజేసినట్లయితే ఇతర హక్కుల ప్రశ్నే మిగులదు. ప్రపంచంలోని సమస్త ప్రజాస్వామిక చట్టాలు దీన్ని ఒక సహజమయిన ప్రకృతిసిద్ధమయిన ప్రాథమిక హక్కుగా నిర్ణయించాయి. దీనితోపాటు, ఈ హక్కు అన్నింటికీ పరమయినది, నిర్నిబంధమయినది అన్న విషయమూ ఆమోదించబడింది. న్యాయశాస్త్రానికి చెందిన ఏ ధర్మబద్ధమయిన చట్టం రీత్యానూ ఎవరినీ ఈ హక్కుకు దూరం చెయ్యడం సాధ్యపడదు.

ఇస్లామ్ మానవునికి జీవించే అధికారాన్ని ప్రసాదించింది. దానిపై చెయ్యిచేసుకోవడాన్ని గట్టిగా వారించింది. ఆ హక్కుకు పూర్తిగా రక్షణ సమకూర్చింది. న్యాయం, ధర్మం కోరితే తప్ప మనిషిని ఈ హక్కుకు దూరం చెయ్యడం సాధ్యం కారాదని ప్రకటించింది. దాని దృష్టిలో ఇక్కడ పుట్టే ప్రతి మానవుడు జీవించే హక్కు తోడుగా తీసుకువచ్చి మరీ పుడతాడు. జీవితం అతనికి అల్లాహ్ ప్రసాదించగా ప్రాప్తమయింది. ఆయనే దానికి స్వామి, దాన్ని మరెవరూ పరిహరించ శక్యం కాదు. కడకు స్వయంగా ఆ మనిషి కూడా దాన్ని అంతమొందించలేడు. అందువల్లనే ఆత్మహత్య నిషిద్ధం, హరామ్. విశ్వసించినవారి ఒక ప్రముఖమయిన గుణం, వారెవరూ అధర్మంగా ఎవరి ప్రాణానికీ హాని తలపెట్టరన్నది ఇస్లామ్ ప్రకటన.

وَلاَ يَقْتُلُوْنَ النَّفْسَ الَّتِىْ حَرَّمَ اللّٰهُ اِلَّا بِالْحَقِّ ○ (الفرقان:٦٨)

**వారు, అల్లాహ్ నిషేధించిన మానవ హత్యకు, న్యాయబద్ధంగా తప్ప పాల్పడరు.**

***(అల్ ఫుర్‌కాన్ : 68)***

"సహీహ్ బుఖారీ"లోని ఓ హదీసులో మహనీయ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

الكبائــر: الاشــراك بالله و عقوق الوالدين و قتل النفس واليمين الغموس[1]

**మహాపాతకాలు ఇవి, అల్లాహ్‌తోపాటు మరెవరినయినా ఆరాధ్యులుగా ఎంచడం, తల్లిదండ్రుల అవిధేయత, ఒకరి ప్రాణాన్ని పరిహరించడం, బూటకపు ప్రమాణం చెయ్యడం.**[1]

దీని భావమేమిటంటే, మానవ హత్యవంటి మహాపాతకానికి విశ్వసించిన వారు అతీతంగా, పరిశుద్ధంగా ఉంటారు, పరిశుద్ధంగానే ఉండాలి అన్నమాట.

మానవుడు జీవించే హక్కును ఎప్పుడు కోల్పోతాడో అతి విశదంగా తెలిపింది ఇస్లామ్. మనిషి తాను జీవించే హక్కును కోరుకోలేని స్థితిలో, ఏ అపరాధాలకు పాల్పడి పడిపోతాడో, సమాజానికి అతను ఎప్పుడు అసహనీయమయిన వాడయిపోతాడో తెలిపింది.

مَنْ قَتَلَ نَفْسًا بِغَيْرِ نَفْسٍ اَوْ فَسَادٍ فِي الْاَرْضِ فَكَاَنَّمَا قَتَلَ النَّاسَ جَمِيْعًا ۭ وَمَنْ اَحْيَاهَا فَكَاَنَّمَا اَحْيَا النَّاسَ جَمِيْعًا

(المائدة:٣٢)

**ఒక వ్యక్తి మరెవరినయినా హత్య చెయ్యక పోయినా లేదా భువిలో కల్లోలం రేపక పోయినా అతన్ని ఎవరయినా హతమార్చి నట్లయితే అతను సకల మానవాళిని హత మార్చినట్లు. మరెవరయితే ఒక ప్రాణిని బ్రతకనిస్తాడో అతను మానవాళి అంతటినీ బ్రతకనిచ్చినట్లు.** ***(అల్ మాఇద : 32)***

ఇది బనీ ఇస్రాయీల్‌కు ఇచ్చిన ఆదేశం. ఇస్లామీయ షరీఅత్‌లోనూ దీన్నే కొనసాగనివ్వడం జరిగింది. మనిషి ఎవరనయినా అధర్మంగా హత్య చేసినా లేదా అతను దేశంలో కలతలు రేపినా, లేదా రక్తపాతం జరిపినా అతను తన ప్రాణ పవిత్రతను కోల్పోతాడు. అటువంటి వ్యక్తి ఉనికే భూతలాన అసహనీయమయింది. అతన్ని తొలగించి శాంతిభద్రతలు నెలకొల్పడం ప్రభుత్వ బాధ్యత, విధి. ఈ చర్యను తప్పుగా పరిగణించడం జరగదు.[2]

---

1. బుఖారి, కితాబుల్ ఈమాన్ వన్నుజూర్, యామీనుల్ గమూస్.
2. హదీసు ప్రకారం మూడు అపరాధాలలో ఏ ఒక్కదానికయినా ఒక ముస్లిమ్ వ్యక్తి పాల్పడి నట్లయితే దానికి శిక్ష మరణదండన: ఒకటి, ధర్మభ్రష్టత (తిరోన్ముఖం), రెండు, ఒక నిరప రాధిని చంపడం, మూడు, వివాహితుడయిన వ్యక్తి వ్యభిచారానికి లోనవడం. (బుఖారి, ముస్లిమ్)

దీనికి కారణం ఈ విధంగా తెలుపడం జరిగింది. ఒక్క వ్యక్తిని సయితం అధర్మంగా చంపడం అత్యంత కఠోరమయిన నేరం. తద్వారా మానవాళినంతటినీ హత్యాకాండకు మూలమవుతుంది. దీనికి భిన్నంగా ఒక నిరపరాధిని బాధితుని ప్రాణాలు కాపాడటం విశ్వాన్నంటికీ ప్రాణదాయకంగా పరిణమిస్తుంది. దీని ద్వారా మానవ ప్రాణం విలువేమిటో ద్యోతకమవుతుంది. ఆదమ్ సంతానంలో తొలిసారిగా తన సోదరుని రక్తం చిందించిన వ్యక్తి తోటి వారికి హత్యామార్గాన్ని సూచించాడు. అందువల్ల అధర్మంగా ఎప్పుడు రక్తం కారినా ఆ కాండలో ఆ తొలి హంతకునికీ భాగం ఉన్నట్లు పరిగణించబడుతుంది. అతని ఆచరణాపత్రంలో ఆ పాపం వ్రాయబడు తుంది. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ ఉల్లేఖనం ప్రకారం దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు:

**لا تقتل نفس ظلما الا كان على ابن آدم الاول كفل من دمها لأنه اول من سن القتل.** [2]

**ఎవరయినా అన్యాయంగా, అధర్మంగా హత్య చెయ్యబడినట్లయితే మానవ హత్యకు పాల్పడిన ఆ తొలి ఆదమ్ సంతానంపైనా ఆ హత్యాబాధ్యత కొంత ఉంటుంది. ఎందుకంటే అధర్మంగా హత్య చెయ్యడాన్ని ప్రపంచానికి చూపిన వ్యక్తి అతనే.**

***(బుఖారి, ముస్లిమ్)***

అధర్మంగా మనిషిని చంపడాన్ని గురించి ఇస్లామ్ దిగువ పేర్కొన్న నిర్దేశాలు జారీ చేసింది:

(1) హంతకుని ప్రతీకారహత్య (కిసాస్) తీర్చుకోవాలి. అంటే ఒకరిని అధర్మంగా చంపినట్లయితే అతన్నీ చంపివేయాలి, మరణదండన విధించాలి. దీనివల్ల మరెవరికీ ఆ అపరాధం చేసే సాహసం కలగదు. అందువల్లనే ఇలా సెలవీయడం జరిగింది:

**وَلَكُمْ فِي الْقِصَاصِ حَيٰوةٌ يّٰاُولِى الْاَلْبَابِ لَعَلَّكُمْ تَتَّقُوْنَ○**

**(البقرة:١٧٩)**

**బుద్ధికుశలతగలవారలారా! మీకు ప్రతీకార హత్య (కిసాస్)లో జీవనం ఉంది. దీనివల్ల మీరు దీనికి పాల్పడకుండా కాపాడు కుంటారు.** ***(అల్ బకర : 179)***

"కిసాస్"లో హతునితోపాటు హంతకుని ప్రాణాలూ పోతాయి. బాహ్యంలో చూస్తే మరో ప్రాణ నష్టమూ జరిగినట్లు అగుపడుతుంది. కాని దీని ద్వారా జాతి మొత్తం జీవనం యిమిడి ఉంది. 'కిసాస్' చట్టాన్ని సరిగ్గా అమలు జరిపినట్లయితే హత్యా నేరానికి పాల్పడే ముందు మనిషి వెయ్యిసార్లు ఆలోచించుకుంటాడు, దీని తరువాత తాను కూడా తన ప్రాణాలను కోల్పోవలసి ఉంటుందని. దీనివల్ల అధర్మ హత్యామార్గం మూయబడుతుంది. తద్వారా ఇద్దరు వ్యక్తుల జీవితమే కాదు మొత్తం సమాజం, మానవాళి అంతటి జీవనం ఉంది.

(2) హతుని వారసులు కోరుకున్నట్లయితే 'కిసాస్'కు బదులు 'దయ్‌త్' (హత్యా పరిహార ధనం) తీసుకోగలరు. వారికి దయ్త్ తీసుకోవడానికయినా, అందులో తగ్గింపు చెయ్యడానికయినా అధికారం ఉంటుంది. వారు హంతకుణ్ణి క్షమించనూ గలరు. క్షమించడం అభిలషణీయమయిన చర్య. దానికే పురికొల్పడమూ జరిగింది.[1]

(3) ఈ వ్యవహారాలన్నింటిలో అధికారం హతుని వారసులు, కుటుంబం వారికే ఉంటుంది. ఇస్లామ్ ఈ విషయాన్ని ప్రభుత్వ పరిధికి దూరంగా ఉంచింది. ప్రభుత్వం వారసులకు వారి హక్కును ఇప్పించడంలో సహాయపడుతుంది. వారు హంతకుని ఎడల ఏదయినా షరీఅత్ విరుద్ధమయిన వైఖరిని అవలంబించదలిస్తే లేదా అతనితోపాటు అతని కుటుంబంలోని ఇతరులపైనా ప్రతీకారం తీర్చుకో ప్రయత్నిస్తే, మరే విధమయిన దౌర్జన్యం, అత్యాచారానికి పాల్పడితే వారికి అటువంటి పనికి అనుమతి ఉండదు. చట్టపరంగా వారిని దాన్నుండి వారించడం జరుగుతుంది.

وَلَا تَقْتُلُوا النَّفْسَ الَّتِي حَرَّمَ اللّٰهُ اِلَّا بِالْحَقِّ ۭ وَمَنْ قُتِلَ مَظْلُوْمًا فَقَدْ جَعَلْنَا لِوَلِيِّهٖ سُلْطٰنًا فَلَا يُسْرِفْ فِّي الْقَتْلِ ۭ اِنَّهٗ كَانَ مَنْصُوْرًا (الفرقان:٦٨)

**దైవం ఏ మానవ ప్రాణాన్ని హతమార్చడం నిషేధించాడో, దాన్ని హతమార్చ కండి. ఎవరయితే అధర్మంగా చంపబడతాడో మేము అతని వారసునికి హక్కునిచ్చాము. కాని అతనూ చంపడంలో హద్దులు మీర రాదు. నిశ్చయంగా అతనికి సహాక రించడం జరుగుతుంది.**

***(అల్ ఫుర్‌కాన్ : 68)***

---

1. వివరాలకు చూడండి, అల్ బకర : 178.

## సమానతా హక్కు

సమానత అన్నది మానవుని ప్రాథమిక హక్కు మాత్రమే కాదు, వాస్తవానికి సమస్త హక్కుల భూమిక కూడా ఇదే. విశ్వమానవ హక్కుల ప్రకటన (Universal Declaration of Human Rights) లో ఏ హక్కుల ప్రస్తావన ఉందో ఆ హక్కులు అందరికీ సమంగా వరిస్తాయని చెప్పడం జరుగుతుంది. అందులో వంశం, వర్ణం వర్గం, లింగం, భాష, మతం, రాజకీయ లేదా ఇతర భావాత్మకమయిన అభిప్రాయాలు, సామాజిక ఆర్థిక స్థాయి, స్థితిగతులు, పుట్టుక స్థానం ఇత్యాది వాటి ఆధారంగా విచక్షణ చూపడం జరగదు. ఇదే విషయాన్ని అంతర్జాతీయ సామాజిక, రాజకీయ ఒప్పందం (International Covenent on Civil and Political Rights)లోనూ ప్రకటించడం జరిగింది.

ఈ హక్కులు కాలరాయబడకుండా చూడటం రాజ్యం, ప్రభుత్వ బాధ్యత. వాటి ఆవశ్యకతలకు జీవితపు ఏ వ్యవహారంలోనూ లోటురాకుండా చూడాలి.[1]

నేడు ప్రపంచం సమానతా భావానికి ఎంత ప్రాముఖ్యతనిస్తోందో ఇస్లామ్ అంతకన్నా అధిక ప్రాముఖ్యతనిచ్చింది. మానవులంతా ఒక్కటే అన్న భావం, మానవు లంతా సమానులే అన్న భావం ఇస్లామ్ మౌలిక బోధనల్లోని భాగం. ప్రపంచానికి ఇవన్నీ ఏమీ తెలియని రోజుల్లో ఇస్లామ్ ఈ భావనను సమున్నతపరచింది.

మానవుల మధ్య వర్ణం, వర్గం, వంశం, లింగం, భాష, భూమి, హోదా, పదవి, కళలు, వృత్తులు, వ్యాపకాల ఆధారంగా వ్యత్యాసాలు సహజంగానే ఉన్నాయి. కాని ఈ వ్యత్యాసాన్ని తన అజ్ఞానం మూలంగా వాస్తవ వ్యత్యాసంగా పరిగణించడమేకాక, దీనిని ఔన్నత్యానికీ నీచత్వానికీ ప్రమాణంగా కూడా నిర్ణయించారు. ఒకప్పుడు అతను తెల్లవాణ్ణి నల్లవాని కన్నా ఉన్నతుడుగా భావించాడు, మరొకప్పుడు ఓ ప్రత్యేక కులాన్ని ఇతర కులాలకన్నా ఉత్తమమయిందిగా నిర్ణయించుకున్నారు. ఒక్కోసారి ఓ ప్రత్యేక భాషను మాటలాడేవారిని ఇతర భాషల వారికన్నా ఉన్నతులుగా పరిగణిస్తే, మరొకసారి ఒక ప్రత్యేక వర్గం, లైంగిక వర్గం వారిని ఉన్నతులుగా భావించడం జరిగింది. ఫలితంగా స్త్రీల పైన పురుషుల ఆధిక్యత అనే అంశం వివాదాస్పదంగా మారింది. నేటికీ సమానతా వాదనలు ఎన్ని వినవచ్చినా ఈ తారతమ్యాలు మిగిలే ఉన్నాయి.

---

1. *Human Rights International Challenges. Vol.1, pp79-84*

ఇస్లామ్ మానవుల మధ్య ఈ వ్యత్యాసాన్నీ, తారతమ్య భావనల్ని నిక్కచ్చిగా ఖండించింది. మానవుల మధ్య ఉన్న సహజమయిన వ్యత్యాసాలు వాస్తవానికి వారి మధ్య పరిచయానికి మాధ్యమాలని చాటి చెప్పింది. తద్వారా ఏ వ్యక్తి ఏ దేశవాసియో, ఏ భాష మాటలాడేవాడో, అతని లైంగిక గుర్తు ఏదో, ఎదుటి వ్యక్తి తెలుసుకునేందుకు దోహదపడే సాధనాలని, గుర్తించే విధానాలని తెలిపింది. అందరి రంగులు ఒకే విధంగా, అందరి రూపాలు ఒకే మాదిరిగా, ముఖం, ఒడ్డూ పొడవు, భాష, యాస అన్నీ ఒకటే అయినట్లయితే మనుషుల్ని గుర్తించడం, దుర్లభమయిపోయేది. మానవుల మధ్య ఈ భిన్నత్వం ప్రకృతి కల్పించిన చిహ్నం. ప్రకృతి స్వయంగానే రంగురంగుల మయం. ఈ భిన్నత్వం, వైవిధ్యంలోనే మానవ ఏకత్వం ఇమిడి ఉందని చాటింది. భిన్నత్వంలో ఏకత్వానికి ఇంతకన్నా బలమయిన ఆధారం మరొకటి ఏమయినా ఉందా? ఇది వైరుధ్యానికి, విచ్ఛిన్నానికి ఆధారం కాదు.

يَآيُّهَا النَّاسُ اِنَّا خَلَقْنٰكُمْ مِنْ ذَكَرٍ وَّ اُنْثٰى وَ جَعَلْنٰكُمْ شُعُوْبًا وَّ قَبَآئِلَ لِتَعَارَفُوْا ؕ اِنَّ اَكْرَمَكُمْ عِنْدَ اللّٰهِ اَتْقٰكُمْ ؕ اِنَّ اللّٰهَ عَلِيْمٌ خَبِيْرٌ ۝ (الحجرات:١٣)

**జనులారా! మేము మిమ్మల్ని ఒకే స్త్రీ పురుషుల జంట ద్వారా పుట్టించాము. మిమ్మల్ని జాతులుగా తెగలుగా చేశాము, తద్వారా మీరు ఒండొకరిని గుర్తించాలని. నిస్సంకోచంగా మీలో అందరికన్నా గౌరవనీయుడు, అల్లాహ్ దృష్టిలో, ఆయనకు అత్యధికంగా భయపడేవాడే. నిశ్చయంగా అల్లాహ్ అన్నీ తెలిసిన వాడు, అన్నీ ఎరిగిన వాడు.** ***(అల్ హుజురాత్ : 13)***

ప్రవక్త మహనీయులు (స) మక్కా విజయం తరువాత చేసిన ప్రసంగంలో జాతి, వంశం, తెగవంటి భావనలను చిరకాలానికి అంతమొందించారు. ఆదమ్ సంతతి అంతా ఒకే స్థాయికి చెందింది. అయితే దైవభీతి, ధర్మనిష్ఠ, శీలస్వభావాల ఔన్నత్యం మూలంగా మనిషి గౌరవాదరణలకు, ఉన్నత స్థానాలకు ఎదుగుతాడు. అతను ఇతరుల సమక్షంలో గౌరవనీయుడుగా నిలబడతాడు. ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు –

يايها الناس الا ان ربكم واحد و ان أباكم واحد الا لا فضل لعربى على عجمى ولا لعجمى على عربى ولا لأحمر على اسود ولا لأسود على احمر الا بالتقوى[1]

**జనులారా బాగా వినండి, నిశ్చయంగా మీ ప్రభువు ఒక్కరే, మీ తండ్రి కూడా ఒక్కడే. ఒక అరబ్బు వ్యక్తికి అరబ్బేతరునిపైన గాని, అరబ్బేతరునికి అరబ్బు పైనగాని, తెల్ల వానికి నల్లవానిపైనగాని, నల్లవానికి తెల్ల వానిపైనగాని ఎటు వంటి ఆధిక్యత లేదు, ఒక్క ధర్మనిష్ఠ ఆధారంగా తప్ప (ఎవరిలో ఎంత నిష్ఠ ఉంటుందో అంతే ఆధిక్యత అతనికి ప్రాప్తమవుతుంది).**

***(ముస్నద్ అహ్మద్)***

ఇది మానవ సమానతకు అతి స్పష్టమయిన ప్రకటన. ఏ వ్యక్తి అయినా అతను ఏ జాతికి చెందిన వాడయినా, అతనికి మరే ఇతర వర్ణం, వర్గం, జాతి వ్యక్తి పైన ఎటువంటి మహత్తు లేదు. ఔన్నత్యానికి ప్రమాణం కేవలం ధర్మనిష్ఠ, దైవభక్తి మాత్రమే. ఎవరు ఎంతగా భక్తీ ప్రపత్తులుగలవాడో అతను అంతే గౌరవాదరణలకు పాత్రుడు.[1]

మానవుల మధ్య తారతమ్యం, వివక్ష, వారిపై అన్యాయం, అక్రమం దైవాగ్రహ జ్వాలల్ని మరింత రగిలిస్తుంది. ఈ రోగానికి గురయిన జాతి కడకు సర్వనాశమయి పోతుంది. ఫిర్ఔన్, అతని జాతి, జాతి వివక్షకు, స్వోత్కర్షకు లోనయి ఉండేది. అది బనీ ఇస్రాయీల్‌కు తనకు సమాన స్థాయినివ్వడానికి సిద్ధంగా లేకపోయేది. అది బనీ ఇస్రాయీల్‌ని తనకు బానిసగా చేసిపెట్టుకుంది. ఆ ప్రజల్ని కేవలం తన ప్రజల దాస్యానికి మాత్రమే వినియోగించుకునేది. సంతాన సంహారం ద్వారా వారి సంఖ్యా బలాన్ని తగ్గించడానికి, బలహీనపరచడానికి నిరంతరం ఉపాయాలను అమలు పరుస్తూ ఉండేది. వారు సమున్నతమయ్యే సమస్త మార్గాలు అది మూసి వేసింది. ఒక జాతిలోని ఓ వర్గాన్ని ఇలా అణచివెయ్యడం, త్రొక్కిపెట్టడం ఘోరమయిన అపరాధం. దివ్యఖుర్ఆన్ దీన్ని అనేక చోట్ల విశేషంగా ప్రస్తావించింది. పరమ ప్రభువు ఫిర్ఔన్ అనుసరించిన ఈ వైఖరికి వ్యతిరేకంగా బనీ ఇస్రాయీల్ వంటి బలహీన జాతిని సమున్నత పరచాడు. ఫిర్ఔన్, అతని జాతి అంతిమ పరిణామం అతి హీనంగా రూపొందింది.

---

*1. వివరాలకు చూడండి, రచయిత చిరుపుస్తకం 'మానవుల ఏకత్వం'.*

إِنَّ فِرْعَوْنَ عَلَا فِي الْأَرْضِ وَ جَعَلَ أَهْلَهَا شِيَعًا يَّسْتَضْعِفُ طَائِفَةً مِّنْهُمْ يُذَبِّحُ أَبْنَاءَ هُمْ وَ يَسْتَحْيِ نِسَاءَ هُمْ ۚ إِنَّهُ كَانَ مِنَ الْمُفْسِدِينَ ۝ وَ نُرِيدُ أَن نَّمُنَّ عَلَى الَّذِينَ اسْتُضْعِفُوا فِي الْأَرْضِ وَ نَجْعَلَهُمْ أَئِمَّةً وَّ نَجْعَلَهُمُ الْوَارِثِينَ ۝ وَنُمَكِّنَ لَهُمْ فِي الْأَرْضِ وَ نُرِيَ فِرْعَوْنَ وَ هَامَانَ وَ جُنُودَهُمَا مِنْهُمْ مَا كَانُوا يَحْذَرُونَ ۝ (القصص:٤-٦)

జరిగిందేమిటంటే, ఫిర్‌ఔన్ భువిలో తలబిరుసుతనం చూపాడు, అందులో నివసించే జనుల్ని వర్గాలలో విభజించాడు. వారిలో ఒక వర్గాన్ని అతను హీనపరిచేవాడు, దాని మగబిడ్డల్ని చంపేవాడు, ఆడ కూతుళ్ళను బ్రతకనిచ్చేవాడు. వాస్తవంగా అతను కల్లోలజనకులలోనివాడు. భువిలో హీనంగా చేయబడిన వారిపైన మేము దయచూపాలని సంకల్పించుకున్నాము; వారిని నాయకులుగా చేయాలని కోరుకున్నాము, వారినే వారసులుగా చేయాలని, వారికి భువిలో అధికారం అనుగ్రహించాలని భావించాము. వారిద్వారా ఫిర్‌ఔన్‌కు, హామాన్‌కు, వారి సేనలకు వారు దేని గురించి భయపడుతున్నారో దానినే చూపించాలని తలించాము.

*(అల్ కసస్ : 4-6)*

ఇది అతి విశదమయిన ప్రకటన. ప్రభుత, అధికారం అన్నవి ఒక వర్గాన్ని లేదా ఒక జాతిని దాసులుగా చేసుకోవడానికి వినియోగించుకోరాదు. రాజ్యంలో ప్రతి వ్యక్తి, ప్రతి వర్గం తన హక్కులు కలిగి ఉంటుంది. రాజ్యం ఎన్ని సాకులు చెప్పినా ఆ హక్కుల్ని హరించుకోజాలదు. నిమ్నోన్నతా భావాలు, బూటకపు స్వోత్కర్ష భావనల ద్వారా వాటిని అణచివేయజాలదు. అల్లాహ్ దైవిక శాసనం ఈ హింసా దౌర్జన్యాలను, ఫిర్‌ఔన్ స్వభావాన్ని ఎంత మాత్రం సహించదు.

## న్యాయ సంస్థాపనం

మానవుల మధ్య సమానత అనగానే తప్పనిసరిగా దాని ఆవశ్యకత ముందుకు వస్తుంది. మానవుల్లో అందరి మధ్య న్యాయం జరగాలి. ఎవరి పట్లనూ అన్యాయం అక్రమం జరగరాదు. ఇస్లామీయ బోధనల ప్రాతిపదికల్లో ఒకటి న్యాయం. ఇస్లామ్ న్యాయ భావనను ప్రత్యేకంగా, సమున్నతంగా ప్రస్తావించింది. దాన్ని ఒక సజీవ క్రియాశీల భావనగా రూపొందించింది. ప్రపంచం 'న్యాయం' ఆధారంగానే నెలకొన్న దన్న సత్యాన్ని అది చాటింది. మానవ జీవితాన్ని కూడా న్యాయం ఆధారంగానే సముద్ధరించడం సాధ్యమవుతుందని చెప్పింది. అందువల్ల అది న్యాయానికి

కట్టుబడవలసి ఉంటుందని ఉద్ఘాటించింది. మానవుడు అన్యాయ వర్తనుడయినట్లయితే సమాజం తప్పనిసరిగా ఆందోళనకు వ్యాకులతకు లోనయి శాంతిని కోల్పోతుందని హెచ్చరించింది. మానవ కృషి, ప్రయత్నాలు, కార్యకలాపాలు అన్నీ న్యాయ పరిధిలో జరిగినట్లయితే విశ్వమంతటా కానవచ్చే శాంతి శ్రేయాలే మానవ సమాజంలోనూ వెల్లివిరిస్తాయని అంటుంది ఇస్లామ్:

اَلشَّمْسُ وَالْقَمَرُ بِحُسْبَانٍ ۝ وَالنَّجْمُ وَ الشَّجَرُ يَسْجُدٰنِ ۝ وَالسَّمَآءَ رَفَعَهَا وَوَضَعَ الْمِيْزَانَ ۝ اَلَّا تَطْغَوْا فِى الْمِيْزَانِ ۝ وَ اَقِيْمُوا الْوَزْنَ بِالْقِسْطِ وَلَا تُخْسِرُوا الْمِيْزَانَ ۝ (الرحمٰن:٥-٩)

**సూర్యుడూ చంద్రుడు ఒక లెక్కకు కట్టుబడి ఉన్నాయి, నక్షత్రాలూ, వృక్షాలూ అన్నీ సజ్దాలో మోకరిల్లి ఉన్నాయి. ఆకాశాన్ని ఆయన సమున్నతపరిచాడు, తులను నెల కొలిపాడు. దీని ఆవశ్యకత, ఇది కోరేది, మీరు తులమానంలో కలత రేపరాదు, న్యాయబద్ధంగా సరిగ్గా ఖచ్చితంగా తూయాలి, తక్కెడలో మోసం చేసి చెయ్యికొట్టరాదు.** ***(అర్ రహ్మాన్ : 5 - 9)***

దైవధర్మం పూర్తిగా సత్యం, న్యాయం ఆధారంగానే నెలకొంది.

وَ تَمَّتْ كَلِمَةُ رَبِّكَ صِدْقًا وَّ عَدْلًا ؕ (الانعام:١١٥)

**మీ ప్రభువు మాట పరిపూర్ణమయింది, సత్యం, న్యాయం ఆధారంగా.** ***(అల్ అన్ఆమ్ : 115)***

భావమేమి టంటే, దైవం పంపిన బోధనలయినా, అగోచర యదార్థాల వివరణ అయినా అన్నీ సరయినవి, నిజమయినవి, వాటిని తప్పుయినవిగా నిర్ణయించడానికి ఎటువంటి సహేతుకమయిన కారణం లేదు. దైవం అందజేసిన ఆజ్ఞలన్నీ అన్ని విధాల దౌర్జన్యాలు, అత్యాచారాలకు అతీతమయినవి, పూర్తిగా న్యాయబద్ధమయినవి అని అర్థం.

దైవప్రవక్తల ఆవిర్భావానికి ఓ ముఖ్యమయిన లక్ష్యం, న్యాయం, సంతులనాల స్థాపన. ఇస్లామ్ ఈ న్యాయస్థాపన, సంతులన స్థాపనకు శక్తినుపయోగించడాన్ని కూడా సమ్మతిస్తుంది.

لَقَدْ اَرْسَلْنَا رُسُلَنَا بِالْبَيِّنٰتِ وَ اَنْزَلْنَا مَعَهُمُ الْكِتٰبَ وَالْمِيْزَانَ

**మేము మా సందేశహరులను ఆధారాలతో సహా పంపాము, వారితోపాటు గ్రంథం, తులమానం కూడా అవతరింపజేశాము.**

لِيَقُوْمَ النَّاسُ بِالْقِسْطِ ۚ وَ اَنْزَلْنَا الْحَدِيْدَ فِيْهِ بَاْسٌ شَدِيْدٌ وَّ مَنَافِعُ لِلنَّاسِ وَلِيَعْلَمَ اللّٰهُ مَنْ يَّنْصُرُهٗ وَ رُسُلَهٗ بِالْغَيْبِ ؕ اِنَّ اللّٰهَ قَوِىٌّ عَزِيْزٌ ۟ (الحديد:٢٥)

తద్వారా జనం న్యాయం మీద నిలకడ చూపాలని, ఇంకా మేము ఇనుమునూ అవతరింజేశాము. ఇందులో కఠిన(పోరు) సామగ్రి ఉంది. జనులకు అనేక ప్రయోజనాలూ ఉన్నాయి. దీనివల్ల అల్లాహ్ తెలుసుకుంటాడు, చూడకుండానే ఎవరు అల్లాహ్‌కు, ఆయన సందేశహరులకు తోడ్పడతారో. నిస్సందేహంగా అల్లాహ్ శక్తిమంతుడు, బలోపేతుడు కూడా.

*(అల్ హదీద్ : 25)*

ఇస్లామ్ నిర్మించగోరే సమాజాన్ని న్యాయం, సంతులనాలు లేకుండా ఊహించడమూ సాధ్యం కాదు. ఇస్లామ్ బోధన ప్రకారం అన్యాయం, అక్రమాల వైఖరికి పూర్తిగా దూరంగా ఉండాలని, దాన్ని తప్పించుకు మెలగాలని, ఏ వ్యవహారంలోనూ, ఎటువంటి పరిస్థితిలోనూ అడుగులు సంతులన మార్గం నుండి తప్పరాదని అది ఆదేశిస్తుంది. అది న్యాయం సంతులనాల బోధన, తిరుగుబాటు, అత్యాచారాలను నిషేధించడం. రెండూ ఒకేసారి చేసింది. ఎందుకంటే ఇవి రెండూ ఒకే చిత్రానికి రెండు కోణాలు. దైవాదేశం ఏమిటంటే:

اِنَّ اللّٰهَ يَاْمُرُ بِالْعَدْلِ وَالْاِحْسَانِ وَ اِيْتَآئِ ذِى الْقُرْبٰى وَ يَنْهٰى عَنِ الْفَحْشَآءِ وَالْمُنْكَرِ وَالْبَغْىِ ۚ يَعِظُكُمْ لَعَلَّكُمْ تَذَكَّرُوْنَ ۟ (النحل:٩٠)

అల్లాహ్ ఆదేశిస్తున్నాడు, న్యాయాన్ని, ఉత్తమ వైఖరిని, బంధుగణానికి (దాని హక్కులు) నెరవేర్చడాన్ని, అలాగే నిషేధిస్తున్నాడు, నిర్లజ్జతను, చెడుగును, అత్యాచారాన్ని, తిరుగుబాటును. ఆయన మీకు ఉపదేశిస్తున్నాడు, మీరు ఉపదేశాన్ని స్వీకరించాలని. *(అన్ నహ్ల్ : 90)*

ఆదేశం ఏమిటంటే, శత్రువుల ఎడల కూడా న్యాయం సంతులనాల వైఖరిని అవలంబించాలి, ఇదే దైవభక్తిగలవారి విధానం:

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا كُوْنُوْا قَوّٰمِيْنَ لِلّٰهِ شُهَدَآءَ بِالْقِسْطِ وَلَا يَجْرِمَنَّكُمْ شَنَاٰنُ قَوْمٍ عَلٰٓى اَلَّا تَعْدِلُوْا ۚ اِعْدِلُوْا هُوَ اَقْرَبُ لِلتَّقْوٰى وَاتَّقُوا اللّٰهَ ۚ اِنَّ اللّٰهَ خَبِيْرٌ بِمَا تَعْمَلُوْنَ ۝ (المائدة:٨)

విశ్వసించినవారలారా, దైవం కొరకు నిలబడేవారిగా అవండి; న్యాయం, సంతులనాలకు సాక్షులుకండి, ఒక జాతి పట్ల వైరం కారణంగా మీరు న్యాయానికి విముఖులయ్యేలా చెయ్యరాదు. న్యాయాన్నే ఆచరించండి, ఇది తక్వాకు సమీపమయిన విషయం. దైవానికి భయపడుతూ మెలగండి, నిశ్చయంగా మీరు చేసేదంతా అల్లాహ్ బాగా ఎరుగు. *(అల్ మాఇద : 8)*

ఇస్లామ్ దృష్టిలో అధికారం, ప్రభుత అన్నవి న్యాయస్థాపనకు సాధనాలు. ఏ వ్యక్తి చేతిలో పరిపాలనా పగ్గాలున్నాయో అతని బాధ్యతలు ఇతరులకన్నా అధికతరమయినవి. అతను ఎట్టి పరిస్థితిలోనూ న్యాయస్థాపన కొరకే కృషి చేస్తాడు, అతను అన్యాయానికి అతీతంగా మెలుగుతాడు. ఇస్లామీయ రాజ్యం దాని సాధనా సంపత్తిని న్యాయ స్థాపనకు వినియోగిస్తుంది. మహనీయ దావూద్ (అ)ని సంబోధించి ఇలా సెలవీయడం జరిగింది:

يٰدَاوٗدُ اِنَّا جَعَلْنٰكَ خَلِيْفَةً فِى الْاَرْضِ فَاحْكُمْ بَيْنَ النَّاسِ بِالْحَقِّ وَلَا تَتَّبِعِ الْهَوٰى فَيُضِلَّكَ عَنْ سَبِيْلِ اللّٰهِ ۭ اِنَّ الَّذِيْنَ يَضِلُّوْنَ عَنْ سَبِيْلِ اللّٰهِ لَهُمْ عَذَابٌ شَدِيْدٌ بِمَا نَسُوْا يَوْمَ الْحِسَابِ ۝ (ص:٢٦)

దావూద్, మేము భువిలో నిన్ను మా ప్రతినిధిగా ఏర్పరిచాము. కాగా నీవు జనుల మధ్య న్యాయబద్ధంగా, న్యాయానికి అనుగుణంగా తీర్పులు చెయ్యి, నీ మనోకాంక్షలను అనుసరించబాకు, అవి నిన్ను దైవమార్గం నుండి తప్పించి వేస్తాయి. నిస్సందేహంగా ఎవరయితే దైవమార్గం నుండి తొలగిపోతారో వారికి కఠిన శిక్ష లభించనుంది. ఎందుకంటే వారు లెక్కల దినాన్ని విస్మరించివేశారు. *(సాద్ : 26)*

దైవసందేశహరుల (స)కు ఇలా ఆదేశమయింది:

وَاِنْ حَكَمْتَ فَاحْكُمْ بَيْنَهُمْ بِالْقِسْطِ ۭ اِنَّ اللّٰهَ يُحِبُّ الْمُقْسِطِيْنَ ۝ (المائدة:٤٢)

నీవు వీరి మధ్య తీర్పు చెయ్యవలసి వస్తే న్యాయం ప్రకారం తీర్పు చెయ్యి. నిశ్చయంగా అల్లాహ్ న్యాయం చేసేవారిని బహుధా ఇష్టపడతాడు. *(అల్ మాఇద : 42)*

దైవసందేశహరులు (స) సెలవిచ్చినదాని ప్రకారం న్యాయశీలుడయిన అధికారి, ప్రళయ దినాన దైవపరిపాలనా పీఠం నీడన స్థానం పొందిన వారిలో ఉంటాడు, ఆరోజున ఆ ఒక్క నీడ తప్ప మరో నీడ ఉండదు. (బుఖారి) హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ బిన్ ఆస్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

**ان المقسطين عند الله على منابر من نور عن يمين الرحمن عزوجل وكلتا يديه يمين، الذين يعدلون فى حكمهم و اهليهم وما ولوا**[2]

**నిస్సందేహంగా న్యాయపరిపాలకులు అల్లాహ్ దృష్టిలో జ్యోతిర్మయమయిన వేదికల మీద ఆసీనులయి ఉంటారు. వారు పరమ కరుణామయుడయిన ప్రభువు కుడి చెయ్యి ప్రక్కన ఉంటారు. అయితే ఆ ప్రభువు ప్రతి చెయ్యా కుడి చెయ్యే. న్యాయపరిపాలకులంటే తమ తీర్పుల్లో, తమ భార్యాపిల్లల వ్యవహార మయినా, లేదా తాము ఎవరెవరికి కాపలా దారులుగా నియమితులయ్యారో వారందరి వ్యవహారమయినా న్యాయబద్ధంగా వ్యవహ రిస్తారు. *(ముస్లిమ్)***

న్యాయం, సంతులనాల విషయంలో ఇస్లామ్ సువిశదమయిన నిర్దేశనలు ఇచ్చింది. ఇవి నిజంగానే ఆచరణ జరిగినట్లయితే ఒకరి హక్కును కాజేసే, లేదా అక్రమంగా, అన్యాయంగా ప్రవర్తించే వైఖరి సమూలంగా తుడుచుకుపోగలదు. సమాజంలో ఏ విధమయిన దోపిడి, దౌర్జన్యం జరిగే ఆస్కారం లేకుండా పరిశుద్ధ మయిన ఓ సమాజం ఏర్పడటం సుసాధ్యమయిపోతుంది.

## చట్టం ఆధిక్యత

ఇస్లామ్ కేవలం న్యాయం, సంతులనాలతో కూడుకున్న చట్టం ఇవ్వడమే కాదు, దాని ఆధిక్యతనూ నెలకొలిపింది. ఇస్లామ్ ప్రకారం న్యాయం దృష్టిలో అందరూ సమానులే. ఇందులో చిన్నవారు, పెద్దవారు, ధనికులు, పేదలు అన్న తారతమ్యం లేదు; ప్రతి ఒక్కరు ఇస్లామీయ శాసనం సమక్షంలో తలవంచడం వారి విధి. అలా చెయ్యలేకపోతే అది కాపట్యంగా, విశ్వాస బలహీనతగా పరిగణించబడుతుంది.

وَمَا كَانَ لِمُؤْمِنٍ وَّلاَ مُؤْمِنَةٍ اِذَا قَضَى اللّٰهُ وَرَسُوْلُـهٗ اَمْــرًا اَنْ يَّكُوْنَ لَهُمُ الْخِيَرَةُ مِنْ اَمْرِهِمْ ؕ وَ مَنْ يَّعْصِ اللّٰهَ وَ رَسُوْلَـهٗ فَقَـدْ ضَلَّ ضَلٰلاً مُّبِيْنًا۝ (الاحزاب:٣٦)

ఒక విశ్వాసి పురుషుడనయినా స్త్రీనయినా, అల్లాహ్, ఆయన సందేశహరుడు తీర్పు చెయ్యడానికి పిలిచినప్పుడు ఇక తమ వ్యవహారంలో స్వాధికారం ఏదీ మిగులదు. ఎవరయితే అల్లాహ్, ఆయన సందేశహరునికి అవిధేయత కనబరుస్తారో వారు అతిస్పష్టమయిన మార్గవిహీనతకు లోనయినవారు. *(అల్ అహ్జాబ్ : 36)*

ద్వంద్వ స్వభావుల వైఖరిని విమర్శిస్తూ ఖుర్ఆన్ ఇలా అంటుంది, అల్లాహ్, ఆయన సందేశహరుల తీర్పును స్వీకరించడంలో వీరు జాప్యం చూపుతారు, ఇందులో వారికి నష్టం కలుగుతుందని అనుకుంటారు. కాని నిజమయిన విశ్వాసుల వైఖరి మరో విధంగా ఉంటుంది. వారు ఆపాదమస్తకం వినయ విధేయతల రూపంగా మారిపోతారు. వారు దాన్ని సంతోషంగా స్వీకరిస్తారు:

اِنَّمَا كَانَ قَوْلَ الْمُؤْمِنِيْنَ اِذَا دُعُوْٓا اِلَى اللّٰهِ وَ رَسُوْلِهٖ لِيَحْكُمَ بَيْنَهُمْ اَنْ يَّقُوْلُوْا سَمِعْنَا وَ اَطَعْنَا ؕ وَاُولٰٓئِکَ هُمُ الْمُفْلِحُوْنَ۝ وَمَنْ يُّطِعِ اللّٰهَ وَ رَسُوْلَهٗ وَ يَخْشَ اللّٰهَ وَ يَتَّقْهِ فَاُولٰٓئِکَ هُمُ الْفَائِزُوْنَ۝ (النور:٥١-٥٢)

విశ్వాసుల మాటేమిటంటే, వారిని అల్లాహ్, ఆయన సందేశహరుల వైపునకు పిలిచినప్పుడు, వారిమధ్య తీర్పు చెయ్యడానికి, వారు కేవలం ఇంతే అంటారు- మేము విన్నాము, దాన్ని పాటించాము. వీరే సాఫల్యం పొందేవారు. ఎవరయితే అల్లాహ్, ఆయన సందేశహరుని విధేయత పాటిస్తారో, అల్లాహ్‌కు భయపడుతూ ఉంటారో, ఆయన పట్ల నిష్ఠ కలిగి ఉంటారో - ఇటువంటి వారే సఫలత నొందేవారు. *(అన్ నూర్ : 51, 52)*

చట్టం ఆధిక్యతకు సంబంధించిన ఒక గొప్ప ఉదాహరణ; ఒకసారి బనూ మఖ్జూమ్‌కు చెందిన ఓ స్త్రీ దొంగతనానికి పాల్పడింది. ఆ తెగ పెద్దలు మహనీయ ఉసామ వద్దకు వచ్చి అభ్యర్థించారు, ఆ స్త్రీకి చేతులు ఖండించే శిక్ష విధించకుండా సిఫారసు చెయ్యమని అర్థించారు. హజ్రత్ ఉసామ ప్రవక్త మహనీయులకు సంతానం

వలే ప్రేమపాత్రులు. ఆయన సిఫారసు చెయ్యగా ప్రవక్తశ్రీ (స) తన అసంతుష్టిని వ్యక్తపరిచారు, ఇలా అన్నారు:

أتشفع فی حد من حدود الله

**నీవు దైవం నియమించిన పరిమితుల విషయంలో సిఫారసు చేస్తున్నావా? అని మందలించారు.**

ఆ తరువాత ఆయన ఓ ప్రసంగం చేసి ఇలా సెలవిచ్చారు:

انما اهلک الذین قبلکم انهم کانوا اذا سرق فیهم الشریف ترکوه و اذا سرق فیهم الضعیف اقاموا علیه الحد.

**మీకు పూర్వం కూడా జనుల్ని ఏ విషయమయితే సర్వనాశనం చేసిందో అది ఇలాంటిదే, వారిలో ఎవరయిన గొప్పవాడు, గౌరవనీయుడయిన వ్యక్తి దొంగ తనం (లేదా మరేదయినా అపరాధం) చేసినప్పుడు అతన్ని వదిలేసేవారు. కాని ఎవరయినా బలహీనుడు దానికి పాల్పడినట్లయితే అతన్ని శిక్షించేవారు.**

నీ మాటలు పలికిన తరువాత ఆయన చట్టం ఆధిక్యత విషయంలో ఒక ప్రవక్త మాత్రమే చెప్పగల మాటలను పలికారు:

و أیم الله، لو ان فاطمة بنت محمد سرقت لقطعت یدها[1]

**దైవసాక్షి, ఒకవేళ ముహమ్మద్ (స) కూతురు ఫాతిమా కూడా ఈ దొంగతనానికి పాల్పడి ఉన్నట్లయితే నేను ఆమె చెయ్యినీ ఖండించేవాడిని. *(బుఖారి)***

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర), తాను ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవీయగా విన్నట్లు ఉల్లేఖించారు:

من حالت شفاعته دون حد من حدود الله فقد ضاد الله[2]

**ఎవరయితే అల్లాహ్ విధించిన పరిమితుల్లో ఒక పరిమితి విధింపు మార్గంలో అడ్డుపడి సిఫారసు చేస్తారో అటువంటి వారు అల్లాహ్‌కు వ్యతిరేకంగా మెలిగినవారు.**

***(అబూదావూద్)***

**ఆయనే అల్లాహ్, మీ కొరకు భూమిని పయనయోగ్యమయిన నేలగా పరిచాడు, అందులో దారులు ఏర్పరిచాడు, మీరు మీ గమ్యస్థానాలకు సునాయాసంగా చేరగలగా లని.** ***(అజ్ జుఖ్రుఫ్ : 10)***

**اَلَّذِیْ جَعَلَ لَکُمُ الْاَرْضَ مَھْدًا وَّجَعَلَ لَکُمْ فِیْھَا سُبُلاً لَّعَلَّکُمْ تَھْتَدُوْنَ○** **(الزخرف:١٠)**

మరో చోట ఇలా అన్నాడు:

**ఆయనే అల్లాహ్, మీ కొరకు భూమిని నేలగా పరచినవాడు, తద్వారా మీరు దాని సువిశాల మార్గాలపైన పయనించగలగా లని.** ***(నూహ్ : 19, 20)***

**وَاللّٰہُ جَعَلَ لَکُمُ الْاَرْضَ بِسَاطًا○ لِّتَسْلُکُوْا مِنْھَا سُبُلاً فِجَاجًا** **(نوح:١٩،٢٠)**

ఇస్లామ్, ప్రయాణావస్థలో కొన్ని విధులలోనూ, కర్తవ్యాలలోనూ రాయితీల నిచ్చింది. ప్రయాణీకులకు సహాయపడాలన్న బాధ్యత సమాజానికి అప్పగించింది, వారికి కావలసిన వసతులు ఏర్పరచాలని ఆదేశించింది. ప్రభుత్వ ధనాగారం (బైతుల్ మాల్)లో వారికి హక్కు కల్పించింది. ఎవరయితే తమ అశక్తత వల్ల బ్రతుకుతెరువు కొరకు ప్రయాణం చేయలేరో వారిపట్ల సానుభూతితో వ్యవహరించాలని ఆదేశించింది. మనిషి తన ధార్మిక, ప్రాపంచిక అవసరాలకు తగినట్లు ప్రయాణించగలడన డానికి ఇదీ ఒక ఆధారమే. ఇస్లామ్ దీన్ని ధర్మసమ్మతం చేయడంతోపాటు ఇందులో సహకరిస్తుంది కూడా. కొన్ని సందర్భాలలో ప్రయాణం దాని దృష్టిలో అభిలషణీయ మయిన చర్య. అందులో అనవసర ఆంక్షలు పెట్టడం దానికి నచ్చదు.

## పీడితుని హక్కు

మనిషి భయం, ప్రమాదాల బాధ నుండి శాంతిశ్రేయాల జీవితం గడపడం అతని హక్కుగా ఇస్లామ్ సమ్మతించింది. అతని ధనమాన ప్రాణాలు ఎలాంటి ప్రమా దానికి గురికాకుండా ఉండాలన్న హక్కు అతనికి ఉంది. తనపైన ఎవరయినా చెయ్యి చేసుకుంటే దానికి వ్యతిరేకంగా గళం విప్పడం అతని హక్కు. అతను న్యాయస్థానం ముందు, ప్రజల ముందు తన కేసు పెట్టుకోవడానికి అతనికి అనుమతి ఉంటుంది. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

**చెడ్డ విషయాన్ని బహిరంగంగా ప్రకటించడాన్ని అల్లాహ్ ఇష్టపడడు. అయితే ఎవరి మీద దౌర్జన్యం జరుగుతుందో వారికి ఈ హక్కు ఉంది.** ***(అన్ నిసా:148)***

**لاَ یُحِبُّ اللّٰہُ الْجَھْرَ بِالسُّوْٓءِ مِنَ الْقَوْلِ اِلاَّ مَنْ ظُلِمَ** **(النساء:١٤٨)**

ఓ ప్రక్కన పీడితుని ఈ హక్కును నైతికంగా, చట్టపరంగా అంగీకరిస్తూ అతను అన్యాయానికి వ్యతిరేకంగా గళం ఎత్తి న్యాయం కోరాలని చెబుతూ, మరో వైపున సమాజం ముందుకు వచ్చి పీడితునికి సహాయపడాలని దానికి బాధ్యతనప్పగించింది. దైవసందేశహరులు (స) పీడితునికి సహాయపడటం అతనికి తప్పనిసరిగా లభించ వలసిన హక్కుగా సెలవిచ్చారు. ఏ రూపంలోనూ అత్యాచారునికి తోడ్పడరాదని బోధించారు. దౌర్జన్యపరునికి తోడ్పడటం ఇస్లామ్ బోధనాసారానికి వ్యతిరేకం. ఆయన ఇలా సెలవిచ్చారు:

**من مشى مع ظالم ليقوّيه وهو يعلم انه ظالم فقد خرج من الاسلام**[1]

**ఎవరయితే ఒక వ్యక్తి దౌర్జన్యపరుడని తెలిసీ అతనికి బలం చేకూర్చడానికి తోడుగా వెడతారో వారు ఇస్లామ్ నుండి దూరమయి పోతారు.**[1]

న్యాయస్థాపన కొరకు సమాజంలో బాధితునికి సహకారం, దౌర్జన్యపరునికి సహాయనిరాకరణ వాతావరణం నెలకొనడం అవసరం. ఇందులో ప్రభుత్వ పాత్ర ప్రముఖమయినది.

ఇస్లామీయ రాజ్యం పీడితునికి అతని హక్కును ఇప్పించే బాధ్యతకు కట్టుబడి ఉంది. మహనీయ అబూ బక్ర్ (ర) ఖిలాఫత్ బాధ్యత స్వీకరించిన తరువాత చేసిన తొలి ప్రసంగంలో తన ప్రభుత్వ పాలనా నీతి (పాలిసీ)ని ప్రకటిస్తూ ఇలా నుడివారు:

**الضعيف فيكم قوى عندى حتى آخذ له حقه والقوى ضعيف عندى حتّى أخذ منه الحق ان شاء الله تعالىٰ**[2]

**మీలో ఎవరయితే బలహీనుడో అతను నా వద్ద బలం గలవాడు. పరిణా మంగా నేను అతనికి అతని హక్కును చేరవేస్తాను. మరి మీలో బలంగలవాడు నా వద్ద బలహీనుడు. పరిణామంగా అతని వద్ద ఇతరుల హక్కు ఏదయినా ఉంటే అతన్నుండి దాన్ని తీసుకుంటాను, ఇన్షా అల్లాహ్.**[2]

బాధితుని పక్షాన ప్రభుత్వ శక్తి ఉన్నప్పుడు, అది న్యాయసంస్థాపన తన ప్రథమ బాధ్యతగా పరిగణించినప్పుడు అత్యంత బలహీనుడయిన వ్యక్తి కూడా తన ఏ హక్కునూ కోల్పోజాలడు.

---

1. *మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ అరబ్, బాబ్ అజ్జుల్మ్.*
2. *ఇబ్ను అసీర్, అల్‌కామిల్ ఫిత్తారీఖ్ : 2 : 194-195.*

# 3. మౌలిక అవసరాల పరిపూర్తి హక్కు

## మానవుని మౌలిక అవసరాలు

మానవ ప్రాణం పవిత్రమయినదన్న భావనతోపాటే అతని ఈ మౌలిక అవసరాల పరిపూర్తి భావన కూడా ఇమిడి ఉంది. ప్రతి మానవుడు తన జీవితావసరాల కొరకు పాటుపడే హక్కును ఇస్లామ్ అంగీకరిస్తుంది. దీనిగ్గాను అతను దేవుని భూమినీ, దాని వనరుల్ని వినియోగించుకోగలడు. మానవుని మౌలిక అవసరాలలో ఆహారం, దుస్తులు, ఇల్లు, నౌకరులు వంటి అవసరాలున్నాయి. వీటి ప్రతి ఒక్కదాని విషయంలోనూ ఇస్లామ్ స్పష్టమయిన విధానాన్ని అవలంబిస్తుంది. వీటిలో దేన్ని పొందడానికయినా అతన్ని వ్యతిరేకించదు, పైగా ఇస్లామ్ దాన్ని ప్రోత్సహిస్తుంది.

## జీవిక కొరకు కృషి

పరమ ప్రభువు అల్లాహ్ మానవ జీవిక కొరకు తన ఈ భూమిలో సంపూర్ణ సామగ్రిని పొందుపరచిపెట్టాడు. భూమిపైన నివసించే ప్రతి వ్యక్తికి దాన్ని సాధించేందుకు, దాని ద్వారా ప్రయోజనం పొందేందుకు కృషి చేసే హక్కు సహజంగానే ఉంది. ఇలా సెలవీయబడింది:

هُوَ الَّذِىْ جَعَلَ لَكُمُ الْاَرْضَ ذَلُوْلاً فَامْشُوْا فِىْ مَنَاكِبِهَا وَ كُلُوْا مِنْ رِزْقِهٖ ؕ وَ اِلَيْهِ النُّشُوْرُ ۝ (الملک:١٥)

**ఆ దైవమే భూమిని మీ కొరకు అధీనపరిచాడు. దాని అంచులపైన తిరగండి, ఆయన ప్రసాదించిన జీవికను పొంది తినండి, అందరూ ఆయన వైపునకే మరలిపోవలసి ఉంది.** ***(అల్ ముల్క్ : 15)***

మరో చోట ఇలా సెలవిచ్చాడు:

اَللّٰهُ الَّذِىْ سَخَّرَ لَكُمُ الْبَحْرَ لِتَجْرِىَ الْفُلْكُ فِيْهِ بِاَمْرِهٖ وَ

**అల్లాహ్ స్వయంగానే మీ కొరకు సముద్రాన్ని అధీనపరిచాడు, తద్వారా ఆయన ఆజ్ఞ మేరకు అందులో ఓడలు నడుస్తూ**

لِتَبْتَغُوْا مِنْ فَضْلِهٖ وَ لَعَلَّكُمْ تَشْكُرُوْنَ ۝ وَ سَخَّرَ لَكُمْ مَّا فِی السَّمٰوٰتِ وَمَا فِی الْاَرْضِ جَمِيْعًا مِّنْهُ ۚ اِنَّ فِیْ ذٰلِكَ لَاٰيٰتٍ لِّقَوْمٍ يَّتَفَكَّرُوْنَ ۝ (الجاثیہ:۱۲،۱۳)

**ఉంటాయి. ఆ విధంగా మీరు ఆయన అనుగ్రహాన్ని (జీవికను) అన్వేషించగలుగు తారు, బహుశా ఇలాగయినా మీరు ఆయన పట్ల కృతజ్ఞులవుతారేమో. ఆయన మీ కొరకు ఆకాశాల లోనూ భూమిలోనూ ఉన్న సమస్త వస్తువుల్ని అధీనపరిచాడు. నిస్సందేహంగా ఆలోచించే వారి కొరకు ఇందులో సూచనలున్నాయి.**

***(అల్ జాసియ:12, 13)***[1]

జుమా నమాజ్, దాని ప్రాముఖ్యత, అందులో పాల్గొనడం తప్పనిసరి అని బోధించిన తరువాత సెలవీయబడింది:

فَاِذَا قُضِيَتِ الصَّلٰوةُ فَانْتَشِرُوْا فِی الْاَرْضِ وَ ابْتَغُوْا مِنْ فَضْلِ اللّٰهِ وَاذْكُرُوا اللّٰهَ كَثِيْرًا لَّعَلَّكُمْ تُفْلِحُوْنَ ۝ (الجمعہ:۱۰)

**నమాజ్ ముగిసిన తరువాత భువిలో విస్తరించండి, అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించండి, అల్లాహ్‌ను సర్వాధికంగా సంస్మరించండి; మీరు సాఫల్యం పొంద గలరన్న ఆశ ఉంది. *(అల్ జుముఅ : 10)***

భావమేమిటంటే, నమాజ్ ముగిసిన తరువాత దైవానుగ్రహాన్ని వెదకడానికి భువిలో వ్యాపించి అన్వేషించేందుకు మీకు అనుమతి ఉంది. భూమి అంతా మీ కొరకే, దీని వనరుల ద్వారా ప్రయోజనం పొందడం మీ హక్కు.

మానవుడు, మరి ఇతర ప్రాణుల మధ్య వ్యత్యాసం ఏమిటంటే, మనిషి సహజంగానే పరిశుద్ధమయిన, పరిశుభ్రమయిన ఆహారాన్ని కోరుకుంటాడు. అశుద్ధమయిన, అపరిశుభ్రమయిన ఆహారం అతని ప్రకృతికి సరిపడవు, అవి అతని ఆరోగ్యానికీ చేటుగా, హానికరంగా పరిణమిస్తాయి. ఏ ఆహార పదార్థాలనయితే అతను వాటి నిజరూపంలో తింటాడో అవి కూడా శుభ్రంగా ఉండాలి. మరి వేటినయితే తను వండి రుచికరంగా, జీర్ణించేవిగా చేసి మరీ భుజిస్తాడో అవి కూడా అశుద్ధతకు దూరంగా ఉండాలి.

ఇస్లామ్ దృష్టిలో ఇది మానవుని ప్రాథమిక హక్కు. అతను తన కృషి,

1. *ఈ సందర్భంలో మరిన్ని వచనాలు మదనించండి, తాహా : 53, 54*

ప్రయత్నాల వల్ల తనకు పరిశుద్ధమయిన పరిశుభ్రమయిన ఆహారాన్ని పొందాలి. ఇది ధార్మికతకు, దైవభక్తికి, ధర్మనిష్ఠకు వ్యతిరేకమయిన విషయం కాదు. అయితే ఈ కృషిలో హలాల్ (ధర్మసమ్మతమయిన), హరామ్ (అధర్మమయిన) విధానాలు, పదార్థాలను మటుకు సదా దృష్టిలో ఉంచుకుని ఆ నియమాలను పాటించవలసి ఉంటుంది.

يَآيُّهَا النَّاسُ كُلُوْا مِمَّا فِي الْاَرْضِ حَلٰلاً طَيِّبًا وَّلاَ تَتَّبِعُوْا خُطُوٰتِ الشَّيْطٰنِ ۚ اِنَّهٗ لَكُمْ عَدُوٌّ مُّبِيْنٌ ○ اِنَّمَا يَاْمُرُكُمْ بِالسُّوْٓءِ وَالْفَحْشَآءِ وَ اَنْ تَقُوْلُوْا عَلَى اللّٰهِ مَا لاَ تَعْلَمُوْنَ ○ (البقرة:١٦٨،١٦٩)

జనులారా, నేలలోని పదార్థాలలో హలాల్, పరిశుద్ధమయిన పదార్థాలన్నింటినీ భుజించండి, షైతాన్‌ని అనుసరించకండి. నిస్సందేహంగా వాడు మీకు ప్రస్ఫుటమయిన శత్రువు. వాడు మీకు చెడుగును అశ్లీలాన్నీ ఆదేశిస్తాడు. ఇంకా మీరు అల్లాహ్ విషయంలో మీరు ఎరుగనటు వంటి అబద్ధాలను కల్పించేందుకు పురికొలుపుతాడు. *(అల్ బకర:**168, 169**)*

## దుస్తులు

మానవుని ప్రాథమిక అవసరాలలో దుస్తులు కూడా ఉన్నాయి. మనిషికి దుస్తుల ప్రాముఖ్యత ఎన్నో విధాలుగా ఉంది. ఇది మనిషిని పశువులతో వేరు చేసి ప్రత్యేకతనిస్తుంది. పశువులు ఎక్కడ పుడతాయో అక్కడి వాతావరణానికి అనుగుణంగా, అనుకూలంగా వాటి శారీరక నిర్మాణం ఉంటుంది. వాతావరణం తీవ్రత దాల్చితే మరోచోటికి వలసపోతాయి. మనిషి పరిస్థితి దీనికి భిన్నమయింది. ఇతని శరీరం వాతావరణంలోని శీతోష్ణస్థితుల తీవ్రతను భరించజాలదు. అతను దుస్తుల ద్వారా దాన్ని ఎదుర్కొంటాడు.

మరో కోణం ఏమిటంటే, పశువులో సిగ్గు లజ్జ వంటి భావాలుండవు. దీనికి భిన్నంగా మానవునిలో సహజంగానే లజ్జ, వ్రీడా భావాలుంటాయి. నగ్నత్వం ఇతని ప్రకృతికి విరుద్ధమయింది. అతను శరీరంలోని మరమ్మస్థలాలను ఆచ్ఛాదితం చేయాలని కోరుకుంటాడు. ఈ సహజమయిన వ్రీడ కారణంగానే మహనీయ ఆదమ్ (అ) హవ్వాల నుండి స్వర్గపు దుస్తులు వాపసు తీసుకోబడినప్పుడు వారు తమ శరీరాన్ని స్వర్గపుటాకులతో కప్పుకోసాగారు:

وَ طَفِقَا يَخْصِفٰنِ عَلَيْهِمَا مِنْ وَّرَقِ الْجَنَّةِ ؕ (الاعراف:٢٢)

వారు తమ శరీరాలను స్వర్గపుటాకులతో కప్పుకోసాగారు. *(అల్ ఆరాఫ్ : 22)*

దీని మరో కోణం ఏమిటంటే దుస్తులు మనిషికి అలంకారంగాను శోభగానూ ఉపయోగపడతాయి:

يٰبَنِىْٓ اٰدَمَ قَدْ اَنْزَلْنَا عَلَيْكُمْ لِبَاسًا يُّوَارِىْ سَوْءٰتِكُمْ وَرِيْشًا ؕ وَّلِبَاسُ التَّقْوٰى ۙ ذٰلِكَ خَيْرٌ ؕ ذٰلِكَ مِنْ اٰيٰتِ اللّٰهِ لَعَلَّهُمْ يَذَّكَّرُوْنَ ۝ (الاعراف:٢٦)

**ఆదమ్ సంతానమా, మేము మీ కొరకు దుస్తులను అవతరింపజేశాము. అది మీ మర్మాంగాలను కప్పిపెడుతుంది. మీకు అలంకరణగా ఉపయోగపడే దుస్తులు అవతరింపజేశాము. అయితే నిష్ఠాగరిష్ఠ దుస్తులే ఉత్తమమయిన దుస్తులు. ఇవి అల్లాహ్ శక్తికి సూచనలు, బహుశా వారు వీటి ద్వారా మార్గ బోధన గ్రహిస్తారేమో**

*(అల్ ఆరాఫ్ : 26)*

ఈ విధంగా ఇస్లామ్ దుస్తులు, ఉత్తమమయిన దుస్తుల ఆవశ్యకతను ప్రాముఖ్యతను స్పష్టపరచింది. అది దీన్ని మానవుని మౌలిక అవసరంగా పరిగణిస్తుంది. అయితే మనిషి ఈ బాహ్య వస్త్రాల చింతలో నిష్ఠాగరిష్ఠ దుస్తులను మరచిపోరాదు.

## నివాసం

నివాస స్థలం కూడా మానవుని మౌలిక అవసరాలలోనిది. నివాస స్థలాలు విభిన్న రూపాలలో ఉంటాయి. ప్రతిదాని ప్రాముఖ్యత దాని స్థానాన ఉంటుంది. దివ్యఖుర్ఆన్ దీన్ని ఇలా ప్రస్తావించింది:

وَاللّٰهُ جَعَلَ لَكُمْ مِّنْ بُيُوْتِكُمْ سَكَنًا وَّ جَعَلَ لَكُمْ مِّنْ جُلُوْدِ الْاَنْعَامِ بُيُوْتًا تَسْتَخِفُّوْنَهَا يَوْمَ ظَعْنِكُمْ وَ يَوْمَ اِقَامَتِكُمْ ۙ وَمِنْ اَصْوَافِهَا وَ اَوْبَارِهَا وَ اَشْعَارِهَا

**అల్లాహ్ మీ కొరకు మీ ఇళ్ళను మీకు నివాస స్థలాలుగా చేశాడు. మీ కొరకు జంతువుల చర్మాలతో చేసిన గుడారాలను సయితం ఏర్పరిచాడు. అవి మీకు తేలికగా ఉంటాయి- మీరు బయలుదేరు దినాన, మీరు మజిలీ చేసే దినాన కూడా. ఆయన పశువుల ఉన్నితోనూ, రోమాలతోను, వెంట్రుకలతోను ఓ ప్రత్యేక కాలానికి గాను**

اَثَاثًا وَّ مَتَاعًا اِلٰى حِيْنٍ۝ وَاللّٰهُ جَعَلَ لَكُمْ مِّمَّا خَلَقَ ظِلٰلاً وَّ جَعَلَ لَكُمْ مِّنَ الْجِبَالِ اَكْنَانًا وَّجَعَلَ لَكُمْ سَرَابِيْلَ تَقِيْكُمُ الْحَرَّ وَ سَرَابِيْلَ تَقِيْكُمْ بَاْسَكُمْ ؕ كَذٰلِكَ يُتِمُّ نِعْمَتَهٗ عَلَيْكُمْ لَعَلَّكُمْ تُسْلِمُوْنَ۝ (النحل:۸۰-۸۱)

విభిన్న సామగ్రి, జీవన వసతులు చేశాడు. అల్లాహ్ తాను నిర్మించిన వస్తువుల్లో నీడను ఏర్పరిచాడు, మీ కొరకు కొండల్లో తల దాచుకునే స్థలాలు పెట్టాడు. ఆయన మీ కొరకు దుస్తులూ తయారు చేశాడు. అవి మిమ్మల్ని వేడిమి నుంచి కాపాడతాయి, మిమ్మల్ని యుద్ధంలో రక్షించే నిమిత్తం పనికివచ్చే దుస్తులు (కవచాలు) సయితం ఆయన సృజించాడు. ఈ విధంగా అల్లాహ్ తన వరప్రసాదాలను మీకు పరిపూర్ణం గావిస్తాడు. తద్వారా మీరు ఆయన ఆజ్ఞా బద్ధులు కావాలని. ***(అన్ నహ్ల్ : 80, 81)***

ఈ వచనాలలో మూడు విధాల నివాస స్థలాలను గురించి ప్రస్తావన ఉంది.

1. మనిషి కొండల్లో అడవుల్లో తయారు చేసుకునే నివాస స్థలాలు. ఇవి మానవుడు చరిత్రలో ప్రారంభకాలంలో వీటిని నిర్మించుకుని వినియోగించుకుని ఉంటాడు. కాని ఇప్పుడు వీటిని కేవలం యుద్ధ అవసరాలలో నిర్మించుకుంటున్నాడు. తాత్కాలికంగా స్వల్పకాలిక అవసరాలకు, యుద్ధ అవసరాలకు వీటి ఆవశ్యకత కలగవచ్చు.
2. రెండవ కోవకు చెందిన నివాస స్థలాలు గుడారాల రూపంలో, డేరాల రూపంలో కనిపిస్తాయి. ఇవి ఒకచోటి నుంచి మరో చోటికి సునాయాసంగా రవాణా చేయడానికి అనువుగా ఉంటాయి. వీటిని దేశదిమ్మరులు ఎక్కువగా వినియోగిస్తారు. విహారయాత్రల్లో సేనావసరాలకు సయితం వీటిని వాడతారు.
3. మూడవ కోవకు చెందిన నివాస స్థలాలకు ఖుర్ఆన్ 'సకనా' అనే పదాన్ని ప్రయోగించింది. వీటిలో మనిషి సుస్థిర నివాసం ఏర్పరచుకుంటాడు. వీటిలో అతని నివాసముండే అవసరాలు తీరుతాయి. వీటిలో అతను శాంతిని, విశ్రాంతిని, నెమ్మదిని పొందుతాడు. ఇవి మానవుని నాగరిక జీవితానికి తప్పనిసరి అంశం, అవసరం కూడా.

ఈ విభిన్న విధాల నివాస స్థలాలు, సాధారణ దుస్తులు, సైనిక దుస్తులను గురించి ఈ ఆయత్‌లలో రెండు విషయాలున్నాయి. ఒకటి, అవి మనిషి అవసరాలను

తీర్చుతాయి అన్నది. రెండవది, అవి అల్లాహ్ అనుగ్రహించిన వరప్రసాదాలు, మహోప కారాలు అన్నది. దీని భావం ఏమిటంటే, ఒకరికయినా ఇల్లు ప్రాప్తమయి ఉందంటే అతనికి అల్లాహ్ వరప్రసాదం ఒకటి ప్రాప్తమయి ఉందన్న మాట. దానికి అతను అల్లాహ్‌కు కృతజ్ఞతలు అర్పించుకోవాలి. మరెవరికయినా ఇల్లు లేదంటే అతను దాని కొరకు ప్రయత్నించడం తప్పుకాదు. అది అభిలషణీయమయిన చర్యే అనిపించుకుం టుంది, ఎందుకంటే, అతను అల్లాహ్ వరప్రసాదాన్ని అన్వేషిస్తున్నాడన్నమాట. అలా అన్వేషించి అతను ఇతరుల సమక్షంలో అగత్యపరునిగా నిలువరాదని కోరుకుంటాడు.

ఇల్లు ఒక ఆవశ్యకత, ఇస్లామీయ రాజ్యం దాని కార్యకర్తలకు (ప్రభుత్వోద్యోగు లకు) ఆ అవసరాన్ని తీర్చే ఏర్పాటు చేస్తుంది. ఇంకా రాజ్యంలోని సమస్త పౌరులకు ఆ సౌలభ్యం ప్రాప్తం కావాలని అది ప్రయత్నిస్తుంది. ఈ విషయంలో అది సాధ్య మయినన్ని విధాలా సహకరిస్తుంది. ఇల్లు గల వ్యక్తికి అతనికి ఆ ఇంటిపైన స్వామ్యం కలిగి ఉండే అతని హక్కును ఆమోదిస్తుంది. ఆ హక్కును పరిరక్షిస్తుంది కూడా.

## నౌకరు, వాహనం

మానవుని సహాయానికి నౌకరు అవసరమని, వాహనమూ అతని అవసరమే నని ఇస్లామ్ అంగీకరిస్తుంది. అవి అతనికి ప్రాప్తం కావాలని కూడా అది ఆమోది స్తుంది. ప్రవక్త మహనీయులు (స)సెలవిచ్చినట్లు ముస్తౌంద్ బిన్ షద్దాద్ ఉల్లేఖించారు:

من كان لنا عاملا فليكتسب زوجة فان لم يكن له خادم فليكتسب خادما فان لم يكن له مسكن فليكتسب مسكنا و فى رواية من اتخذ غير ذلك فهو غال[1]

**మా కార్యకర్తలయిన వారు (ఉద్యోగులు) అవివాహితుడయితే (ప్రభుత్వ ఖజానా నుండి సహాయం పొంది) పెళ్ళి చేసు కోవాలి. అతని వద్ద నౌకరు లేకపోతే నౌకరును పొందాలి. అతనికి నివాస స్థలం లేకపోతే ఒక ఇల్లు నిర్మిం చుకోవాలి. ఒక ఉల్లేఖనం ప్రకారం, ఈ అవసరాలకు తప్ప మరి దేనికయినా బైతుల్ మాల్ నుండి ఎవరయినా ఏమయినా గ్రహిస్తే అతను అప్పగింత పట్ల ద్రోహం చేసినవాడవు తాడు.**[1]

---

1. అబూదావూద్, కితాబుల్ ఖరాజ్, బాబ్ ఫీ అర్‌జాకుల్ ఉమ్మాల్

## ఆర్థిక సుసంపన్నత

ఇస్లామ్ ఆర్థిక సుసంపన్నతను తప్పయినదిగా భావించదు. అంతే కాదు, అది వాగ్దానం చేస్తుంది, మానవుడు అల్లాహ్ ఆదేశాలకు కట్టుబడి ఉన్నట్లయితే, అతని ద్వారా అల్లాహ్ ధర్మసంస్థాపనం జరిగినట్లయితే అతనికి ఆర్థిక సుసంపన్నత ప్రాప్త మవుతుందని అంటుంది. ఇలా సెలవీయబడింది:

وَلَوْ اَنَّهُمْ اَقَامُوا التَّوْرٰةَ وَالْاِنْجِيْلَ وَمَا اُنْزِلَ اِلَيْهِمْ مِّنْ رَّبِّهِمْ لَاَكَلُوْا مِنْ فَوْقِهِمْ وَ مِنْ تَحْتِ اَرْجُلِهِمْ ؕ مِنْهُمْ اُمَّةٌ مُّقْتَصِدَةٌ ؕ وَ كَثِيْرٌ مِّنْهُمْ سَآءَ مَا يَعْمَلُوْنَ ۝ (المائدة:٦٦)

**వారు (గ్రంథవహులు) తౌరాత్‌ని, ఇన్జీల్‌ని, అలాగే వారి దైవం తరపున వారికి అవత రించిన ఈ ఖుర్‌ఆన్‌ని స్థాపించి ఉన్నట్ల యితే తమపై (ఆకాశం) నుండి కురిసిన దాన్నీ తినేవారు, తమ పాదాల క్రింది (భూమి) నుండి కూడా భుజించేవారు. వీరిలో కొందరయితే మధ్యేమార్గాన్ని అవలంబిస్తున్నారు. చాలా మంది దుర్వర్త నులయినవారే ఉన్నారు.**

***(అల్ మాఇద : 66)***

ధనం ప్రాముఖ్యాన్ని ఇస్లామ్ కాదనలేదు. దాన్ని ఆమోదించింది. దాన్ని జీవన స్థాపన, మనుగడకు ఆధారంగా పేర్కొన్నది:

وَلَا تُؤْتُوا السُّفَهَآءَ اَمْوَالَكُمُ الَّتِىْ جَعَلَ اللّٰهُ لَكُمْ قِيٰماً (النساء:٥)

**మీ సంపాదనల్ని పరమ ప్రభువు అల్లాహ్ మీ జీవన సంస్థాపనకు సాధనంగా చేశాడు, వీటిని తెలివితక్కువవారికి అప్పగించకండి.** ***(అన్ నిసా : 5)***

మనిషి వద్ద ధనముండి అతను దాన్ని సదాచార మార్గాన ఖర్చుపెడితే అతను ఈర్ష్య చెందదగిన వ్యక్తి. హదీసులో ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

**لا حسد إلا فى اثنين رجل آتاه الله مالا فسلّطه على هلكته فى الحق و رجل آتاه الله**

**ఈర్ష్య చెందడం కేవలం ఇద్దరు వ్యక్తుల వరకే పరిమితం. ఒకడు, దైవం ధనం ఇవ్వగా సత్యమార్గాన దాన్ని ఖర్చుచేసి వేసేందుకు కేటాయించినవాడు. రెండవ తను, అల్లాహ్ ఎవరికి, ధార్మిక ఔచితీ**

**الحكمة فهو يقضى بها و يعلّمها¹**

**జ్ఞానం (ధర్మావగాహన) ప్రసాదించాడో అతను దాని ద్వారా తీర్పులు చేస్తాడు, దాన్ని ఇతరులకూ బోధిస్తాడు.[1]**

హజ్రత్ సఅద్ చేసిన ఉల్లేఖనం ప్రకారం ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

**ان الله يحب العبد التقى الغنى الخفى²**

**నిస్సందేహంగా అల్లాహ్ ప్రేమకు పాత్రుడు దాసుడు, ఇతను భయభక్తులు నిష్ఠగల వాడు, ధనం వెచ్చించేవాడు, ధనం గల వాడు, కాని చాటున ఉండేవాడు.[2]**

భావమేమిటంటే, ధనంగలవాడు తన సంపదను సత్యమార్గంలో ఖర్చుపెట్టినా దాన్ని తన పేరుప్రతిష్ఠలకు, ప్రదర్శనాబుద్ధితో చేయడు. తన్ను తాను మరుగున ఉంచుకుని మరీ చేస్తాడు. ఇటువంటి వ్యక్తి అల్లాహ్‌కు చాలా ప్రియమయినవాడు.

హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్(ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్తశ్రీ(స) ఇలా సెలవిచ్చారు:

**نعم المال الصالح للرجل الصالح³**

**సంస్కారవంతుడయిన వ్యక్తికి సంస్కార వంతమయిన ధనమే సరయినది.[3]**

అంటే ధనం ధర్మబద్ధంగా సంపాదించబడాలి, సదాచార హస్తాల్లో ఉండాలి, ఇది ఎంతయినా అభిలషణీయమయినదే. ఈ ధనం అల్లాహ్ అనుగ్రహం, ఆయన దాసులయిన మానవుల సేవకు ఉత్తమమయిన సాధనం.

దీన్నిబట్టి ధర్మబద్ధమయిన పరిధుల్లో ధన సంపాదన తప్పయినది కాదు. ఇస్లామ్ దీనికి అవకాశాలను, సౌలభ్యాలను ప్రసాదిస్తుంది.

**ప్రభుత్వ బాధ్యత**

ఇస్లామీయ ప్రభుత్వం సంక్షేమరాజ్యం ఏ వ్యక్తి అయినా తన మౌలిక అవస రాలు పూర్తిచేసుకోలేకపోతే ఇస్లామీయ రాజ్యం దాన్ని నెరవేరుస్తుంది. అది సమాజంలో అగత్యపరుడయి తన ఆర్థిక భారాన్ని మోయలేని ప్రతి వ్యక్తిని పోషిం చేందుకు బాధ్యత కలిగి ఉంటుంది. దైవసందేశహరులు (స) ప్రకటించిన ఆర్థిక పోషణను గురించి మహనీయ అబూ హురైరా (ర) ఇలా వ్యక్తీకరించారు:

---

1. బుఖారి, కితాబుల్ ఇల్మ్; ముస్లిమ్, కితాబుస్సలాతుల్ ముసాఫిరీన్.
2. ముస్లిమ్, కితాబుజ్జుహ్ద్ వర్రికాయిక్
3. ముస్నద్ అహ్మద్ : 4 : 193

فلما فتح الله عليه الفتوح قال انا اولى بالمؤمنين من انفسهم فمن مات و عليه دين ولم يترك وفاءً فعلى قضاؤه، ومن ترك مالا فلورثته، و فى رواية من ترك دينا اوضياعا فلياتنى فانا مولاه وفى رواية من ترك مالا فلورثته، ومن ترك كلا فالينا.[1]

అల్లాహ్ ఆయన (స)కు విజయాల ద్వారాలు తెరచిపెట్టినప్పుడు ఆయన ఇలా ప్రకటించారు: నేను విశ్వాసుల ప్రాణాల కన్నా వారికి సమీపాన ఉన్నాను. ఎవ రయినా మరణించగా అతడు రుణగ్రస్తు డయితే, దాని చెల్లింపునకు అతను ఏదీ వదలకపోతే ఆ రుణం చెల్లించడం నా బాధ్యత.

ఎవరయినా ధనం వదలిపోయినట్లయితే అది అతని వారసులది. మరో ఉల్లేఖ నంలో ఇలా ఉంది : ఏ వ్యక్తి అయినా రుణం లేదా హతమయిపోగల ప్రమాదం ఉండి, భార్యాబిడ్డలను వదలి వెళ్ళినట్లయితే వారు నా వద్దకు రావాలి, నేను వారి సంర క్షకుణ్ణి; మరో ఉల్లేఖనంలో, ఎవరయితే ధనం వదలి ప్రపంచాన్ని వీడిపోతారో అది అతని వారసులది. మరెవరయితే భారం (రుణ భారం), నిరుపేద భార్యాపిల్లల భారం వదలి వెళ్ళినట్లయితే అది మా బాధ్యత.[1]

మదీనాలో ప్రారంభ దినాలలో దైవసందేశహరులు (స) అవలంబించిన విధానం ఏమిటంటే, ఎవరయినా మరణిస్తే అతను రుణగ్రస్తుడా అని అడిగేవారు. అప్పు ఉందని తెలిస్తే దాన్ని చెల్లించడానికి తగినంత సొమ్ము వదిలాడా అని అడిగేవారు. అతను వదలిన సొమ్ముతో అప్పు చెల్లించ వీలుందని తెలిస్తే జనాజా నమాజ్ చేయించేవారు. లేదంటే, వెళ్ళండి మీరే నమాజ్ చేసుకోండి అని పలికేవారు. (దీనికి అసలు కారణం అప్పు విషయంలో జనం అజాగ్రత్తగా ఉండరాదన్నది, మరణా నికి పూర్వమే అంతా చెల్లించే ఏర్పాట్లు చేసుకోవాలన్నది మాత్రమే). అయితే ఎవ

1. మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ బుయూ, బాబుల్ ఫరాయిజ్. (బుఖారి, ముస్లిమ్)

రయినా మృతుని పక్షాన అప్పు చెల్లించడానికి సన్నద్ధుడయినట్లయితే ఆయన అప్పుడు జనాజా నమాజ్ చేయించేవారు.[1] కాని తరువాతి కాలంలో ఆయన స్వయంగానే ఈ బాధ్యత తన మీద వేసుకున్నారు.

'అల్లాహ్ ఆయనకు విజయాల ద్వారాలు తెరచిపెట్టినప్పుడు' అనే పదాలను బట్టి అనాథలు అగత్యపరుల పోషణాభారం, నిరుపేద రుణ గ్రస్తుల రుణాల చెల్లింపు బాధ్యత ఇస్లామీయ రాజ్యంపైన మోపబడాలంటే అది ఆ స్థితిలో ఉండాలి. ఈ స్థితిలో ఉంటూ అది తన ఈ బాధ్యతను తన సాధనాల మేరకు పూర్తిగా లేదా వీలయినంత నిర్వర్తించలేకపోతే అది తన విధి నిర్వహణలో పరాజయం పొందింది, పాపభారం మోయవలసి వస్తుంది.[2]

## ప్రపంచం అసలు ఆశయం కారాదు

ఇస్లామ్ ధర్మబద్ధరీతిలో ఆర్థిక ప్రగతిపైన ఎటువంటి ఆంక్షలూ విధించలేదు. ఈ విషయంలో వ్యక్తికి రాజ్య సహాయం ప్రాప్తమవుతుంది. ఆర్థికంగా బలహీనులు, అనాథలు అయిన వ్యక్తులు వర్గాలకు అది సహాయపడుతుంది. దీనితోపాటు ఇస్లామ్ మరో విషయాన్ని మాటిమాటికీ గుర్తు చేస్తుంది. ప్రపంచమే అసలు జీవితాశయంగా మారరాదు. దీని పొందు, దీని పిపాస తపనగా మారి మనిషి దైవచింతనకు దూరమయి పోరాదు.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تُلْهِكُمْ أَمْوَٰلُكُمْ وَلَآ أَوْلَـٰدُكُمْ عَن ذِكْرِ ٱللَّهِ ۚ وَمَن يَفْعَلْ ذَٰلِكَ فَأُو۟لَـٰٓئِكَ هُمُ ٱلْخَـٰسِرُونَ ۝ (المنفقون:٩)

**విశ్వసించినవారలారా, మీ ధనసంపదలు, మీ సంతానం మిమ్మల్ని దైవ సంస్మరణ పట్ల ఏమరుపాటుకు గురిచేయరాదు; ఇలా చేసినవారే నిజానికి నష్టపోయేవారు.**

***(అల్ మునాఫికూన్ : 9)***

మానవుడు ప్రపంచదాసుడయిపోయి ధనసంపదలు ప్రోగు చేసుకోవడంలో నిమగ్నమయిపోతే పరలోకం అతని దృష్టికి అగుపించకుండాపోతుంది. ఇది మహా నష్టం. అందువల్లనే సంతుష్టిని ఉద్బోధించడంతోపాటు మనిషి తన అవసరాల పరిధిని పరిమితం చేసుకోవాలని, దాన్ని విస్తృతపరచరాదని ప్రేరేపించడం జరిగింది. హజ్రత్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

---

1. బుఖారి, కితాబుల్ కిఫాల, బాబుద్దీన్

2. ఇబ్ను హజర్, ఫత్‌హుల్ బారి : 5 - 245

ليس لابن آدم حق فى سوى هٰذه الخصال، بيت يسكنه و ثوب يوارى به عورته وجلف الخبز والماء[2]

**మానవునికి (ఇహలోకంలో) ఇంతే తప్ప మరే హక్కులేదు - నివసించడానికి ఇల్లు, తన ఆచ్ఛాదనీయ శరీరాన్ని మరుగుపరచ డానికి వస్త్రాలు, ఎండు రొట్టె, నీరు.**[1]

హజ్రత్ బురైదా అస్లమీ ఉల్లేఖనంలో పైన పేర్కొన జీవితావసరాలలో మరి కొన్ని అవసరాలను పెంచడం జరిగింది, అయితే దాని వెంటనే సంతృప్తి, సంతుష్టిని సయితం బోధించడం జరిగింది. ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారని అన్నారాయన:

يكفى احدكم من الدنيا خادم و مركب[1]

**మీలో ఎవరికయినా ఈ ప్రపంచంలో ఒక సేవకుడు (నౌకరు), ఒక వాహనం చాలు.**[2]

అబూ హాషిమ్ బిన్ ఉత్బైబా జీవితపు చివరి క్షణాల్లో విచారపడుతూ ఇలా అన్నారు, 'ప్రవక్తశ్రీ(స) నాకు చెప్పారు, "ఒక సమయం రానున్నది, నీ సమక్షంలో ధనం పంపిణీ అవుతుంది. నీ కొరకు వాటిలో ఒక సేవకుడు, ఒక వాహనం, నీకు దైవ మార్గంలో కృషి చెయ్యడానికి ఉపయోగపడేందుకు చాలు"అని. నేను ఆ కాలం చూశాను. చాలా సంపద ప్రోగు చేశాను. నేను ఆయన (స) తో చేసిన వాగ్దానం పైన నిలబడి ఉంటే ఎంత బావుండేది!'[3]

మనిషి తన భౌతికావసరాలకు అతీతుడు కాలేడు. ధర్మబద్ధ పరిధిలో వాటికై కృషి చెయ్యడాన్ని ఇస్లామ్ సరయినదిగానే పరిగణిస్తుంది. రాజ్య వ్యవస్థ అందులో మనిషికి సహాయపడాలని కూడా నిర్దేశిస్తుంది. కాని అది, మనిషి ప్రపంచదాసుడయి పోవడాన్ని. పరలోకాన్ని విస్మరించడాన్ని ఇష్టపడదు.



1. తిర్మిజీ; కితాబుజ్ జుహ్దా.
2. ముస్నద్ అహ్మద్ : 5 - 360; తిర్మిజీ : అబ్వాబుజ్ జుహ్దా.
3. తిర్మిజి: అబ్వాబుజ్ జుహ్దా; ఇబ్నుమాజ : కితాబుర్రికాక్.

# 4. సామాజిక హక్కులు

మానవుడు తాను నివసించే సమాజంలో జీవహీనంగా జీవితం గడపాలని కోరుకోడు. క్రియాశీలంగా, ప్రభావశీలంగా తన పాత్ర పోషించాలని అనుకుంటాడు. ఇది అతని సహజమయిన హక్కు. సమాజం ప్రగతి సాధించాలన్నా ఇది అవసరమే. ప్రతి వ్యక్తి తన సామర్థ్యాలు, శక్తులకనుగుణంగా కృషి చేసే అవకాశాలున్నప్పుడే అది సాధ్యం. అలాగే అతనికి కొన్ని నిర్దిష్ట హక్కులూ, అధికారాలూ కావలసి ఉంటుంది. ప్రపంచంలోని సకల ప్రజాస్వామిక చట్టాల్లో వ్యక్తిగత స్వేచ్ఛ (Personal Liberty) మానవుని ప్రాథమిక హక్కుగా గుర్తింపు పొందింది. అయితే ఎవరయినా తన ఈ హక్కును వినియోగించుకుని ఇతరుల హక్కులను కొల్లగొట్టే, వాటిని పరిహరించే అనుమతి అతనికి ఇవ్వడం జరగదు. అందువల్లనే అంటాడు -There can not be freedom to destroy freedom (స్వేచ్ఛ అనేది స్వేచ్ఛను వినాశపరచడానికి కాదు).

అలాగే జాతీయ, దేశీయ ప్రయోజనాలకు మనిషి వ్యక్తిగత ప్రయోజనాలపైన ఆధిక్యత ఉంది. ఏ వ్యక్తికీ, తన స్వేచ్ఛను వినియోగించు కుని దేశానికీ జాతికీ నష్టం కలిగించే హక్కు లేదు. వ్యక్తిగత స్వేచ్ఛకు విభిన్న కోణాలున్నాయి. ఇస్లామ్ వీటి నన్నింటినీ గౌరవించాలని బోధించింది, వాటి హద్దుల్నీ నిర్ణయించింది.

## ఆలోచనా స్వేచ్ఛ

పరమ ప్రభువు అల్లాహ్ మానవునికి బుద్ధీజ్ఞానాలిచ్చాడు. మానవుని ఓ ప్రత్యేక లక్షణం కూడా ఇదే. అతను ఆలోచించే అర్థం చేసుకునే సామర్థ్యం కలిగి ఉంటాడు. ఇస్లామ్ ఇతని ఈ సామర్థ్యం పెరగాలని ప్రగతి గడించాలని కోరుకుంటుంది. దాన్ని అణచడానికి, నొక్కివేయ డానికి చేసే ప్రయత్నాన్ని వ్యతిరేకిస్తుంది. అది మనిషిని మూఢ నమ్మకాల నుండి, మూర్ఖపు ఆచారాల నుండి వెలికితీసింది. అది మనిషిలో ఆలోచన, చింతన, పరిశీలన, పరిశోధనను ప్రేరేపించింది, ప్రోత్సహించింది. దాని

దృష్టిలో ఏ వ్యవహారంలోనయినా నిర్హేతుకమయిన వైఖరినవలంబించడం, నిరాధారంగా ఏ విషయానికయినా పట్టుపట్టడం మానవ ఔన్నత్యానికి విరుద్ధమయిన విషయం. గుడ్డిగా అనుసరించడాన్ని, ఆలోచనా రహితంగా తాతముత్తాతల విధానాలను పాటించడాన్ని, సంప్రదాయ బద్ధతను తీవ్రంగా విమర్శించింది. ఇస్లామ్ దీన్ని జాతుల అతి ప్రాచీన రోగంగా వర్ణిస్తుంది. ఈ కారణంగానే అవి నాశనమయ్యాయని అంటుంది.

اَمْ اٰتَيْنٰهُمْ كِتٰباً مِّنْ قَبْلِهٖ فَهُمْ بِهٖ مُسْتَمْسِكُوْنَ ○ بَلْ قَالُوْآ اِنَّا وَجَدْنَآ اٰبَآءَ نَا عَلٰٓى اُمَّةٍ وَّ اِنَّا عَلٰٓى اٰثٰرِهِمْ مُّهْتَدُوْنَ ○ وَ كَذٰلِكَ مَآ اَرْسَلْنَا مِنْ قَبْلِكَ فِىْ قَرْيَةٍ مِّنْ نَّذِيْرٍ اِلَّا قَالَ مُتْرَفُوْهَآ اِنَّا وَجَدْنَآ اٰبَآءَ نَا عَلٰٓى اُمَّةٍ وَّ اِنَّا عَلٰٓى اٰثٰرِهِمْ مُّقْتَدُوْنَ ○ قٰلَ اَوَلَوْ جِئْتُكُمْ بِاَهْدٰى مِمَّا وَجَدْتُّمْ عَلَيْهِ اٰبَاءَ كُمْ قَالُوْآ اِنَّا بِمَآ اُرْسِلْتُمْ بِهٖ كٰفِرُوْنَ ○ فَانْتَقَمْنَا مِنْهُمْ فَانْظُرْ كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُكَذِّبِيْنَ ○ (الزخرف:٢١-٢٥)

లోగడ మేము వీరికి ఏదయినా గ్రంథం ఇచ్చామా? వారు దాన్ని గట్టిగా పట్టుకుని అనుసరిస్తున్నారా? అది కాదు, 'మేము మా తాత ముత్తాతలను ఒక విధానాన్ని అనుసరిస్తూ ఉండగా చూశాము. మేము వారి అడుగుజాడల్లోనే మార్గనిర్దేశన పొంది నడుస్తున్నాము' అని అంటారు. అలాగే మీకు పూర్వం మేము ఏ జనావాసంలో హెచ్చరించేవానిని పంపినా అందులోని సంపన్న వర్గాలు ఇదే అన్నారు, 'మేము మా తండ్రీతాతల్ని ఓ విధానాన్ని అనుసరిస్తూ ఉండగా చూశాము. మేము వారి అడుగుజాడలలోనే నడుస్తు న్నాము.' మీరు మీ తండ్రీతాతలు నడవగా చూసిన విధానంకన్నా అధిక సన్మార్గ నిర్దేశనను నేను మీకు అందజేసినా మీరు దాన్ని స్వీకరించరా? అని ప్రవక్త ప్రశ్నించగా వారు ఇలా సమాధానం ఇచ్చారు, నీవు తీసుకువచ్చిన ధర్మాన్ని మేము నమ్మే వారము కాము. ఆపైన మేము ప్రతీకారం తీర్చుకున్నాము. చూసుకోండి అబద్ధీకరించే వారి అంతిమ పరిణామం ఏమయిందో. ***(అజ్ జుఖ్రుఫ్ : 21-25)***

ఇస్లామ్ ప్రతి విషయాన్ని ఆధారాలతో అర్థం చేసుకునే ఆసక్తిని పెంచుతుంది. ఇస్లామ్ దాని విరోధులు అవగాహనను, జ్ఞానాన్ని వినియోగించరని నిందిస్తుంది, అది అందజేసే ఆధారాలను గురించి పరిశీలించరని అంటుంది.

وَلَقَدْ ذَرَاْنَا لِجَهَنَّمَ كَثِيْرًا مِّنَ الْجِنِّ وَالْاِنْسِ ۖ لَهُمْ قُلُوْبٌ لَّا يَفْقَهُوْنَ بِهَا ۡ وَلَهُمْ اَعْيُنٌ لَّا يُبْصِرُوْنَ بِهَا ۡ وَلَهُمْ اٰذَانٌ لَّا يَسْمَعُوْنَ بِهَا ؕ اُولٰٓئِكَ كَالْاَنْعَامِ بَلْ هُمْ اَضَلُّ ؕ اُولٰٓئِكَ هُمُ الْغٰفِلُوْنَ ۝ (الاعراف:١٧٩)

**మేము జిన్నుల్లోనూ మనుషుల్లోనూ చాలా మందిని నరకం కొరకే పుట్టిం చాము. వారికి మనస్సులున్నాయి కాని వారు వాటి ద్వారా ఆలోచించరు, అర్థం చేసు కోరు; వారికి కన్నులున్నాయి కాని వాటి ద్వారా వారు చూడరు; వారికి చెవు లున్నాయి కాని వాటి ద్వారా వినరు. వీరు జంతువుల్లాంటివారు, వారికన్నా మరీ మార్గవిహీనులు. వీరే ఏమరుపాటుకు లోనయిన జనం.** ***(అల్ ఆరాఫ్ : 179)***

ఇస్లామ్ ఆలోచన చింతనల పట్ల నొక్కిచెప్పడంతోపాటు మానవ బుద్ధి పరిమితిని సయితం విశదపరచింది. ఇంకా చింతనకు పరిశీలనకు సరయిన ప్రాతి పదికలు అందజేసింది. మనిషి బుద్ధినుపయోగించి రుజుమార్గాన్ని కనుగొనగలగాలి అని అంటుంది.

## ఆచరణా స్వేచ్ఛ

అల్లాహ్ మనిషిని అశక్తునిగా సృజించలేదు. ఆచరణా స్వేచ్ఛనిచ్చి మరీ పంపాడు. మనిషి తన ఇష్టం ప్రకారం ఏ చర్యనయినా తీసుకోగలడు. అయితే ఈ స్వేచ్ఛను నిర్నిబంధంగా వినియోగించడం వినాశకరం. అందువల్ల అతనిపైన ఏదో విధమయిన నిర్బంధం విధించడం అవసరం. ఇస్లామ్ మానవునికి ఆచరణా స్వేచ్ఛను ఇచ్చింది. అయితే సమాజానికి హాని కలిగించే, భువిలో కల్లోలాన్ని సృష్టించే ఏ చర్యలనూ అది అనుమతించదు. దైవప్రవక్తలు ప్రపంచంలో ప్రభవించడంలో ఓ ప్రత్యేక లక్ష్యమూ ఉందంది. దేవుని భూమిలో కల్లోలం, కలత, చెడుగు ముగియా లన్నది, మానవాళికి శాంతి సుఖాలు సంప్రాప్తం కావాలన్నది.

అద్‌యన్ జాతిలో హజ్రత్ షుఅయ్‌బ్ ప్రభవించారు. ఆయన దేవుని ఏకత్వపు సందేశం అందజేయడంతోపాటు భువిలో కల్లోల వైఖరిని మానుకోవాలని ఉపదేశిస్తారు. ఆయన ఇలా అంటారు:

يٰقَوْمِ اعْبُدُوا اللّٰهَ مَا لَكُمْ مِنْ اِلٰهٍ غَيْرُهٗ ۭ قَدْ جَآءَتْكُمْ بَيِّنَةٌ مِّنْ رَّبِّكُمْ فَاَوْفُوا الْكَيْلَ وَالْمِيْزَانَ وَلَا تَبْخَسُوا النَّاسَ اَشْيَآءَهُمْ وَلَا تُفْسِدُوْا فِى الْاَرْضِ بَعْدَ اِصْلَاحِهَا ۭ ذٰلِكُمْ خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ مُّؤْمِنِيْنَ ۝ وَلَا تَقْعُدُوْا بِكُلِّ صِرَاطٍ تُوْعِدُوْنَ وَتَصُدُّوْنَ عَنْ سَبِيْلِ اللّٰهِ مَنْ اٰمَنَ بِهٖ وَتَبْغُوْنَهَا عِوَجًا ۚ وَاذْكُرُوْٓا اِذْ كُنْتُمْ قَلِيْلًا فَكَثَّرَكُمْ ۠ وَانْظُرُوْا كَيْفَ كَانَ عَاقِبَةُ الْمُفْسِدِيْنَ ۝

(الاعراف:۸۵-۸۶)

నా జాతి ప్రజలారా, అల్లాహ్ ఆరాధన చెయ్యండి; ఆయన తప్ప మీకు మరో ఆరాధ్యుడు లేడు. కొలతలు తూనికలూ సరిగ్గా పాటించండి. జనులకు వారి వస్తువులు తక్కువగా ఇవ్వకండి. భువిలో (అల్లాహ్ దాసులు) సంస్కరణ జరిపిన తరువాత కల్లోలం సృష్టించకండి. ఇదే మీ విషయంలో మేలయినది, మీరు విశ్వాసం గలవారే అయినట్లయితే. రహదారుల్లో కూచొని జనుల్ని భయ పెట్టడం, బెదరించడం చెయ్యకండి; ఇంకా విశ్వసించిన వారిని దైవధర్మం నుండి వారించకండి, లేదా ధర్మంలో లోపాలు వెదకకండి. కాస్త గుర్తు చేసుకోండి, మీరు కొద్దిమందే ఉండగా అల్లాహ్ మీ జన సమర్థతను పెంచాడు. కాస్త యోచించండి, కల్లోల జనకుల గతి లోగడ ఎలా పరిణమించిందో. *(అల్ ఆరాఫ్ : 85, 86)*

సమూద్ జాతి సంపన్నమయిన జాతి, నాగరికత రీత్యా ఆ సమయాన వృద్ధి చెందిన జాతిగా పరిగణించబడేది. కాని దాని నాయకులు కల్లోల పూర్వక మయిన దారిని అవలంబించారు. సాలిహ్ (అ) ఆ దారి తప్పిన నాయకత్వానికి వ్యతిరేకంగా తన గళం విప్పారు. జాతిని ఉద్దేశించి ఇలా పిలుపునిచ్చారు:

وَلَا تُطِيْعُوْٓا اَمْرَ الْمُسْرِفِيْنَ ۝ الَّذِيْنَ يُفْسِدُوْنَ فِى الْاَرْضِ وَلَا يُصْلِحُوْنَ ۝ (الشعراء:۱۵۱-۱۵۲)

అవధులు మీరినవారిని అనుసరించకండి, వారు భువిలో కల్లోలం సృష్టిస్తు న్నారు, సంస్కరణ జరిపేవారు కారు. *(అష్ షుఅరా : 151, 152)*

మదీనాలో ఏర్పడిన ఇస్లామీయ రాజ్యం శుభశ్రేయాలకు, న్యాయం సంతులనాలకు కేంద్రమయింది. అది ప్రపంచానికే అత్యున్నత ఆదర్శం. కాని కపటులు దాన్ని తమ కల్లోలపూర్వకమయిన చేష్టల ద్వారా నష్టపరచ డానికి ప్రయత్నాలు చేసేవారు.

దివ్యఖుర్ఆన్ పలు సందర్భాలలో దీన్ని బహిర్గతపరచింది. ఒకచోట ఇలా అన్నది:

**وَ اِذَا قِيۡلَ لَهُمۡ لَا تُفۡسِدُوۡا فِى الۡاَرۡضِ قَالُوۡۤا اِنَّمَا نَحۡنُ مُصۡلِحُوۡنَ○ اَلَاۤ اِنَّهُمۡ هُمُ الۡمُفۡسِدُوۡنَ وَلٰـكِنۡ لَّا يَشۡعُرُوۡنَ○ (البقرة:١١-١٢)**

**భువిలో కల్లోలం సృష్టించకండి అని వారికి చెప్పినప్పుడు మేమయితే సంస్కరణ చేసేవారమే అని అంటారు. జాగ్రత్త వీరే కల్లోల జనకులు, కాని అర్థం చేసుకోరు.**
***(అల్ బకర : 11, 12)***

కృషి ప్రయత్నం, ఆచరణ క్రియాశీలత మానవుని ప్రకృతిసిద్ధ మయిన హక్కు. ఇస్లామ్ దీనిపైన అవధులు నిర్ధారించదు. అది కేవలం సమాజాన్ని కల్లోలం వైపునకు విచ్ఛిన్నం వైపునకు, తోడుకుపోయే ప్రయత్నాలనే వ్యతిరేకిస్తుంది. అలా చెయ్యకపోతే ఆ ప్రయత్నాలు సమాజాన్ని సర్వవినాశం దాపున చేర్చివేస్తాయి.

## అభిప్రాయ ప్రకటనా స్వేచ్ఛ

నేటి ప్రజాస్వామిక యుగంలో అభిప్రాయ ప్రకటనా స్వేచ్ఛను మానవుని ప్రాథమిక హక్కుల్లో ఒకటిగా గుర్తించడం జరుగుతోంది. ప్రతి వ్యక్తికి తన భావాలను, భావనలను వ్యక్తం చేసుకునే అవకాశం ప్రాప్తం కావాలని నొక్కి చెప్పడం జరుగు తోంది. ఆ అభిప్రాయాలను ఇతరులు అంగీకరించడానికయినా తిరస్కరించ డాని కయినా స్వేచ్ఛ కలిగి ఉంటారు. అయితే ఈ అభిప్రాయ ప్రకటనా స్వేచ్ఛను హద్దు పద్దు లేకుండా వినియోగించడం సమాజానికి హానికరంగా కూడా పరిణమించే ప్రమాదముంది. అందువల్ల దీనిపైన కొన్ని ఆంక్షలు పెట్టడం అవసరం.

మానవుని నోటికి తాళం వేయకుండా తన అభిప్రాయ ప్రకటనకు అతనికి స్వేచ్ఛనివ్వడం ఇస్లామ్ దృష్టిలో మానవుని హక్కు. అయితే ఇస్లామ్ అతని కొన్ని పరిమితులకు కట్టుబడి ఉండేలా కూడా చేసింది. ఈ పరిమితులు వ్యక్తికీ, సమాజానికీ ప్రయోజనకరమయినవని, సమంజస మయినవని అంగీకరించక తప్పదు. ఇస్లామ్ నిర్ణయించిన ఆ పరిమితు లలో కొన్ని ఇవి :

1. అభిప్రాయ ప్రకటనలో మనిషి నైతిక నియమాలకు కట్టుబడి ఉండాలి, ఇతరుల ఆత్మాభిమానాన్ని గౌరవించాలి, ఇతరుల్ని అప్రదిష్ట పాలు చెయ్యడానికి, నలుగురిలో నగుబాటుకు గురిచెయ్యడానికి ప్రయత్నించరాదు. అబద్ధం పలకడం,

నిందలు మోపడం, ఎత్తిపొడుపుగా మాటలాడటం, తూలనాడటం, దుర్భాషలాడటం, పరోక్షనిందలకు పాల్పడటం వంటి నైతికమయిన చెడుగులకు దూరంగా మెలగాలి. దైవ వచనం గమనించండి:

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا يَسْخَرْ قَوْمٌ مِّنْ قَوْمٍ عَسٰۤى اَنْ يَّكُوْنُوْا خَيْرًا مِّنْهُمْ وَلَا نِسَآءٌ مِّنْ نِّسَآءٍ عَسٰۤى اَنْ يَّكُنَّ خَيْرًا مِّنْهُنَّ ۚ وَلَا تَلْمِزُوْۤا اَنْفُسَكُمْ وَلَا تَنَابَزُوْا بِالْاَلْقَابِ ؕ بِئْسَ الِاسْمُ الْفُسُوْقُ بَعْدَ الْاِيْمَانِ ۚ وَمَنْ لَّمْ يَتُبْ فَاُولٰٓئِكَ هُمُ الظّٰلِمُوْنَ ○ يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اجْتَنِبُوْا كَثِيْرًا مِّنَ الظَّنِّ ۫ اِنَّ بَعْضَ الظَّنِّ اِثْمٌ وَّلَا تَجَسَّسُوْا وَلَا يَغْتَبْ بَّعْضُكُمْ بَعْضًا ؕ اَيُحِبُّ اَحَدُكُمْ اَنْ يَّاْكُلَ لَحْمَ اَخِيْهِ مَيْتًا فَكَرِهْتُمُوْهُ ؕ وَاتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ تَوَّابٌ رَّحِيْمٌ ○ (الحجرات:١١-١٢)

విశ్వసించినవారలారా, పురుషులు ఇతర పురుషులను పరిహసించరాదు, వారు వీరికన్నా ఉత్తమమయినవారు కావడం సాధ్యమే. అలాగే స్త్రీలూ ఇతర స్త్రీలను పరిహసించరాదు, వారు వీరికన్నా ఉత్తమ మయిన వారు కావడం సంభవమే. ఒకరిపై నొకరు ఎత్తి పొడుపుగా మాట లాడరాదు, చెడ్డ పేర్లతోనూ పిలుచుకో రాదు. విశ్వాసం గ్రహించిన తరువాత పాపపు పేర్లు తగలడం మహా చెడ్డది. ఎవరయితే పశ్చాత్తాప్పడి (ఈ చెడుగుల నుండి దూరంగా) మెలగరో వారే అత్యా చారులు. విశ్వసించినవారలారా, అత్యధి కంగా అనుమానించడాన్ని తప్పించు కోండి; కొన్ని అనుమానాలు పాలవు తాయి. ఇంకా వెంటపడి శోధనాన్వేషణకు పాల్పడకండి, ఒండొకరి పరోక్షనింద కూడా చెయ్యకండి. మీలో ఎవరయినా తన మృతసోదరుని మాంసం భుజించ డానికి ఇష్టపడతాడా? మీరు దీనిపట్ల జుగుప్సపడతారు. అల్లాహ్‌కు భయ పడుతూ ఉండండి; నిస్సంకోచంగా అల్లాహ్ పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు, కనికరించేవాడూను.

***(అల్ హుజురాత్ : 11-12)***

ఇది ఇస్లామీయ నైతిక బోధనలకు ఒక నమూనా. ఇటువంటి నైతిక ప్రబోధాలు ఖుర్ఆన్, హదీసు గ్రంథాల్లో మరెన్నో ఉన్నాయి. వాటికి అవసరం మేరకు చట్టరూపం ఇవ్వడం కూడా సాధ్యమే.

2. అభిప్రాయ ప్రకటన పేరిట అశ్లీలత, నిర్లజ్జత, అశుద్ధ చేష్టల ప్రచార ప్రసరణలనూ అనుమతించడం జరగదు. ఒక సమాజం నైతికతకు, సంస్కారానికి, సౌజన్యతకు కట్టుబడి ఉంటూ అది ఎటువంటి పరిస్థితుల్లోనూ అనైతికతను బోధించడాన్ని, ప్రచారం చెయ్యడాన్ని అనుమతించజాలదు. ఇటువంటి ప్రతి ప్రయత్నాన్నీ అది గట్టిగా ప్రతిఘటిస్తుంది.

إِنَّ الَّذِينَ يُحِبُّونَ أَن تَشِيعَ الْفَاحِشَةُ فِي الَّذِينَ آمَنُوا لَهُمْ عَذَابٌ أَلِيمٌ فِي الدُّنْيَا وَالْآخِرَةِ وَاللَّهُ يَعْلَمُ وَأَنتُمْ لَا تَعْلَمُونَ ○ (النور:١٩)

**ఎవరయితే విశ్వసించినవారి మధ్యన చెడు నడతల ప్రచారం జరగాలని కోరుకుంటారో నిస్సందేహంగా వారికి ప్రపంచంలోనూ పరలోకంలోనూ ఆవేదనాభరితమయిన శిక్షా యాతన పడుతుంది. అల్లాహ్‌కు బాగా తెలుసు.**

***(అన్ నూర్ : 19)***

3. రాజ్యంలో కలతను, కల్లోలాన్నీ సృజించడానికి, అశాంతిని రేపడానికి దేశ ప్రయోజనాలకు విఘాతాన్ని కలిగించి ప్రమాదం తెచ్చిపెట్టడానికి అనుమతించడం జరగదు.

కపటులు, యూదులు అనునిత్యం ఇస్లామీయ సామ్రాజ్యానికి వ్యతి రేకంగా కార్యకలాపాల్లో నిమగ్నులయి ఉండేవారు. వారి కార్యక్రమంలో ఒకటి, ముస్లిముల మధ్య తప్పుడు వదంతులు వ్యాపింపజెయ్యడం, యుద్ధ సందర్భంలో ముస్లిముల పరాజయం పట్ల భవిష్యవాణి వినిపించడం; ఎప్పుడయినా ఏదయినా తాత్కాలిక అపజయం కలిగితే దాన్ని పెంచి, ఇక దానికి విరుగుడు లేనే లేదన్నట్టు ప్రచారం చెయ్యడం, ఇలా ముస్లిముల్లో ధైర్యసాహసాలు సడలి వారు తమ సంకల్పబలాన్ని కోల్పోవాలన్నది వారి అభిమతం. ఇది రాజ్య రక్షణకు, సుస్థిరతకు సంబంధించిన విషయం. అందువల్ల వారికి ఎదురుగా కఠిన చర్య తీసుకోవడం అవసరమని బోధించడం జరిగింది.

لَئِنْ لَّمْ يَنْتَهِ الْمُنٰفِقُوْنَ وَالَّذِيْنَ فِىْ قُلُوْبِهِمْ مَّرَضٌ وَّالْمُرْجِفُوْنَ فِى الْمَدِيْنَةِ لَنُغْرِيَنَّكَ بِهِمْ ثُمَّ لَا يُجَاوِرُوْنَكَ فِيْهَا اِلَّا قَلِيْلًاۚ مَلْعُوْنِيْنَۚ اَيْنَمَا ثُقِفُوْۤا اُخِذُوْا وَ قُتِّلُوْا تَقْتِيْلًا سُنَّةَ اللّٰهِ فِى الَّذِيْنَ خَلَوْا مِنْ قَبْلُۚ وَلَنْ تَجِدَ لِسُنَّةِ اللّٰهِ تَبْدِيْلًا (الاحزاب:٦٠-٦١)

ఒకవేళ కపటులు, హృదయాలు రోగగ్రస్తులయిన వారు, మదీనా పుణ్యపురిలో అబద్ధపు సమాచారాన్ని వ్యాపింపజేసేవారు (తమ దుశ్చేష్టలను)మానుకోకపోతే మేము తప్పక మీకు వారిపైన అధీనతను ప్రసాదిస్తాము. ఆపైన వారు మదీనాలో మీకు చేరువగా కొన్నాళ్ళకన్నా అధికంగా నిలువజాలరు. దేవుని అభిశాపం వారి పైన, వారు ఎక్కడికి వెళ్ళినా పట్టుకోబడ తారు. మా చెడ్డగా హతమార్చబడతారు. దీనికి పూర్వం గతించినవారి విషయంలో అల్లాహ్ విధానం ఇదే: నీవు ఈ విధానంలో ఎటువంటి మార్పును గ్రహించవు. *(అల్ అహ్జాబ్ : 60, 61)*

ఈ హెచ్చరిక, బోధనల తరువాత మునాఫికుల (ద్వంద్వ స్వభావుల) సంకల్పాలు అణగిపోయాయి, రాజ్యానికి హాని కలిగించడం వారికి సులువుగా మిగల్లేదు. కాని యూదుల కుట్రలు పన్నాగాలు కొనసాగుతూనే ఉండేవి. వారికి ప్రతిగా చర్య గైకొనడం జరిగింది. కడకు వారు దేశబహిష్కరణకు లోనయ్యారు.

## కుటుంబం నెలకొలుపుకునే హక్కు

మానవునికి కుటుంబ జీవితం గడిపే హక్కు ఉంది. కుటుంబం అతనికి ఒక సహజమయిన సామాజిక అవసరం. నాగరిక ప్రపంచం ఈ హక్కును అంగీకరిస్తుంది. కుటుంబం పునాదులు దాంపత్య సంబంధాలపైన ఆధారభూతమయి ఉన్నాయి. ఇస్లామ్‌లో ఈ సంబంధం జీవితంలో ప్రశాంతతకు, మావన జాతి మనుగడకు దాని కొనసాగింపు నకు ధర్మబద్ధమయిన విధానంగా నిర్ణయించింది. దీని ద్వారా ఉనికిలోకి వచ్చే బంధుత్వాలను, సంబంధాలను గౌరవించాలని ఆదేశించింది.

يٰۤاَيُّهَا النَّاسُ اتَّقُوْا رَبَّكُمُ الَّذِىْ خَلَقَكُمْ مِّنْ نَّفْسٍ وَّاحِدَةٍ وَّ خَلَقَ

మానవులారా, మీ ప్రభువు పట్ల భయం కలిగి మెలగండి. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణితో పుట్టించాడు. ఆ ప్రాణి ద్వారానే

مِنۡهَا زَوۡجَهَا وَ بَثَّ مِنۡهُمَا رِجَالًا كَثِيۡرًا وَّ نِسَآءً‌ ۚ وَاتَّقُوا اللّٰهَ الَّذِىۡ تَسَآءَلُوۡنَ بِهٖ وَالۡاَرۡحَامَ‌ ؕ اِنَّ اللّٰهَ كَانَ عَلَيۡكُمۡ رَقِيۡبًا‏ ○ (النساء:۱)

**మీ జతను సృష్టించాడు. ఆ ఇరువురి ద్వారా అనేక మంది స్త్రీ పురుషులను వ్యాపింపజేశాడు. అల్లాహ్‌కు భయపడండి, ఆయన పేరు చెప్పుకుని మీరు పరస్పరం ప్రశ్నించుకుంటారు. ఇంకా రక్తసంబంధాలను భంగపరచడానికి దూరంగా మెలగండి. నిస్సందేహంగా అల్లాహ్ మిమ్మల్ని కనిపెట్టుకుని ఉన్నాడు.** ***(అన్ నిసా : 1)***

ఇస్లామ్ కుటుంబాన్ని అనవసరమయిన భారంగా మనిషి దాన్ని మోయడానికి ఇష్టపడనిదిగా పరిగణించదు. దాని దృష్టిలో అల్లాహ్ అనుగ్రహాలలో మహా వరప్రసాదం. ఈ ఆయత్‌లో ఇదే విషయాన్ని తెలుపడం జరిగింది:

وَ اللّٰهُ جَعَلَ لَكُمۡ مِّنۡ اَنۡفُسِكُمۡ اَزۡوَاجًا وَّ جَعَلَ لَـكُمۡ مِّنۡ اَزۡوَاجِكُمۡ بَنِيۡنَ وَ حَفَدَةً وَّ رَزَقَكُمۡ مِّنَ الطَّيِّبٰتِ‌ ؕ اَفَبِالۡبَاطِلِ يُؤۡمِنُوۡنَ وَ بِنِعۡمَتِ اللّٰهِ هُمۡ يَكۡفُرُوۡنَ ۙ‏ ○ (النحل:۷۲)

**అల్లాహ్ మీ కొరకు మీ స్వయంలోనుంచే మీ జతల్ని సృజించాడు. మీ జతల ద్వారా మీకు కొడుకులు, మనుమళ్ళు ప్రసాదించాడు. తినడానికి పరిశుద్ధమయిన పదార్థాలను అనుగ్రహించాడు. అయితే ఆ తరువాత కూడా వారు మిథ్యనే విశ్వసిస్తారా; అల్లాహ్ చేసిన మహోపకారాన్ని విస్మరిస్తారా?** ***(అన్ నహ్ల్ : 72)***

ఇస్లామ్ ఒక పరిపూర్ణ కుటుంబ వ్యవస్థను ప్రసాదించింది. అందులో భార్యాభర్తలు, తల్లిదండ్రులు, సంతానం ఇంకా ఇతర సంబంధీకుల హక్కులు, బాధ్యతలు నిర్ణయమయి ఉన్నాయి. దీనితోపాటు ఇందులో పిన్నల ఎడల ప్రేమ, వాత్సల్యం, పెద్దల ఎడల గౌరవాదరణ భావాలు కలిగి ఉండాలన్న బోధనలున్నాయి. అది సమాజంలోని ప్రతి వ్యక్తికి, ఈ వ్యవస్థను కాపాడాలని, దాన్ని రక్షించేందుకు అన్ని విధాలా ప్రయత్నించాలని, దానికి ఎటువంటి హాని కలగకుండా చూడాలని తాకీదు చేస్తుంది.[1]

---

*1. ఈ సందర్భంలో రచయిత వ్రాసిన ఈ పుస్తకాలను సంప్రదించడం సమంజసంగా ఉంటుంది: 'స్త్రీ ఇస్లామీయ సమాజంలో', 'స్త్రీ,ఇస్లామ్', ముస్లిమ్ స్త్రీల హక్కులు, వాటిపైన అభ్యంతరాలు' (ఈ పుస్తకాలు ఉర్దూలో లభ్యమవుతాయి).*

## వైయక్తిక జీవితంలో జోక్యం

మానవుని వైయక్తిక జీవితంలో అతనికి స్వేచ్ఛ ప్రాప్తమయి ఉండాలన్న హక్కు సర్వాంగీకృతమే, అందులో బయటి వారి జోక్యం ఏ విధంగానూ ఉండరాదన్నదీ అంగీకృతమయిన విషయమే. ఇస్లామ్ దీన్ని ధర్మసమ్మతమయిన హక్కుగా పరిగణిస్తుంది. ఒక వ్యక్తి తన ఇంటిలోనూ, ఏకాంతంగానూ చేస్తున్నదేమిటో దాన్ని పరిశోధించే పరిశీలించే అధికారం ఎవరికీ ఉండరాదని అది తాకీదు చేస్తుంది. అతను ఒకవేళ తప్పుడు పని చేస్తున్నట్లయితే అది అతని వైయక్తిక విషయం. దానికి అతను అల్లాహ్ సమక్షంలో జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. అయితే ఒకవేళ అతను బహిరంగంగా ఏదయినా అపరాధం చేస్తున్నట్లు తెలిసినా లేదా అతని ఆ చేష్ట వల్ల మరే వ్యక్తికయినా లేదా సమాజానికయినా ఏదయినా కీడు జరుగుతున్నట్లయితే అతను తప్పక చట్టానికి పట్టుబడతాడు. ఈ సందర్భంలో ఇస్లామ్ సూత్రప్రాయమయిన మార్గనిర్దేశన చేసింది. ఏ వ్యక్తి విషయంలోనయినా తొలి మెట్టుగానే కేవలం అను మానం, ఊహల ఆధారంగా తప్పు చేస్తున్నట్లు, అపరాధి అయినట్లు నిర్ణయించరాదు, అతను చెడు నడతగలవాడని, దుష్టస్వభావి అని, అతని ద్వారా ఏదయినా మేలు జరిగే ఆశ లేదని భావించరాదు. అతని పట్ల సదభిప్రాయం కలిగి ఉండాలి; తప్పుడు అనుమానాలకు పాల్పడరాదు. అనేక అనుమానాలు నిరాధారమయినవిగా రుజువవుతాయి. వీటికి పాల్పడి మనిషి పాపంలో ఇరుక్కుపోతాడు.

రెండవ విషయం, గుచ్చి గుచ్చి అన్వేషించరాదని కూడా బోధించడం జరిగింది.

يَـٰٓأَيُّهَا الَّذِينَ اٰمَنُوا اجْتَنِبُوا كَثِيرًا مِّنَ الظَّنِّ اِنَّ بَعْضَ الظَّنِّ اِثْمٌ وَّلَا تَجَسَّسُوا... (الحجرات:١٢)

**విశ్వసించినవారలారా, బహుధా అనుమానాలకు పాల్పడకండి, నిస్సంకోచంగా కొన్ని అనుమానాలు పాపపూర్వకమయినవి. ఇతరుల లోటుపాట్లను అన్వేషిస్తూ తిరక్కండి...** ***(అల్ హుజురాత్ : 12)***

దురనుమానాలు, లోటుపాట్ల అన్వేషణ అన్నది మనిషి వ్యక్తిగత, వైయక్తిక జీవితంతో గట్టిగా ముడివడి ఉంటుంది. ఒక వ్యక్తి సామూహిక, సామాజిక జీవితంలో నిజాయితీ పరుడయినట్లయితే అతని గురించి అనవసరంగా దురనుమానాలకు పాల్పడటం, అతను ఏకాంతంలో తప్పనిసరిగా పాపాతురుడయి ఉంటాడని ఆరా తీయడం

తప్పు. ఇంకా అతన్ని అపరాధిగా నిరూపించడానికి అతని గోప్యమయిన వ్యవహారాల పరిశోధనకు ఏ విధంగానూ అనుమతి లేదు.

అయితే ఒక ప్రశ్న. ఒకరి సంస్కరణ కొరకు అతని వైయక్తిక పరిస్థితుల అన్వేషణ, వాటిని తెలుసుకునే రహస్య ప్రయత్నం కూడా తప్పేనా? దీనికి సమాధానం ఏమిటంటే, కేవలం అన్వేషణల వల్ల సంస్కరణ జరగదు. దీని వల్ల చెడుగు మరింతగా వ్యాపించే ప్రమాదమే అధికం. ఒక వ్యక్తికి, తాను చాటుమాటుగా చేస్తున్న నేరం ఇప్పుడు నలుగురిలో బట్టబయలయిపోయిందన్న విషయం తెలిసిపోతే అతనిలోని సిగ్గుబిడియం, జంకు అంతమయిపోతాయి. అతను తన చెడు నడతలో మరీ సాహస వంతుడయిపోతాడు. ఒక హదీసులో ఈ మానసిక వాస్తవాన్నే ఇలా సెలవీయటం జరిగింది. మహనీయ ముఆవియ (ర) ఉల్లేఖించిన దాని ప్రకారం, ఆయన దైవప్రవక్త (స) ఇలా సెలవీయగా విన్నారు:

انک اذا اتبعت عورات الناس افسدتهم[1]

**మీరు జనుల గోప్యమయిన లోపాల వెంట పడినట్లయితే వారిని మరింతగా తప్పు దోవలో పడవేస్తారు.**[1]

ఇదే మాటను రాజ్యాధినేతకూ బోధించడం జరిగింది. హజ్రత్ అబూ ఉమామ (ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

ان الامیر اذا ابتغی الریبة فی الناس افسدهم[2]

**నిస్సందేహంగా అధినేత, జనుల్లో అనుమానాలను రేకెత్తించే విషయాలను అన్వేషించడం మొదలిడితే, అతను వారిని చెడుగుకు గురిచేస్తాడు.**[2]

దీని భావమేమిటంటే, రాజ్యం మనిషి వైయక్తిక జీవితాన్నీ అన్వేషించడం మొదలిడితే, మనిషి ఏకాంత కుహరాలకూ కాపలా కాసినట్లయితే, అతని సంస్కరణ అంటూ జరగదు. మనిషి ఇంటిలోనూ స్వేచ్ఛకు నోచుకోకపోతే, అతని వెంట అపరాధ పరిశోధకుల్ని నియమించి వారి ద్వారా అతన్ని వెంటాడినట్లయితే అతనిలో తప్పని సరిగా దానికి ప్రతి చర్య జనిస్తుంది. అతను తప్పు దారిన నడిచేవాడే అయినట్లయితే తన పాపాలకు సరికొత్త మార్గాలను అన్వేషించడం మొదలెడతాడు.

---

*1. మిష్కాతుల్ మాసాబీహ్; కితాబుల్ ఇమరహ్ వల్ కజా.*

*2. ముస్నద్ అహ్మద్ : 6 / 4; అబూ దావూద్ : కితాబుల్ అదబ్.*

## ఒకరి ఇంట అనుమతి లేకుండా ప్రవేశించడం

ఇల్లు అన్నది మనిషి ఏకాంతంగా, చాటుగా (Privacy) గడిపే చోటు. అందులో జంకు లేకుండా జొరబడటం అతని ఈ ఏకాంతవాసంలో జోక్యమే. ఒకరి ఇంట ప్రవేశించే విధానం కూడా తెలుపడం జరిగింది. మనిషి ఇంటి గడప ముందర నిలబడి 'సలామ్' చెయ్యాలి. ఇంటి యజమాని అనుమతి లభిస్తే ప్రవేశించాలి. అనుమతి లేకపోతే తిరిగి వెళ్ళిపోవాలి. దానికి అయిష్టత కూడా కలగరాదు.

**يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لَا تَدْخُلُوْا بُيُوْتًا غَيْرَ بُيُوْتِكُمْ حَتّٰى تَسْتَاْنِسُوْا وَ تُسَلِّمُوْا عَلٰۤى اَهْلِهَا ؕ ذٰلِكُمْ خَيْرٌ لَّكُمْ لَعَلَّكُمْ تَذَكَّرُوْنَ ○ فَاِنْ لَّمْ تَجِدُوْا فِيْهَاۤ اَحَدًا فَلَا تَدْخُلُوْهَا حَتّٰى يُؤْذَنَ لَكُمْ ۚ وَ اِنْ قِيْلَ لَكُمُ ارْجِعُوْا فَارْجِعُوْا هُوَ اَزْكٰى لَكُمْ ؕ وَاللّٰهُ بِمَا تَعْمَلُوْنَ عَلِيْمٌ ○**

**(النور:٢٧-٢٨)**

**విశ్వసించిన జనులారా, మీ ఇండ్లల్లో తప్ప ఇతరుల ఇండ్లల్లోకి, వారితో మిమ్మల్ని మీరు (మచ్చిక) పరిచయం చేసుకోనంత వరకు, ఇంటి వారికి సలామ్ చేసుకోనంత వరకు ప్రవేశించకండి. ఇది మీకే శుభ కరం. మీరు దీన్ని గుర్తుంచుకుంటారని నమ్మకముంది. ఇండ్లల్లో ఎవ్వరూ లేకపోతే వాటిలోకి ప్రవేశించకండి, మీకు అనుమతి లభించనంత వరకు ఇండ్లల్లోకి వెళ్లకండి. మిమ్మల్ని తిరిగి వెళ్ళిపోవాలని కోరితే మటుకు తిరిగి వెళ్ళిపోండి. ఇదే మీకు ఉత్తమమయినది. మీరు చేస్తున్నదేమిటో అల్లాహ్‌కు బాగా తెలుసు.**

***(అన్ నూర్: 27, 28)***

ఈ సహేతుకమయిన విధానాన్ని వదలిపెట్టి ఇతరుల ఇండ్లల్లోకి దొంగ చాటుగా తొంగి చూడటం, లోపలి పరిస్థితుల్ని తెలుసుకోగోరటం హేయమయిన తప్పు.

ఒక హదీసులో ఇలా ఉంది, దైవసందేశహరులు(స) తన ఇంట ఉండగా ఒక వ్యక్తి తలుపులోని బెజ్జం ద్వారా తొంగి చూశాడు. ఆయన (స) చేతిలో దువ్వెన వంటి వస్తువు కట్టెదో, ఇనుముదో ఉండింది, ఆయన(స) దానితో అప్పుడు తల గోక్కుంటు న్నారు. అప్పుడు ఆయన (స) ఇలా అన్నారు, 'నీవు నన్ను చూస్తున్నావని అనుకున్న ట్లయితే దీనితో నీ కంటిని పొడిచేవాడిని. అనుమతి గ్రహించే ఆదేశం చూపుకు

సంబంధించిందే' (అంటే అనుమతి లేకుండా ఒకరి ఇంట తొంగి చూడటం, ఆ ఇంట అనుమతి లేకుండా ప్రవేశించడంతోనే సమానం.)[1]

మరో హదీసులో ఇలా ఉంది:

لو اطلع فی بیتک احد ولم تأذن له فخذفته بحصاة ففقأت عينه ما كان عليك من جناح[2]

**ఎవరయినా నీ ఇంట తొంగి చూసినట్లయితే నీవు అతనికి అనుమతినివ్వకపోయి ఉన్నట్లయితే, అతని ఈ చేష్టకు నీవు ఒక కంకరతో అతని కన్ను పొడిచినా నీపైన ఎటువంటి పాపపు భారం రాదు.**[2]

ఈ హదీసుల ఆధారంగా ఇమామ్ షాఫియీ వాదించిన దాని ప్రకారం, ఒక ఇంటిలోకి ఎవరయినా దొంగచాటుగా తొంగి చూసినట్లయితే ఇంటి యజమాని అతని కంటిని పొడిచివేసినా ఆ యజమానిపైన ఎటువంటి జరిమానాగాని, బదులుగా ఇచ్చే ప్రతిమూల్యంగాని విధించడం జరగదు. ఇమామ్ అబూ హనీఫా ప్రకారం ఇది భయ పెట్టే విధానం మాత్రమే. ఇందులో చట్టపరమయిన విషయం ఏదీ వక్కాణించబడ లేదు. ఈ వాదోపవాదాలను అలా ఉంచి, ఈ విషయంలో ఇస్లామ్ నైజం ఏమిటో వీటి వల్ల తెలుసుకోవచ్చు.

హదీసు వల్ల తెలిసే దాన్నిబట్టి ఆప్తబంధువుల ఇంట కూడా మనిషి అనుమతి తీసుకునే ప్రవేశించవలసి ఉంటుంది.

ఒక వ్యక్తి దైవసందేశహరుల్ని (స), నేను, నా తల్లి (గదిలో ప్రవేశించడానికి కూడా ఆమె) అనుమతి తీసుకోవలసి ఉంటుందా? అని అడిగాడు. ఆయన(స) దానికి అవునని సమాధానమిచ్చారు. అతడు, నేను ఆమెతోపాటే నివసిస్తూ ఉంటాను గదా అని తిరిగి అడిగాడు. ఆయన(స), అయినా అనుమతి తీసుకో అనే బదులిచ్చారు. అతను తిరిగి నేనయితే ఆమెకు సేవకుణ్ణి గదా అని అడిగాడు. అప్పటికీ, అనుమతి తీసుకునే ఆమె వద్దకు వెళ్ళు, ఆమెను వస్త్రహీనగా చూడటాన్ని నీవు ఇష్టపడతావా అని ఆయన (స) అడిగారు. అతను ఇష్టపడనని చెప్పాడు. అప్పుడు ఆయన(స), అయితే నీవు అనుమతి తీసుకునే వెళ్ళాలి (లేకపోతే నీకు ఇష్టంలేని స్థితిలో ఆమెను చూడవలసి రావచ్చు).[3]

---

*1. బుఖారి : కితాబుద్దయాత్ ; ముస్లిమ్ : కితాబుల్ అదబ్.*

*2. బుఖారి: కితాబుద్దయాత్ ; ముస్లిమ్ : కితాబుల్ అదబ్.*

*3. ముఅత్తాలో మహనీయ మాలిక్ ఉల్లేఖనం*

దీన్నిబట్టి ఇస్లామ్‌లో చాటు(Privacy) గా గడిపే ఏకాంతతలో ఇతరులు జోక్యం చేసుకోకుండా ఉండాలన్నది ఎంత ప్రముఖమయినదో, సమాజాన్ని ఈ హక్కును కాపాడాలని ఎంతగా కట్టుదిట్టం చెయ్యడం జరిగిందో ద్యోతకమవుతోంది.

## దేశం, సమాజాల సేవ చేసే హక్కు

దేశం, సమాజాల సంక్షేమానికి పాటుపడటం, దానిగ్గాను కృషి చెయ్యడం కేవలం రాజ్యం లేదా ఏదయినా వర్గానికి పరిమితం కాదు. రాజ్యంలో ప్రతి పౌరునికి ఈ హక్కుంది. ప్రతి పౌరునికి దేశ సమాజాల సేవ చేసే అవకాశం ఉండాలి. దీని మీద అనవసరమయిన ఆంక్షలు విధించరాదు. ఇస్లామ్, సామాజిక, నైతిక, సంస్కరణాత్మక, రాజకీయ, విద్యావిషయక అన్ని విధాల సేవలు అందజేయాలని పౌరులను ప్రోత్సహించింది. సమాజం మొత్తం దీనికి సిద్ధమవ్వాలని సమాయత్తపరచింది. దివ్యఖుర్‌ఆన్ దీన్ని ఈ విధంగా నిర్వచించింది:

لَا خَيْرَ فِيْ كَثِيْرٍ مِّنْ نَّجْوٰهُمْ اِلَّا مَنْ اَمَرَ بِصَدَقَةٍ اَوْ مَعْرُوْفٍ اَوْ اِصْلَاحٍ بَيْنَ النَّاسِ ؕ (النساء:۱۱۴)

**వారు చేసే గుసగుసల్లో ఎటువంటి శుభం లేదు. అయితే ఏ వ్యక్తి దాన ధర్మాలకు ఆదేశమిస్తాడో, జనం మధ్య సంస్కరణ కొరకు కృషి చేస్తాడో అతని విషయం వేరు (అతను శుభకార్యం నిర్వర్తించినట్లే).**

***(అన్ నిసా : 114)***

దైవగ్రంథాన్నీ, ప్రవక్త (స) సంప్రదాయ జ్ఞానాన్నీ సర్వసామాన్యం చేసే కృషి ఇస్లామ్ దృష్టిలో అత్యుత్తమ కృషిగా పరిగణించబడుతుంది. మహనీయ ఉస్మాన్ (ర) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్తశ్రీ (స) ఇలా ప్రవచించారు:

خيركم من تعلم القران و علمه[۲]

**ఖుర్‌ఆన్ విద్య గ్రహించేవారు, ఇతరులకు దాన్ని బోధించేవారు మీలో అత్యుత్తమ మయినవారు.**[1]

మనిషి తాను ఆరోగ్యవంతుడయి ఇతరుల సంక్షేమం కొరకు కృషిచెయ్యడం ఇస్లామ్ దృష్టిలో ఎంతో అభిలషణీయమయిన ఆచరణ. మహనీయ అబూ హురైరా (ర) ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త శ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

---

*1. బుఖారి : కితాబ్ ఫజాయిలుల్ ఖుర్‌ఆన్, బాబ్,21; తిర్మిజీ: సవాబుల్ ఖుర్‌ఆన్.*

المومن القوی خیر و احب الی الله من المومن الضعیف و فی کل خیر[۱]

**శక్తిమంతుడయిన విశ్వాసి, దైవం దృష్టిలో బలహీనుడయిన విశ్వాసి కన్నా ఎంతో ఇష్ట మయినవాడు, ఉత్తమమయినవాడు. అయినప్పటికీ ప్రతి ఒక్కరి లోనూ శుభ మంటూ తప్పక ఉంటుంది.[2]**

సేవాపథంలో నష్టాన్ని భరించడం, సహన స్థయిర్యాలతో దాన్ని కొనసాగించడం, ధైర్యముడిగి కూర్చుండిపోవడం తగని చేష్టలని ప్రబోధించడం జరిగింది. మహనీయ అబ్దుల్లా బిన్ ఉమర్(ర) ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా బోధించారు:

المسلم الذی یخالط الناس و یصبر علی اذاهم افضل من الذی لا یخالطهم ولا یصبر علی اذاهم[۲]

**ఏ విశ్వాసి అయితే జనులతో కలవిడిగా ఉంటాడో, వారి వల్ల కలిగే కష్టాల్ని సహనంతో ఓర్చుకుంటాడో, అతను, జనంతో కలిసిమెలిసి మెలగని, వారి కష్టాలను సహించని ముస్లిమ్‌కన్నా అత్యధికంగా ఉత్తముడు, ఉన్నతుడు.[3]**

వ్యక్తులూ, వర్గాల మధ్య తలెత్తిన తగాదాలను తుదముట్టించడం, వారి మధ్య సంబంధాలను పునరుద్ధరించడం సమాజంలో అత్యుత్తమ సేవగా పరిగణించబడుతుంది. మహా పుణ్యకార్యం కూడా. దీని ఘనత నఫ్ల్ (అదనపు) ఆరాధనలకన్నా అధికమయినది. మహనీయ అబూ దర్దా(ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

الا اخبرکم بافضل من درجة الصیام و الصدقة و الصلٰوة قال قلنا بلٰی قال اصلاح ذات البین و

**అదనపు ఉపవాసం, దానధర్మం, నమాజ్ కన్నా ఉన్నతమయిన ఆచరణ ఏదో నేను మీకు తెలుపనా? ఉల్లేఖనకర్త ప్రకారం, 'తప్పక సెలవీయండి' అని మేము విన్నవించుకున్నాము. దానికి ఆయన (స) 'పరస్పర సంబంధాలను సరిజేయడం. పరస్పర**

2. ముస్లిమ్ : కితాబుల్ కద్ర్.
3. ముస్నద్ అహ్మద్ : 43/2; తిర్మిజీ : కితాబ్ సఫ్పతుల్ కియామ, బాబ్, కారి ఇబ్నుమాజ: కితాబుల్ ఫితన్.

فساد ذات البين هى الحالقة[1]

**సంబంధాలలో చెడుగు పొడసూపడం, (ప్రపంచం, పరలోకం ఉభయత్రా) గుండుగొరిగించుకోవడంతో సమానం.'[1]**

సందేశ ప్రచారం, బోధన, ఉపదేశనం ప్రతి ఒక్కరి హక్కు. దీనికి ఆధారం హజ్రత్ ఉమ్ముహబీబా (ర) ఉల్లేఖనంలో ప్రాప్తమవుతుంది. అందులో ప్రవక్తశ్రీ (స) ఇలా నుడివారు:

كل كلام ابن آدم عليه لا له، الا امر بالمعروف او نهى عن منكر او ذكر الله[2]

**మంచిని ఆదేశించడం, చెడును వారించడం లేదా అల్లాహ్ సంస్మరణం తప్ప ఆదమ్ సుతుడు (మానవుడు) పలికే ఏ మాట అయినా సరే అది అతనికి నష్టదాయకంగానే పరిణమిస్తుంది. ప్రయోజనకరం కాదు.[2]**

ఈ విధంగా ఇస్లామ్ ప్రతి ఒక్క వ్యక్తికి, సమాజంలో సంక్షేమానికి, మానవుల సేవకు తన వంతు కృషి చెయ్యాలని ప్రేరేపిస్తుంది. దీని కొరకు శక్తిని, బలాన్ని, సామర్థ్యాన్ని సృజించుకోవాలని, సేవను ఎంతో పెద్ద పుణ్యకార్యంగా, ప్రతిఫల ప్రదాయినిగా పరిగణించి నిర్వర్తించాలని ప్రబోధిస్తుంది.

## విమర్శించే, సంస్కరించే హక్కు

దేవుని సందేశహరులు ప్రపంచంలో సత్యబోధన, సమాజ సంస్కరణా బాధ్యతను నిర్వర్తిస్తారు. ఏ విధమయిన భయాన్నయినా, ప్రమాదాన్నయినా లెక్క చెయ్యకుండా విధిని నిర్వర్తిస్తారు:

اَلَّـذِيْنَ يُبَلِّغُوْنَ رِسٰلٰتِ اللّٰـهِ وَ يَخْشَوْنَهٗ وَلَا يَخْشَوْنَ اَحَـدًا اِلَّا اللّٰهَ ۭ وَ كَفٰى بِاللّٰهِ حَسِيْبًا ۝

(الاحزاب:٣٩)

**ఆ వ్యక్తులు (ప్రవక్తలు) అల్లాహ్ సందేశాలను జనులకు అందజేస్తారు, ఆయనకు భయపడతారు, అల్లాహ్‌కు తప్ప మరెవరికీ భయపడరు. లెక్క చూడటానికి అల్లాహ్ మాత్రమే చాలు.** ***(అల్ అహ్జాబ్ : 29)***

---

1. *ముస్నద్ అహ్మద్ : 444/6 ; అబూ దావూద్: కితాబుల్ అదబ్.*
2. *తిర్మిజీ : కితాబుజ్జుహద్; ఇబ్నుమాజా : కితాబుల్ ఫితన్.*

సమాజంలోని చెడుగులను విమర్శించడం, సమాజాన్ని సంస్కరించడం ఇస్లామ్ ప్రకారం ప్రతి ఒక్కరి హక్కుగా గుర్తించబడింది. దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:

قل الحق ولو كان مرا

**సత్యాన్నే పలకండి, అది ఒకరికి వెగటుగా అనిపించినా.**

ఇంకా ఇలా నుడివారు:

لا تخف فی الله لومة لائم[1]

**ధర్మం విషయంలో ఎవరయినా అధిక్షేపించినా ఆ అధిక్షేపాన్ని పట్టించు కోకండి.[1]**

చెడులను విమర్శించడాన్ని, వాటిని వారించడాన్ని, అందుకుచేసే కృషిని ప్రవక్తశ్రీ(స) విశ్వాసానికి అవశ్యమయినదిగా ప్రకటించారు:

من رایٔ منکم منکرا فلیغیره بیده فان لم یستطع فبلسانه و ان لم یستطع فبقلبه و ذالک اضعف الایمان[2]

**మీలో ఎవరయినా చెడును చూస్తే దాన్ని తన చెయ్యి (బలం)తో మార్చి వెయ్యాలి; ఆ శక్తి తనకు లేకపోతే తన నోటితో దాన్ని విమర్శించి (మార్చే ప్రయత్నం చెయ్యాలి). అదీ వీలుపడకపోతే కనీసం దాన్ని తన ఆంతర్యంలో చెడుగా గుర్తించాలి. ఇది విశ్వాసానికి అవశ్యమయిన అత్యంత బలహీన మయిన స్థాయి.[2]**

ప్రభుత్వం, రాజ్యం చేపట్టే చర్యలకు సమర్థన తెలుపడమయినా, బలపరచడమయినా లేదా ఆక్షేపించడమయినా, విమర్శించడమయినా- ఈ వ్యవహారంలో ఇస్లామ్ ఒక సూత్రప్రాయమయిన విషయాన్ని తెలిపింది. ప్రభుత్వాన్ని దాని మంచి పనులకుగాను సమర్థించాలి. దాని ద్వారా షరీఅత్ పైన అమలు జరుగుతున్నట్లయితే, అది పాపకార్యాల నివారణకు ప్రయత్నిస్తుంటే దానికి తోడ్పాటునివ్వడం జరుగుతుంది. అలాకాక అది చెడులను వ్యాపింపజేస్తూ ఉంటే దానికి సహాయపడటం జరగదు.

1. మిష్కాతుల్ మసాబీహ్ : కితాబుల్ అదబ్.
2. ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్; అబూ దావూద్ : కితాబుల్ మలాహిమ్.

దానికి దూరంగా మసలుకోవడం జరుగుతుంది. హజ్రత్ అలీ (ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు(స) ఇలా సెలవిచ్చారు:

لا طاعة فى معصية انما الطاعة فى المعروف[1]

పాపపు కార్యాలలో అనుసరించడం జరగదు, కేవలం సత్కార్యాల్లోనే అనుసరించడం జరుగుతుంది.[3]

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర), ప్రవక్తశ్రీ (స) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారు:

السمع والطاعة على المرء المسلم فيما احب وكره مالم يؤمر بمعصية فاذا امر بمعصية فلا سمع ولا طاعة[2]

ముస్లిమ్ వ్యక్తి తన నాయకుని మాటను వినాలి, దాన్ని అనుసరించాలి. అది అతనికి నచ్చిన విషయంలోనయినా, నచ్చని విషయంలోనయినా - అతనికి పాపపు పనికి ఆదేశమిస్తే తప్ప! పాపపు పనికి ఆదేశమిస్తే మటుకు మాట వినడమూ జరగదు, అనుసరించడమూ జరగదు.[1]

నవాస్ బిన్ సమ్ఆన్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

لا طاعة لمخلوق فى معصية الخالق[3]

సృష్టికర్త పట్ల పాపంగా పరిగణించబడే విషయంలో ఏ సృష్టి (మానవుని) మాటా అంగీకరించడం జరగదు.[2]

ఇస్లామ్ వ్యక్తిని సమాజంలో కార్యశీలునిగా, ఆచరణాపరాయణునిగా చూడదలుస్తుంది. దీనిగ్గాను అది అత్యుత్తమ మార్గదర్శక సూత్రాలను సయితం అందజేసింది. వాటిని పాటిస్తే సమాజం అన్ని విధాల కలతలు, కలహాల ముండ్ల పొదల్లేని వనంగా, శాంతిశ్రేయాల సంస్కారవంతమయిన ఉద్యానవనంగా మారగలదు.



3. బుఖారి : కితాబ్ అఖ్బారుల్ అహాద్; ముస్లిమ్: కితాబుల్ ఇమారహ్.
1. బుఖారి: కితాబుల్ అహ్కామ్; ముస్లిమ్ : కితాబుల్ ఇమారహ్.
2. మిష్కాతుల్ మసాబీహ్ : కితాబుల్ ఇమారహ్ వల్‌కజా.

# 5. బలహీన వ్యక్తులు, వర్గాల హక్కులు

సమాజంలో శారీరకంగా, మానసికంగా, ఆర్థికంగా, సామాజికంగా బలహీను లయిన వ్యక్తులు, వర్గాల ప్రజలు మునుపు కూడా ఉండేవారు, నేడూ ఉన్నారు. ప్రపంచంలో ప్రతిచోటా ప్రతి దేశంలోనూ ఉన్నారు. బలహీనుల చరిత్ర వారి హక్కుల అణచివేత చరిత్ర. వారు తమ జీవితం అన్యాయం, అక్రమాల క్రీనీడలోనే గడిపారు. వారు ప్రాథమిక హక్కులకు కూడా నోచుకోలేదు. సమాజంలో బలహీన వ్యక్తులు వర్గాలపైన జరిగే అత్యాచారాలను ఇస్లామ్ తొలినాటి నుంచే బలంగా ఖండిస్తూ వాటికి వ్యతిరేకంగా గళం విప్పుతూ వచ్చింది. వారి హక్కుల కొరకు అగ్రగామిగా నిలిచింది. వారికి రక్షణ కవచంగా ముందుకు వచ్చింది. బలం గలవారి అక్రమాల ఉక్కుపాదాల కింద అనాథలు, నిరుపేదలు, అంగవిహీనులు సదా అణగారుతూ వచ్చారు. ఖుర్ఆన్ దౌర్జన్యపరుల్ని, అత్యాచారుల్ని కఠినంగా విమర్శిం చింది, వారి ఈ దుర్వర్త నకు పరలోకంలో లభించే శిక్షను గురించి హెచ్చరించింది. దానితోపాటు బలహీనులు, వంచితుల చట్టపరమయిన హక్కులను విశదీకరించింది. దారిద్ర్యం, బీదరికం వల్ల సమాజంలో ఎవరిని అధములుగా పరిగణించడం జరిగేదో వారికి సమానమయిన స్థానాన్ని ప్రసాదించింది. కొన్నింటిని ఇక్కడ ప్రస్తావించడం జరుగుతోంది:

## స్త్రీల హక్కులు

స్త్రీ పట్ల అన్ని కాలాల్లోనూ అన్యాయం జరుగుతూ వచ్చింది. పురుషుడు ఆమెకు సమానమయిన స్థానం ఇవ్వ నిరాకరించాడు. ఆమెను తక్కువయినదిగా భావించాడు. ఆమె హక్కుల్ని కాలరాచాడు. ఆమె పట్ల అనైతికంగా, కొన్ని సందర్భాలలో అమాన వీయంగా వ్యవహరించాడు. స్త్రీ తన సహజ దౌర్బల్యం వల్ల ఇదంతా భరిస్తూ వచ్చింది. బహుశా ఎన్నడూ దీనికి ప్రతిగా నిరసన కూడా తెలుపలేదు.

స్త్రీల పట్ల అరబ్బు సమాజంలో కడు హీనంగా ప్రవర్తించడం జరిగేది. కూతు ళ్ళను అవమానకరమయిన వారుగా పరిగణించడం జరిగేది. కొన్ని సందర్భాలలో

నయితే వారిని సజీవంగా సమాధిపాలు చేసివేసేవారు. వారి మృత్యువే వారి జీవితం కన్నా ఉత్తమమయినదిగా భావించబడేది. వారికి ఎటువంటి ఆర్థిక హక్కులుండేవి కావు. వారసత్వంలో వారికి ఎటువంటి వాటా ఉండేది కాదు. వారు సజీవంగా ఉన్నా భారంగా పరిగణించబడేవారు. భారంగా భావిస్తూనే వారిని పోషించేవారు. ఈ పరిస్థితులకు వ్యతిరేకంగా ఇస్లామ్ తన గళం విప్పింది. సమాజంలో వారికి సమాన స్థాయినిచ్చింది. వారికి ప్రతిగా ఎటువంటి అక్రమమయినా నేరంగా పరిగణించింది. ఆస్తిలో వారి వాటాను నిర్ణయించింది. దాంపత్య జీవితంలో స్త్రీ పురుషుల హక్కులూ బాధ్యతలు నిర్ణయించింది. సమాజంలో వారు తమ పాత్ర నిర్వహించే అవకాశాలు కల్పించింది. స్త్రీ పురుషుని అనుబంధ వస్తువు కాదు, ఆమె ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ఘోషించింది. ఇరువురూ దేవుని దాసులే అని, ఆయనకు సమాధానం చెప్పుకోవలసిన వారేనని చాటింది. వారిలో ఎవరయితే తన సత్కార్యాల మూట తీసుకుని ఆయన సమక్షంలో హాజరవుతారో వారు సఫలురవుతారని, మరెవరయితే ఖాళీగా వెడతారో వారు నిష్ఫలురవుతారని ప్రకటించింది.

## భార్య హక్కులు

భార్యాభర్తల సంబంధం మానవ సంబంధాల్లో అన్నింటికన్నా సమీపతరమయిన సంబంధం. ఇదే కుటుంబానికి పునాది. ఇస్లామ్ ఈ సంబంధాన్ని చక్కబరచాలని, దీన్ని ఆదరించాలని బోధించింది. పురుషుని సంబోధించి అది, భార్యలో ఏమయినా అయిష్టకరమయింది అగుపిస్తే దాని పట్ల చూపోపు వహించి ఆమె పట్ల ప్రసిద్ధ రూపంలో వ్యవహరించాలని ఉపదేశించింది. ప్రసిద్ధ వైఖరి అన్నది, ప్రతి సౌజన్య శీలుడయిన వ్యక్తి, సంస్కారవంతుడయిన వ్యక్తి సమంజసమయిందిగా, సమాజం దాన్ని ప్రశంసించేదిగా ఉండాలి. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

وَ عَاشِرُوْهُنَّ بِالْمَعْرُوْفِ ۚ فَاِنْ كَرِهْتُمُوْهُنَّ فَعَسٰۤى اَنْ تَكْرَهُوْا شَيْئًا وَّ يَجْعَلَ اللّٰهُ فِيْهِ خَيْرًا كَثِيْرًا ۝ (النساء:١٩)

**వారి (భార్యల) పట్ల ఉత్తమ రీతిలో వ్యవహరించండి. వారిలో ఏదయినా మీకు ఇష్టమయినది లేకపోయినా, ఒక విషయం వారిలో మీకు ఇష్టంలేకపోతే అల్లాహ్ వారిలో అనేక మేళ్ళు పెట్టాడేమో!**

***(అన్ నిసా : 19)***

దైవసందేశహరులు (స) స్త్రీల పట్ల సవ్యంగా వ్యవహరించాలని మాటిమాటికీ తాకీదు చేశారు. హజ్రత్ ముఆవియా ఖైషరీ (ర), ఆయన్ని (స) భార్య హక్కులను గురించి ప్రశ్నించగా ఆయన (స) ఇలా సెలవిచ్చారు:

ان تطعمها اذا طعمت و تكسوهـا اذا اكتسيت ولا تضرب الوجه ولا تقبّح ولا تهجر الا فى البيت[1]

**నీవు తిన్నప్పుడు ఆమెకూ తినిపించు, నీవు తొడిగినప్పుడు ఆమెకూ తొడిగించు; (ఆగ్రహం కలిగినప్పుడు) ఆమె ముఖాన కొట్టబాకు; ఆమెను తూలనాడబాకు; (ఆమెకు దూరంగా ఉండదలిస్తే ఇంటి నుండి వెళ్ళగొట్టకు) ఇంటిలోనే వేరుగా ఉండిపో.**[1]

ఈ ఉల్లేఖనమే మరో విధంగా కూడా వచ్చింది:

اَطْعِمُوْهُنَّ مِمَّا تَاْكُلُوْنَ وَ اكْسُوْهُنَّ مِمَّا تَكْتَسُوْنَ وَلاَ تَضْرِبُوْهُنَّ وَلاَ تُقَبِّحُوْهُنَّ[2]

**మీరు తిన్నదే వారికీ పెట్టండి, మీరు తొడి గిందే వారికీ తొడిగించండి, వారిని కొట్ట కండి, తిట్టకండి.**[2]

వీటివల్ల రెండు విషయాలు తెలిశాయి. అన్నపానీయాలలో, దుస్తుల్లో మనిషి అవలంబించే ప్రమాణాలనే భార్యకీ వర్తింపజెయ్యాలి. స్వయంగా ఉన్నత ప్రమాణాన్ని అవలంబిస్తూ ఆమెను అధమ ప్రమాణంలో జీవించేలా చెయ్యడం సరయిన పద్ధతి కాదు. రెండవది, ఆమె పట్ల మెలగడంలో సంబంధాల్లో సౌజన్యశీలురిలా వ్యవహ రించాలి. మూఢత్వం, క్రూరత్వం ప్రదర్శించరాదు.

హజ్రత్ అబూ హురైరా (ర) ప్రవక్తశ్రీ (స) తెలిపినట్లు ఉటంకించారు:

اكمل المؤمنين ايمانا احسنهم خلقا و خيـاركم خيـاركم لنساء هم[3]

**విశ్వాసుల్లో పరిపూర్ణమయిన విశ్వాసంగల వ్యక్తి, నైతిక ప్రవర్తనలో అందరికన్నా ఉత్తమ మయినవాడు. మీ భార్యల ఎడల ఉత్తమమయినవారే మీలో ఉత్తమమయిన వారు.**[3]

---

1. అబూ దావూద్ : కితాబున్నికాహ్. 2. పై ప్రస్తావనే.
3. తిర్మిజీ : అబ్వాబుర్రిజాఅ.

భావమేమిటంటే, నైతిక ఔన్నత్యం ద్వారానే విశ్వాసంలో ఉన్నత స్థానం ప్రాప్తమవుతుంది. తన ఇంటివారల పట్ల సవ్యంగా వ్యవహరించే వాడే సమాజంలో అత్యుత్తమ వ్యక్తి.

## విధవ పట్ల ఉత్తమ వ్యవహారం, ఆమె హక్కులు

స్త్రీ పట్ల ఆమె భర్త కూడా అన్యాయం చేశాడు. అయినప్పటికీ ఆమె ఎదలో అతని పట్ల అనురాగమే వెలసిల్లింది. భార్యాభర్తల మధ్య ఎంతో భావోద్రేకమయ మయిన సంబంధముంటుంది. అందువల్లనే వారిరువురి మధ్య ప్రేమానురాగాలు సయితం అనుపమమయినవని భావించబడుతుంది. వారిరువురి ప్రయోజనాలూ ఒండొ కరితో ముడివడి ఉంటాయి. స్త్రీ, అతని సంతానానికి తల్లి, అతని ఇంటి యజమాన్య భారం కలిగినదయి ఉంటుంది. పురుషుడేమో ఆమె ధన, మాన ప్రాణాల రక్షకునిగా మెలుగుతాడు. ఈ కారణంగానే స్త్రీ భావపరంగా అందరికన్నా తన భర్త వద్దనే సామీప్యానుభూతి పొందుతుంది. స్త్రీ స్థానం బలహీన మయిందిగా భావించ బడుతుంది. ఆమెకు భర్త ఆసరా కూడా లేకుండా పోతే ఆమె స్థానం మరీ గాయ పడుతుంది. ఆమె తనను కాపాడేవాడు, కనిపెట్టుకు ఉండేవాడు లేకపోవడం చేత అన్ని వైపుల నుండి దౌర్జన్యం అత్యాచారాలకు గురవుతుంది.

స్త్రీ విధవ అయితే అది దేవుని ప్రకృతి నియమాలకనుగుణంగా ఆయన వైచిత్రీ కనురూపంలో అవుతుంది. అందులో ఆమె తప్పేమీ ఉండదు. కాని ప్రపంచ జాతు లనేక వాటిలో స్త్రీ వైధవ్యం చాలా పెద్ద మచ్చ. అటువంటి స్త్రీని అదృష్టహీనగా, అపశకునంగా భావించబడుతుంది. నీచంగా అసహ్యంగా చూడబడుతుంది. సమా జంలో ఆమెకు విలువ గౌరవాలుండవు. ఆమెపట్ల ఆదరణ, అభిమానం తగ్గిపోతాయి. ఆమెలో తన దురదృష్టం, దౌర్భాగ్యాల భావన వ్రేళ్ళూనుకుపోతుంది. కొన్ని సందర్భా లలో ఈ భావన తీవ్రత వల్ల ఆమె ఆత్మహత్యకు కూడా పూనుకుంటుంది. జీవించినా ఈ జీవితంకన్నా మృత్యువే మేలని ఆమె భావిస్తుంది. నేటికీ కొన్ని సమాజాలలో విధవ స్త్రీల పరిస్థితి ఇలాగే ఉంది. ఈ కోణంలో చూస్తే వైధవ్యం స్త్రీకి ఒక సామాజిక మానసిక దుర్ఘటనగా భావించవచ్చు. ఏ స్త్రీకి ఈ దుర్ఘటన సంభవిస్తుందో ఆమె మన సద్వర్తనకు అత్యధికంగా అర్హురాలని ఇస్లామ్ ఉద్బోధ. దైవసందేశహరులు (స) వితంతువులు, నిరుపేదల సేవకు వారి సహాయానికి చేసే కృషిని దైవమార్గంలో సతత సమరం, రేబవళ్ళ అదనపు ఆరాధనలకు సమానంగా ప్రకటించారు. హజ్రత్ అబూ

హురైరా (ర) ఉల్లేఖనం ప్రకారం ఆయన (స) ఇలా సెలవిచ్చారు:

**'వితంతువు, నిరుపేదల విషయంలో కృషి చేసేవాడు దైవమార్గంలో కృషి చేసేవానికి సమానం.' ఉల్లేఖనకర్త ప్రకారం ఆయన (స) ఇంకా ఇలా కూడా సెలవిచ్చారు, 'అటువంటి వ్యక్తి నిరంతరాయంగా దైవ ధ్యానంలో నిలబడ్డ (నమాజ్ చేసే) వ్యక్తికి, నిరంతరాయంగా రోజా ఉపవాసాలు పాటించేవానికి సమానం.'[1]**

**الساعی علی الارملة والمسکین کا لمجاھـــد فی سبیل اللہ و احسبه قال وکالقائم لا یفترو کالصائم لایفطر**

ఇస్లామీయ చట్టంలో స్త్రీ వితంతువు అవడంచేత తన చట్టపరమయిన హక్కుల్ని కోల్పోదు. భర్త వారసత్వంలో ఆమె వాటా నిర్ణీతమయినదే. ఆమెకు మరే ఆదాయం లేకపోతే భర్త తరువాత ఆమె భరణం చెల్లించవలసిన బాధ్యత ఆమె సంతానంపైన, తల్లిదండ్రులపైన తప్పనిసరి విధితమవుతుంది. అన్నింటికన్నా ముఖ్యమయిన విషయం ఆమె పునర్వివాహం (నికాహ్) చేసుకునే హక్కు కలిగి ఉంటుంది. ఆమె స్వేచ్ఛగా, ఇష్టపూర్వకంగా మళ్ళీ వైవాహిక జీవితాన్ని ప్రారంభించగలుగుతుంది. ఇస్లామీయ సమాజంలో వితంతువు వివాహం కొనసాగుతూ ఉండేది. ఇది వితంతువుకు సంబంధించిన అనేక సమస్యలకు పరిష్కారం.

## అనాథల పట్ల సత్‌వ్యవహారం, వారి హక్కులు

అనాథ అన్న పదం పారిభాషికంగా తండ్రిలేని ప్రాజ్ఞత పొందని బాలలకు వర్తిస్తుంది. కాని తల్లిలేని బాలలకు కూడా నిఘంటు భావంలో అనాథగా పరిగణించ వచ్చు. బాలలకు అనాథ అనడం అత్యంత ఘనమయిన దుర్ఘటనగా పేర్కొనవచ్చు. తల్లిదండ్రులు లేకపోవడంచేత వారు తమ దగ్గరి సానుభూతిపరులు, నిజమయిన సంరక్షకుల నీడను కోల్పోతారు. వారు విద్యాబుద్ధులు, ఉద్యోగాలకే కాక బహుధా తమ సంరక్షణ పరిపోషణ కోసం కూడా ఇతరుల అండను ఆకాంక్షించవలసి ఉంటుంది. వారిని తమ సంతానంలా చూడటం, వారి పోషణ, సంరక్షణా భారాన్ని నెత్తిన వేసుకోవడం, వారి విద్యాబుద్ధుల కొరకు ప్రయత్నించడం, వారిని తమ కాళ్ళపై

1. బుఖారి : కితాబుల్ అదబ్ ; ముస్లిమ్ : కితాబుజ్జుహద్.

నిలబడే యోగ్యులుగా తయారుచెయ్యడం సులువయిన విషయం కాదు. కాని ఎవరయితే ఈ కష్టసాధ్యమయిన కార్యాన్ని సాధిస్తారో వారికి దైవసందేశహరుల సామీప్యం, సాంగత్యం ప్రాప్తమయ్యే శుభవార్త వినిపించబడింది. మహనీయ సహల్ బిన్ సఅద్ ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:

انا و كافل اليتيم فى الجنة هكذا وقال باصبعيه السبابة والوسطى[1]

**'నేనూ, అనాథ పోషకుడు స్వర్గంలో ఇలా సమీపాన ఉంటాము' అంటూ ఆయన తన చూపుడు వ్రేలు, మధ్య వ్రేలు దగ్గరచేసి చూపారు.**[1]

బంధువుల హక్కు ప్రధానమయింది. వారి సేవకు పుణ్యఫలం అధికం. కాని అనాథతో బంధుత్వపు సంబంధం లేకపోయినప్పటికీ వారి పాలన పోషణ వల్ల బంధువయిన అనాథను పోషించడం వల్ల లభించే పుణ్యఫలమే ప్రాప్తమవుతుంది. ఇటువంటి వ్యక్తికి కూడా దైవసందేశహరులు (స) పరలోకంలో తనతోపాటు సామీప్యం లభించే శుభవార్తనిచ్చారు. కనుక పైన పేర్కొన్న హదీసు క్రింది పదాలలో కూడా ఉల్లేఖించబడింది:

كافل اليتيم له او لغيره انا وهو كهاتين فى الجنة[2]

**తనవాడయినా పరాయివాడయినా అనాథను పోషించేవాడు నాతోపాటు స్వర్గంలో ఇలా సమీపాన ఉంటాడు. (ఈ రెండు వ్రేళ్ళలా).**[2]

ఇమామ్ నవవి ప్రకారం అనాథ పోషణ అంటే భావం, అతని అన్నపానీయాలు, వస్త్రాలు, విద్యాబుద్ధులు అన్నింటి ఏర్పాటు చెయ్యడం అన్నమాట. ఈ మహత్తు ప్రాప్త మవడం, ధనం ఖర్చుపెట్టి సేవ చేసే వారికీ, లేదా అనాథుని సొమ్మునే షరీఅత్ పరిధిలో అతని అవసరాల మేరకు ఖర్చు పెట్టేవానికీ సమానంగా ప్రాప్తిస్తుంది.[3]

మాలిక్ బిన్ అల్ హారిస్ (ర), దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చినట్లు ఉల్లేఖించారు:

---

*1. బుఖారి : కితాబుల్ అదబ్.* *2. ముస్లిమ్ : కితాబుజ్జుహద్.*

*3. నవవి; షర్హు ముస్లిమ్; సం. 9, భాగం 18, కితాబుజ్జుహద్.*

**من ضم يتيما بين ابوين مسلمين الیٰ طعامه و شرابه حتی يستغنی عنه وجبت له الجنة[۲]**

**ఎవరయితే, ముస్లిమ్ తల్లిదండ్రుల అనాథకు అతను పెద్దవాడయి ఎవరి అవసరమూ లేనివాడయ్యేంతవరకు తన అన్నపానీయాలు పెట్టి పోషించుకుంటాడో అతనికి స్వర్గం తప్పనిసరి అవుతుంది.[1]**

ఈ సందర్భంలో మరో హదీసు హ(జత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ ఉల్లేఖించారు:

**من عال ثلٰثة من الايتام كان كمن قام ليله و صام نهاره و غدا وراح شاهرا سيفه فی سبيل الله و كنت انا وهو فی الجنة اخوان كما ان هاتين اختان والصق اصبعيه السبابة والوسطی[۳]**

**ఎవరయితే ముగ్గురు అనాథల పోషణ చేస్తాడో అతను రేయంతా నమాజ్ కొరకు నిలబడి, పగలంతా రోజా (వ్రతాన్ని పాటించి రేబవళ్ళు దైవమార్గంలో సతత సమరం సలిపినవానికి సమానం. నేనూ అతనూ స్వర్గంలో ఇలా సమీపాన ఉంటాము - ఈ రెండు (వ్రేళ్ళల్లా. ఇలా చెప్పి ఆయన చూపుడు (వ్రేలు, మధ్య (వ్రేలు కలిపి చూపారు.[2]**

(స్త్రీ అనాథల పట్ల ఎటువంటి అత్యాచారమయినా జరపరాదని, వారి హక్కుల్ని కాజెయ్యరాదని దైవసందేశహరులు (స) ఈ పదాలలో వారించారు:

**اللهم انی احرج حق الضعيفين اليتيم والمرأة[۱]**

**అల్లాహ్ ఎవరయితే ఈ ఇద్దరు బలహీనులు అనాథ, (స్త్రీల హక్కును హరిస్తాడో అతన్ని నేను అపరాధిగా, నేరస్థునిగా నిర్ణయిస్తున్నాను. (ఈ ఆరోపణ రాకుండా తప్పించుకోవాలని నేను తాకీదు చేస్తున్నాను.)[3]**

హ(జత్ అబూ హురైరా(ర), (ప్రవక్తశ్రీ(స) ఇలా ఉపదేశించారని ఉల్లేఖించారు:

---

1. ముస్నద్ అహ్మద్ : 344/4; అత్తర్గీబ్‌వత్తర్హీబ్ : కితాబుల్ బి(ర్ వస్సిల్ల.
2. ఇబ్నుమాజ: కితాబుల్ అదబ్. 3. ముస్నద్ అహ్మద్ 2/439; ఇబ్నుమాజా కితాబుల్ అదబ్: నవవీ, హసన్, నసాయి, రియాజుస్సాలిహీన్ : 122

**خير بيت فى المسلمين بيت فيه يتيم يحسن اليه و شر بيت فى المسلمين بيت فيه يتيم يساء اليه**[2]

**ముస్లిముల ఇండ్లల్లో అత్యుత్తమ ఇళ్ళు, అనాథ పట్ల అత్యుత్తమ రీతిలో వ్యవహరించబడే ఇల్లు. ముస్లిముల ఇండ్లల్లో నికృష్టమయిన ఇల్లు, అనాథ పట్ల చెడ్డగా ప్రవర్తించే ఇల్లు.**[1]

అనాథ సాధారణంగా బుద్ధీజ్ఞానాలు తక్కువయినవాడు, అనుభవం లేనివాడయి ఉంటాడు. అతనికి తన లాభనష్టాలను గురించి పూర్తిగా తెలియదు. అందువల్ల అతి సునాయాసంగా అతని హక్కు కొట్టివేయడం సాధ్యమవుతుంది, అతనికి నష్టం కలిగించడానికి వీలవుతుంది. ఇస్లామ్ దీన్ని గట్టిగా నిషేధించింది. అనాథ శ్రీమంతుడయితే అతని ఆస్తిని రక్షించి వృద్ధిపరిచే ప్రయత్నం చేయాలని, దీని ద్వారా ఏ విధంగానూ అధర్మమయిన ప్రయోజనం పొందే ప్రయత్నం చేయరాదని బోధించింది. అతని సొమ్ములో ఖర్చుపెట్టినా సరయిన విధంగా నిజాయితీగా జరగాలి, దాన్ని నాశపరిచే బుద్ధితో ఖర్చు జరగరాదు. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

**وَلَا تَقْرَبُوْا مَالَ الْيَتِيْمِ اِلَّا بِالَّتِىْ هِىَ اَحْسَنُ حَتّٰى يَبْلُغَ اَشُدَّهٗ** (الانعام:١٥١)

**అనాథల సొమ్ము దగ్గరకు వెళ్ళకండి. కాని సవ్యమయిన విధంగానయితే సరే. చివరికి వారు తమ ప్రాజ్ఞతా వయసుకు చేరుకోగలగాలి.** ***(అల్ అన్ ఆమ్ : 151)***

ఎవరయితే అనాథల సొమ్ము తింటారో వారికి దిగువ పదాలలో హెచ్చరించడం జరిగింది:

**اِنَّ الَّذِيْنَ يَاْكُلُوْنَ اَمْوَالَ الْيَتٰمٰى ظُلْمًا اِنَّمَا يَاْكُلُوْنَ فِىْ بُطُوْنِهِمْ نَارًا وَّسَيَصْلَوْنَ سَعِيْرًا○** (النساء:١٠)

**నిస్సందేహంగా అనాథల సొమ్ము తినేవారు తమ కడుపుల్ని నిప్పుతో నింపుకుంటున్నారు. వారు తప్పకుండా మండే నరకాగ్నికి ఆహుతి కానున్నారు.**

***(అన్ నిసా : 10)***

దైవసందేశహరులు (స) ఏడు మహాపాపాలను వినాశకరమయినవిగా అభివర్ణించారు. వాటిలో అనాథల సొమ్ము తినడం ఒకటి.[2]

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (ర) ప్రకారం, ఈ బోధనల ప్రభావం ఆనాటి ఇస్లామీయ సమాజంపైన అమితంగా పడింది. అనాథల సంరక్షకులు వారి అన్న

---

1. *ఇబ్నుమాజా, కితాబుల్ అదబ్; బాబ్ హక్కుల్ యతీమ్; అల్ అదబుల్ ముఫ్రద్ : 1/231*
2. *బుఖారి : కితాబుల్ హుదూద్; ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్.*

పానీయాల ఏర్పాటు సయితం వేరుగా చేయసాగారు. ఒకవేళ ఉమ్మడి ఏర్పాటు ఉన్నట్లయితే, ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా అనాథల సొమ్ములో ఏదయినా భాగం తమ సొత్తులో చేరుతుందేమోనన్న భయం కలిగేది. ఆ విధంగా తాము కూడా అనాథల సొమ్ము తినే వారిలో చేరిపోతామేమోనని వారు భయపడేవారు. ఈ జాగ్రత్త ఏ మేరకు చేరిందంటే భోజన సామగ్రి ఏదయినా మిగిలిపోతే దాన్ని అట్టే భద్రంగా పెట్టేవారు. తరువాత స్వయంగా అనాథలే వాటిని తిరిగి వాడుకోగలగాలని. కొన్ని సందర్భాలలో అది చెడిపోయే అవకాశమున్నా అనాథల సంరక్షకులు వాటిని తినడం తమకు ధర్మం అని భావించేవారు కారు. ఇటువంటి జాగ్రత్తల వల్ల ఏర్పాట్లలో చాలా ఇబ్బందులు ఎదురయ్యేవి. ఆపైన ఈ ఆయత్ అవతరించినప్పుడు వారు మళ్ళీ తమ ఏర్పాట్లను అనాథల ఏర్పాట్లతో కలిపి సమిష్టిగా నిర్వహించసాగారు.[1]

وَيَسْئَلُوْنَكَ عَنِ الْيَتٰمٰى ۖ قُلْ اِصْلَاحٌ لَّهُمْ خَيْرٌ ۖ وَاِنْ تُخَالِطُوْهُمْ فَاِخْوَانُكُمْ ۖ وَاللّٰهُ يَعْلَمُ الْمُفْسِدَ مِنَ الْمُصْلِحِ ۖ وَلَوْشَآءَ اللّٰهُ لَاَعْنَتَكُمْ ۖ اِنَّ اللّٰهَ عَزِيْزٌ حَكِيْمٌ ۝ (البقرة:۲۲۰)

**వారు నిన్ను అనాథలను గురించి ప్రశ్నిస్తున్నారు, వారి ఎడల ఎలా ప్రవర్తించాలని. వారి మేలు ఇమిడి ఉన్న విధానమే సరయినదని వారికి చెప్పు. అన్నపానీయాలలోనూ, ఇతరత్రా వారితో కలివిడిగా ఉన్నా అందులో తప్పులేదు. ఎందుకంటే వారూ మీ సోదరులే. అల్లాహ్‌కు బాగా తెలుసు ఎవరు చెడుగు చేసేవాడో మరెవడు మెరుగుపరిచేవాడో. అల్లాహ్ కోరుకుంటే మిమ్మల్ని కష్టానికి గురిచేసేవాడే. ఆయన మహాధిక్యతగలవాడు, వివేచనాపరుడు.**

***(అల్ బకర : 220)***

ఈ ఆయత్‌లో బలంగా చెప్పిన విషయం ఏమిటంటే, అనాథల సొమ్ము పట్ల, వారికి ప్రయోజనకరమయిన వైఖరిని అవలంబించాలన్నది. 'ఫుకహా' (ధర్మవేత్తలు) దానికి అనేక విధానాలు సూచించారు. ఒకటి, వారి సొమ్మును ఏదయినా సముచితమయిన వాణిజ్య కార్యక్రమంలో వెచ్చించాలి. శ్రమ, పెట్టుబడుల సూత్రం ప్రకారం ఎవరయినా అనుభవజ్ఞుడూ శ్రామికుడయిన వ్యక్తికి అప్పగించాలి. సంరక్షకుడు

1. *అబూ దావూద్ : కితాబుల్ వసాయా; నసాయి : కితాబుల్ వసాయా*

సయితం అనాథ సొమ్ముతో తాను స్వయంగానూ ఏదయినా వ్యాపారం చెయ్యవచ్చు. లేదా మరొకరి వ్యాపారంలో ఆ ధనం పెట్టుబడిగా పెట్టవచ్చు. అనాథ పట్ల శ్రేయోభి లాషకు ఓ రూపం ఏమిటంటే, అతని విద్యాబుద్ధులకు అవసరమయిన ఏర్పాటు చెయ్యాలి. లేదా ఏదయినా పరిశ్రమ, సాంకేతిక విద్య నేర్చుకునే అవకాశం కలిగించాలి. కొన్ని సందర్భాలలో శ్రేయోభిలాష రీత్యా అతనికి సమంజసమయిన సంబంధం కుదిర్చి పెళ్ళి చెయ్యడం కూడా అవసరమవుతుంది. ఆయత్‌లో 'వారూ మీ సోదరులే' అన్న మాటలు వచ్చాయి. అంటే మీ సోదరుల పట్ల వ్యవహరించే తీరులో మీరు వారి ఎడల వ్యవహరించాలి.[1]

ఒక చోట అనాథల సంరక్షకులకను సంబోధించి దివ్యఖుర్ఆన్, మీరు వారి సొమ్ముకు రక్షకులు, కాపలాదారులు, దాన్ని రక్షించి కాపలా కాయడం మీ బాధ్యత, వారు ప్రాజ్ఞతా వయసుకు చేరుకోగానే వారి సొమ్ము వారికి అప్పజెప్పండి; వారు పెద్దవారవకమునుపే దాన్ని తిని త్రాగి అంతమొందించకండి, దైవం మీకు సంపన్నత ప్రసాదించినట్లయితే ఎటువంటి వేతనం లేకుండానే వారి సేవ చేయండి. కాని ఒకవేళ అగత్యపరులయి ఇబ్బందిగలవారయితే ప్రసిద్ధ రీతిలో తమ వేతనం తీసుకోవడం సరయినదే కాని ఆ సొమ్మును నిర్దయగా కాజేయకండి:

وَابْتَلُوا الْيَتٰمٰى حَتّٰى اِذَا بَلَغُوا النِّكَاحَ فَاِنْ اٰنَسْتُمْ مِنْهُمْ رُشْدًا فَادْفَعُوْا اِلَيْهِمْ اَمْوَالَهُمْ ۚ وَلَا تَاْكُلُوْهَا اِسْرَافًا وَّ بِدَارًا اَنْ يَّكْبَرُوْا ؕ وَمَنْ كَانَ غَنِيًّا فَلْيَسْتَعْفِفْ ۚ وَمَنْ كَانَ فَقِيْرًا فَلْيَاْكُلْ بِالْمَعْرُوْفِ ؕ (النساء:٦)

**అనాథలను పరీక్షిస్తూ ఉండండి, వారు నికాహ్ వయసుకు చేరుకునేంత వరకు. వారిలో మీరు ప్రాజ్ఞత, వివేచన చూడగలిగితే వారి సొమ్ము వారికి అప్ప జెప్పండి. అనాథల సొమ్ము అవసరానికి మించి, వారు పెద్దవారయి దాన్ని కోరుతారేమో నన్న ఆలోచనతో త్వరత్వరగా కాజేయకండి. కలవారు దీనికి దూరంగా మెలగాలి, అగత్యపరుడు ప్రసిద్ధ రీతిలో తినాలి.**
***(అన్‌నిసా : 6)***

ఒక వ్యక్తి దైవసందేశహరుల (స)కు ఇలా నివేదించుకున్నాడు, 'నేను కడు పేదను, ఏ ఆసరా లేనివాణ్ణి, నా వద్ద ఏమీ లేదు. అయితే ఒక అనాథను కనిపెట్టుకు

1. *వివరాల కొరకు చూడండి, జస్సాస్ కృతి "అహ్కాముల్ ఖుర్ఆన్" : 400/1; 401.*

ఉంటాను. నేను అతని సొమ్ము ద్వారా ఏమయినా ప్రయోజనం పొందవచ్చా?' అని అడిగాడు. దానికి ఆయన ఇలా సెలవిచ్చారు:

كل من مال اليتيم غير مسرف ولا مبادر ولا متاثل[1]

**అనాథ సొమ్ము నుండి నీవు తినవచ్చు. అవసరానికి మించీ తినరాదు, త్వర త్వరగానూ తినివెయ్యరాదు. అసలు సంపదే హరించిపోయేలా వ్యవహరించ రాదు.**[1]

## బానిసలు, నౌకరుల పట్ల సుహృద్భావం, వారి హక్కులు

ప్రపంచంలో అత్యంత ప్రాచీన కాలం నుండి బానిసల సంప్రదాయం ఉంటూ వచ్చింది. ఆ సంప్రదాయంతో పాటు బానిసల పట్ల అన్యాయం అత్యాచారమూ జరుగుతూ వచ్చింది. బానిసలు స్వయంగా ఏదయినా కృషి చేసి శ్రమించి సంపాదించుకునే స్వేచ్ఛ కూడా వారికి ఉండేది కాదు. ఏ వస్తువుపైనా వారికి స్వామ్యం హక్కును అంగీక రించడమూ జరిగేదికాదు. అతని ధనమాన ప్రాణాలు, అతని సామర్థ్యాలు, అతని సమయం- అన్నింటి పైనా అతని యజమానికే సర్వాధికారాలుండేవి. యజమాని ఏ విధంగా కోరుకుంటే ఆ విధంగా అతని పట్ల వ్యవహరించేవాడు. జంతు వుల పట్ల కూడా సమ్మతింపదగని వ్యవహారసరళిని బానిసల పట్ల అవలంబించడం జరిగేది. ఇన్ని అక్రమాలు అన్యాయాలు జరిగినా వారికి నోరు మెదిపి తమ గోడు వినిపిం చుకునే అనుమతి కూడా వారికి ప్రాప్తమయ్యేది కాదు.

ఇదే విధంగా రాజులు తమ పాలిత ప్రజల పట్ల, అధికారులు తమ క్రింది వారి పట్ల; శ్రీమంతులు, నాయకులు తమ నౌకరులు, సేవకుల పట్ల; బలవంతులు, శక్తిమాన్యులు బలహీనుల పట్ల అన్ని విధాల దౌర్జన్యాలను ఉపయోగించారు, వారి హక్కుల్ని హరించివేశారు. ఇస్లామ్ వీటన్నింటికీ వ్యతిరేకంగా తన గళాన్ని విప్పింది. ప్రతి బలహీనుడి హక్కుల్ని నిర్ధారించింది. అతని పట్ల సవ్యమయిన రీతిలో వ్యవహరించమని ఉద్బోధించింది. ఇస్లామ్ బానిసల విషయంలో చేసిన నిర్దేశాలనుబట్టి వీటిని గురించి విపులంగా తెలుసుకోవచ్చు. హజ్రత్ అబూజర్ గిఫారీ (ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

---

1. *అబూదావూద్, కితాబుల్ వసాయ; బాబ్ మాజాఅ ఫీ మాలి వలియ్యుల్ యతీమ్.*

**ان اخوانكم خولكم جعلهم الله تحت ايديكم فمن كان اخوه تحت يده فليطعمه مما ياكل وليلبسه مما يلبس ولا تكلفوهم ما يغلبهم فان كلفتموهم ما يغلبهم فاعينوهم**[1]

**నిస్సందేహంగా మీ బానిసలు మీ సోదరులు. అల్లాహ్ వారిని మీకు హస్తగతం చేశాడు. అయితే ఎవరి సోదరుడు అతని హస్తగతమయి ఉన్నాడో అతను తాను తినేదే అతనికి పెట్టాలి. తాను తొడిగేదే అతనికి తొడిగించాలి. అతను భరించలేని కార్యభారాన్ని అతనిపైన మోపరాదు. వారి శక్తికి మించిన కార్యభారం వారికి అప్పజెప్పినట్లయితే దాన్ని నిర్వర్తించడంలో వారికి సహాయపడండి.**[1]

హ|జత్ అబూ హురైరా(ర) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు:

**للمملوك طعامه و كسوته ولا يكلف الا ما يطيق**[2]

**బానిసకు భోజనం, దుస్తులు సమకూర్చడం, అతని శక్తికి మించిన శ్రమను కలిగించకపోవడం అతని హక్కు.**[2]

హ|జత్ అబూజర్ (ర) ఉల్లేఖనం సందర్భంలో ఇమామ్ నవవి (రహ్మ) వివరణ ఇలా ఉంది:

ధర్మవేత్తలు ఈ విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు - యజమాని తినేది, తొడిగేది బానిసకూ పెట్టడం విధి కాకపోయినప్పటికీ అది అభిలష ణీయం. విధి ఏమిటంటే, నగరాలలోనూ, ప్రాంతా లలోనూ వ్యక్తులలోనూ ప్రసిద్ధమయిన రీతిలో అన్నవస్త్రాలు పెట్టాలి, ఇతర అవస రాలూ తీర్చాలి. అది యజమాని వినియోగించే అన్నవస్త్రాలయినా అంతకన్నా అధమస్థాయికి చెందినవయినా అధిక స్థాయికి చెందినవయినా. యజమాని తన నిష్ఠకారణంగానో లేదా పిసినారితనం మూలంగానో తన స్థాయి జనంకన్నా అధమ స్థాయికి చెందిన జీవితాన్ని గడుపుతున్నట్లయితే అతను బానిస లేదా నౌకరును అతని ఇష్టానికి వ్యతిరేకంగా అటువంటి జీవితమే గడపడానికి బలవంత పెట్టలేడు. ధర్మవేత్తలు, బానిస శక్తికి మించిన

1. బుఖారి : కితాబుల్ ఆతక్; ముస్లిమ్: కితాబుల్ ఈమాన్.
2. ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్.

కార్యభారం కూడా యజమాని అతనిపైన మోపజాలదన్న విషయంలోనూ ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు. ఇలా అధిక భారం మోపినప్పుడు స్వయంగా తానో లేదా ఇతరుల ద్వారానో అతనికి సహాయపడటం తప్పనిసరి.[1]

హదీసుల్లో ఉన్నదాని ప్రకారం, బానిసల ఎడల అక్రమంగా దౌర్జన్యం జరిగితే వారికి స్వేచ్ఛ కల్పించడం ఒక్కటే దాని ప్రాయశ్చిత్తం.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర) తన బానిసను కొట్టారు. అతని వీపు పైన దాని మచ్చ పడిపోయింది. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ అది చూసి 'బహుశా నేను నీకు బాధ కలిగించాను?' అని అన్నారు. దానికి అతను కాదని అన్నాడు. అప్పుడు ఆయన అతనితో. వెళ్ళు, ఇక నీవు స్వతంత్రుడివి అని పలుకుతూ నేలపై నుండి ఓ పుల్లనెత్తి దీనికి సమానంగా కూడా ఈ చర్య (బానిసకు స్వేచ్ఛ కల్పించడం)కు పుణ్య ఫలం లేదు, ఎందుకంటే ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

من لطم مملوكا او ضــــربه فكفــــارتـه ان يعتقه[1]

**ఎవరయితే తన బానిసను ముఖంపైన, లేదా మరో చోటనయినా కొట్టినట్లయితే దానికి ప్రాయశ్చిత్తం ఆ బానిసకు స్వేచ్ఛ కల్పించడం ఒక్కటే.**[2]

సవీద్ బిన్ మక్రన్ (ర) ప్రకారం, 'మాకు ఒక బానిస ఉండేది. దానికి మా వ్యక్తి ఒకతను లెంపకాయ కొట్టాడు. దైవసందేశహరులకు దాని సమాచారం అంది నప్పుడు, దానికి స్వేచ్ఛ కల్పించండి అని పురమాయించారు. జనులు; మా వద్ద మరో నౌకరు లేదు అని విన్నవించుకున్నారు;' దానికి ఆయన, 'ఆ బానిస అవసరం తీరిపోతే (లేదా ఆమెకు మారుగా మరో బానిస ఏర్పాటయితే) దానికి స్వేచ్ఛ కల్పించండి' అని అన్నారు.[3]

హజ్రత్ అబూ మస్ఊద్ అన్సారీ ప్రకారం, 'నేను నా బానిస వ్యక్తిని కొరడా దెబ్బలు కొడుతూ ఉండగా వెనకాల నుంచి ఎవరో అన్నారు, 'అబూ మస్ఊద్, బాగా గుర్తుంచుకో, అల్లాహ్‌కు నీపైన నీకు ఈ బానిసపై ఉన్నదాని కన్నా అధికంగా

---

1. నవవి; ముస్లిమ్ గ్రంథ వివరణ : 6వ సంపుటి, 11వ భాగం, పుట 111
2. ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్; ముస్నద్ అహ్మద్ : 61/2.
3. *ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్;*

అధికారముంది.' వెనక్కి తిరిగి చూస్తే దైవ సందేశహరులు (స) కనిపించారు. 'నేను కొరడా నేలపైన పడేశాను; ఇక దీనిపైన ఏ బానిసనూ ఎన్నడూ కొట్టను, ఈ బానిసకు నేడు 'స్వేచ్ఛనిస్తున్నాను' అని పలికాను. ఆయన (స), 'నీవు ఇతనికి స్వేచ్ఛ కల్పించకపోతే నరకాగ్ని నిన్ను ముట్టుకునేది' అన్నారు.[1]

హదీసులో బానిస పైన అబద్ధపు ఆరోపణ మోపడం, అతన్ని అప్రదిష్టపాలు చెయ్యడం పట్ల కఠినంగా అభిశపించడం జరిగింది. మహనీయ అబూ హురైరా (ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

من قذف مملوكه وهو بریء مما قال جلد يوم القيامة الا أن يكون كما قال

**ఎవరయితే తన బానిసపైన (వ్యభిచారం) అభియోగం మోపుతాడో, అభియోగం తప్పయినదయితే (అతను నిర్దోషి అయితే), ప్రళయ దినాన ఆ వ్యక్తికి కొరడా దెబ్బలు వేయబడతాయి; కాని బానిసపై మోపిన అభియోగం నిజమయినదయితే ఆ శిక్ష పడదు.**[2]

ఇమామ్ నవవి ప్రకారం, ఈ హదీసు ద్వారా ఒక వాదన ముందుకు వచ్చింది. బానిసపైన అపనిందమోపడం వల్ల కజ్ఫ్ శిక్ష అయితే విధించబడదు కాని ప్రభుత్వం నిర్ణయించే శిక్ష మరేదయినా విధించడం జరుగుతుంది.[3]

బానిసత్వపు సమస్య యుద్ధ ఖైదీలకు సంబంధించింది. ప్రస్తుత కాలంలో ఈ సమస్య తలెత్తకపోవచ్చు. బానిసత్వాన్ని ఇస్లామ్ పూర్తిగా అంతమొందించిన విషయం ఒక వాస్తవమే అయినా దాన్ని రాజకీయ పరిస్థితులపైన వదలివేయడం జరిగింది. బానిసల్ని విడుదల చెయ్యాలన్న ప్రేరణ కల్పించింది. మకాతిబత్ విధానాన్ని ప్రవేశ పెట్టింది (అన్ నూర్ సూరా : 33). ఇందులో బానిసలు వారి యజమానుల మధ్య ఒప్పందం జరుగుతుంది. బానిస ఓ నిర్ణీత ధనం చెల్లించి స్వేచ్ఛను సంపాదించు కుంటాడు. ఇంకా మనిషి తన మరణానంతరం తన బానిసకు స్వేచ్ఛ కల్పించే

1. ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్, అబూ దావూద్: కితాబుల్ అదబ్.
2. బుఖారి : కితాబుల్ హుదూద్; ముస్లిమ్: కితాబుల్ ఈమాన్.
3. నవవి: ముస్లిమ్ గ్రంథ విశదీకరణ, సం. 6; భా. 11, పు. 119

అధికారమూ ఉంది. ఇంకా కొన్ని పాపాలు, అపరాధాలకు ప్రాయశ్చిత్తంగా కూడా బానిసల్ని విడుదల చేసే అవకాశం కల్పించడం జరిగింది. పొరపాటుగా ఎవరి నయినా హత్యచెయ్యడం (అన్ నిసా : 92); ప్రమాణభంగం (అల్ మాఇద:89); భార్యను తల్లిగా నిర్ణయించి తిరిగి భార్యగా స్వీకరించడం (అల్ ముజాదల : 3). ఈ చర్యలన్నీ తీసుకున్న తరువాత కూడా బానిసలు మిగిలి ఉన్నట్లయితే వారి పట్ల ఉత్తమంగా వ్యవహరించాలని తాకీదు చెయ్యడం జరిగింది. అతనిపైన మోయలేని భారం వెయ్యరాదని పురమాయించడం జరిగింది. బానిసల హక్కులు నిర్ణయించ బడ్డాయి. వారి బాధ్యతల్ని విశదీకరించడమూ జరిగింది.

పైన పేర్కొన్న హదీసులు మౌలికంగా బానిసలకు సంబంధించినవి. కాని వాటి వెలుగులో ఉద్యోగులు, శ్రామికులు, ఇంకా క్రింద పని చేసే వర్గాలకు సంబంధించిన నియమాలు క్రింది విధంగా ఏర్పరచుకోవచ్చు.

1. ఉద్యోగుల వేతనం, కనీసం వారి ప్రాథమిక అవసరాలు తీరే విధంగాఉండాలి.
2. యజమానికి, తన నౌకరులను కొట్టే అధికారం లేదు. లేదా అతన్ని శారీరక యాతనకు గురిచేసే హక్కులేదు. అతని వల్ల ఈ తప్పు జరిగితే దానికి నష్ట పరిహారం చెల్లించవలసి ఉంటుంది.
3. తన నౌకరుపైన అపనిందలు మోపి అతన్ని అప్రతిష్ఠపాలు చెయ్యడమయినా, దాని సాకుతో అతన్ని ఉద్యోగం నుంచి తీసివెయ్యడమయినా యజమానికి తగదు.

## అగత్యపరులు, నిరుపేదల పట్ల సద్వర్తనం - వారి హక్కులు

దివ్యఖుర్ఆన్‌లో నిరుపేదలు, అగత్యపరుల సహాయానికి మాటిమాటికీ పురికొలుపడం జరిగింది. వారి పట్ల అశ్రద్ధ చూపడాన్ని, వారి పట్ల అన్యాయం అక్ర మంగా ప్రవర్తించడాన్ని వారించింది. (ఉదాహరణకు, అల్ బలద్ : 16). దివ్య ఖుర్ఆన్‌లో సద్వర్తనం గురించి ప్రస్తావన వచ్చినప్పుడు తల్లిదండ్రులు, బంధువులతో పాటు సర్వసాధారణంగా నిరుపేదల్ని సయితం ప్రస్తావిస్తుంది. (అన్ నిసా: 36; బనీ ఇస్రాయీల్: 26). ఒక చోట, వారసత్వపు సొమ్ము విభజించినప్పుడు ఏ బంధువుల కయితే వారసత్వంలో వాటా ఉండదో వారినీ, అనాథలనూ, నిరుపేదలను ప్రత్యేకంగా

గుర్తుంచుకోవాలి. (అన్ నిసా : 8) ఎవరయితే నిరుపేదలు, అగత్యపరుల ఆకలి దప్పులను గురించి బీదరికం గురించి పట్టించుకోరో, వారి పట్ల సహకారం, సాను భూతి వైఖరినవలంబించరో అటువంటి వారిని తీవ్రంగా ఖండించడం జరిగింది. వారికి నరక ప్రాప్తిని గురించిన దుర్వార్తను వినిపించడం జరిగింది. (అల్ హాక్క : 34; అల్ ఫజ్ర్ : 14; అల్ మాఊన్ : 3). హదీసుల్లో వివిధ రీతుల్లో అగత్యపరులు, నిరు పేదల పట్ల సద్వర్తన కలిగి ఉండాలని ప్రేరేపించడం జరిగింది. హజ్రత్ అనస్ (ర) ఉల్లేఖనంలో దైవ సందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు:

**من اغاث ملهوفا كتب الله له ثلثا و سبعين مغفرة واحدة منها صلاح امره كله وثنتان و سبعون له درجات يوم القيامة**[1]

**ఏ వ్యక్తి బాధిత వ్యక్తిని ఆదుకుంటాడో పరమ ప్రభువు అతని ఆచరణ పత్రంలో డెబ్బయ్యేడు సత్కార్యాల పుణ్యఫలం వ్రాసి పెడతాడు. వాటిలో ఒక్క దానికి ఫలంగా అతని సకల కార్యాలు సవ్యమయి పోతాయి. మిగతా డెబ్బయి రెండు ప్రళయ దినాన అతని స్థాయిని పెంచడానికి ఉపయోగపడతాయి.**[1]

హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం, ఒక వ్యక్తి వచ్చి ప్రవక్త మహ నీయుల (స)కు తనలోని హృదయకాఠిన్యతను గురించి విన్నవించుకున్నాడు, దానికి చికిత్సగా ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

**اطعم المسكين وامسح رأس اليتيم**[2]

**నిరుపేదలకు భోజనం పెట్టు, అనాథల తల నిమురు (అండగా నిలువు), (నీ హృదయకాఠిన్యం దూరమవుతుంది).**[2]

హదీసులో నిరుపేదలు, అగత్యపరుల పట్ల ప్రేమగా వ్యవహరించాలని కూడా ఆదేశించడం జరిగింది. ప్రేమ లేకపోతే సేవ కూడా సాధ్యపడదు. వారి పట్ల ప్రేమగా వ్యవహరించేవారే ఉత్తమ రీతిలో వ్యవహరించనూ గలరు. హజ్రత్ అబూజర్ (ర) ఇలా ఉటంకించారు:

1. మిష్కాతుల్ మసాబీహ్ : కితాబుల్ ఆదాబ్.
2. ముస్నద్ అహ్మద్ : 139/6.

امرنی خلیلی صلی الله علیه وسلم بسبع امرنی بحب المساکین والد نومنهم[۲]

**నా ప్రియతమ సందేశహరులు (స) నాకు ఏడు విషయాలను గురించి ఉపదేశించారు : (వాటిలో ఒకటి) నేను నిరుపేదల ఎడల ప్రేమగా వ్యవహరించాలని వారికి సన్నిహితంగా మెలగాలని ఆయన ఆదేశించారు.**[1]

దైవ సందేశహరులకు స్వయంగా నిరుపేదల ఎడల గల ప్రేమ సానుభూతి, అనురక్తి ఆయన (స) చేసిన ఒక దుఆ (ప్రార్థన) ద్వారా వెల్లడి అవుతుంది. ఆయన ఇలా దుఆ చేశారు:

اللهم احیینی مسکینا و امتنی مسکینا واحشرنی فی زمرة المساکین

**అల్లాహ్, నన్ను నిరుపేదగానే బ్రతుకనివ్వు, నిరుపేదగానే మృత్యువునివ్వు, నిరుపేదల వర్గంలోనే తిరిగి లేపు.**

ఈ విధంగా దుఆ చేయడానికి కారణం అడిగారు హజ్రత్ ఆయిషా (ర). దానికి ఆయన (స), 'నిరుపేదలు, సంపన్నులకన్నా నలభయేళ్ళ మునుపే స్వర్గంలోకి ప్రవేశిస్తారు' అని సెలవిచ్చి ఇలా ఉపదేశించారు:

یا عائشة احبی المساکین و قربیهم فان الله یقربک یوم القیٰمة[۳]

**ఆయిషా, నిరుపేదల పట్ల ప్రేమ కలిగి మెలుగు, వారిని దగ్గర చేర్చుకో; అల్లాహ్ నిన్ను ప్రళయ దినాన తనకు చేరువగా చేసుకుంటాడు.**[2]

ఇస్లామ్, ఈ నైతిక బోధనలతోపాటు నిరుపేదలు, అగత్యపరుల సంక్షేమం కొరకు విభిన్న పద్ధతులు ప్రవేశపెట్టింది.

1) కొన్ని ఆరాధనలలో కొరత ఏర్పడితే దాన్ని తీర్చడానికి పరిహారం ప్రతిపాదించబడింది. ఒకటి, నిరుపేదలకు అన్నం పెట్టడం. అలాగే కొన్ని తప్పిదాలకు పరిహారంగానూ నిరుపేదలకు భోజనం పెట్టడాన్ని ప్రతిపాదించడం జరిగింది.

---

1. *ముస్నద్ అహ్మద్ : 159/5.*
2. *మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ రికాక్. (తిర్మిజి, బైహకీ)*

2) యుద్ధ ప్రాప్తిలో నిరుపేదలు, అగత్యపరుల వాటా కూడా కేటాయించడం జరిగింది. *(అల్ అన్ఫాల్ : 41)*

3) జకాత్ ఖర్చుపెట్టే పద్దుల్లో మొట్ట మొదటి పద్దు నిరుపేదలు అగత్యపరులదే. *(అత్ తౌబా : 60)*

నిరుపేదలు, అనాథలను ఆర్థికంగా పైకి లేవనెత్తడానికి ధర్మబద్ధమయిన పరిధుల్లో వ్యక్తి చేసే కృషితోపాటు 'రాజ్యం' (ఇస్లామీయ ప్రభుత్వం) తీసుకునే చర్యలు అన్నీ ఇస్లామీయ బోధనలకనుగుణంగా, దాని దిశానిర్దేశనలకనుగుణంగానే ఉంటాయి.

## బలహీనుల ఎడల సద్వర్తనం, వారి హక్కులు

శారీరకంగా బలహీనుడయిన వ్యక్తి ఆర్థిక కార్యకలాపాలలో సాధారణంగా వెనుకబడి ఉంటాడు, ఇతరుల సహాయార్థి అయి ఉంటాడు. ఎవరయినా సరే ఇటువంటి వ్యక్తికి సంతోషంతో సేవ చేయడానికి ఇష్టపడరు, ఇతన్ని ఓ భారంగానే పరిగణిస్తారు. హదీసుల్లో ఇటువంటి మనస్తత్వాన్ని సంస్కరించడం జరిగింది. 'మీకు ఇక్కడ లభించేదల్లా ఈ బలహీనులు, నిస్సహాయుల వల్లనే ప్రాప్తమవుతుంది. అందు వల్ల వారికి ఉపకారం చేస్తున్నట్లు ఎత్తిపొడవకండి, వీరికి చేసే సద్బుద్ధీ అవకాశం మీకు కల్పించినందుకు దైవానికి కృతజ్ఞతలర్పించుకోండి. పరమ ప్రభువు అల్లాహ్ నిజానికి ఈ బలహీనులకే ఉపాధి కల్పించాలని కోరుకుంటాడు. కాని తన విజ్ఞత, ఔచిత్యాలననుసరించి ఆయన మిమ్మల్ని ఆ ఉపాధికి మార్గంగా ఏర్పరిచాడు. మీరు ఈ విషయంలో ఏమరుపాటు, లోపం రానిస్తే మధ్యలో మిమ్మల్ని మార్గంగా ఏర్పరచడం వదలి ఇతరుల్ని ఈ సేవకు ఎన్నుకుంటాడు.'

హజ్రత్ సఅద్ బిన్ అబీ వక్కాస్ (ర) దాన ధర్మాలలోనూ ధైర్యశౌర్యాల్లోనూ బాగా వినుతికెక్కినవారు. ఆయనగారి కుమారుడు ముస్అబ్ బిన్ సఅద్ (ర) ప్రకారం, హజ్రత్ సఅద్ (ర)కు ఓ అభాసు కలిగింది. ఇతరుల సమక్షంలో తనకు ఏదో ప్రత్యేకత ఉంది. తాను ఇతరులకన్నా ఉత్తమమయినవాడు (బహుశా, తన సేవల వల్లనే తనకు యుద్ధ ప్రాప్తిలో ఇతరులకన్నా అధికంగా వాటా ఇవ్వటం జరుగుతుందని కూడా ఆయన భావించి ఉంటారు). దీనికి దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు:

**هل ترزقون و تنصرون الا بضعفائكم**[1]

**నీకు నీ బలహీనుల కారణంగా (అధిక) ఉపాధి ఇవ్వబడుతోంది, ఆ కారణంగానే సహాయమూ చేయబడుతుంది.**[1]

1. *బుఖారి : కితాబుల్ జిహాద్.*

ఈ ఉల్లేఖనం ఈ పదాలలోనూ వచ్చింది:

انما ينصر الله هٰذه الامة بضعيفها بدعوتهم و صلوٰتهم واخلاصهم[٢]

**పరమ ప్రభువు అల్లాహ్ ఈ సముదాయానికి ఇందులోని బలహీనుల కారణంగా సహాయం అందజేస్తాడు - వారి ప్రార్థనలు, ఆరాధనలు, వారి చిత్తశుద్ధి కారణంగా.**[1]

ఇందులో ఉన్న సంకేతం కేవలం వ్యక్తులకే వర్తించదు, సమస్త సముదాయానికీ వర్తిస్తుంది. వారికి ఆధిక్యత విజయాలు ప్రాప్తమయినట్లయితే దాని యోధులు, వీరులు, శూరులు విర్రవీగరాదు. తమ వల్ల ఈ ఘనకార్యం సాధ్యమయిందని భ్రమలకు లోనవరాదు. తాము సమాజంలోని బలహీనులు, అశక్తులయిన వారికన్నా ఉన్నత స్థానం గలవారమని ఊహించుకోరాదు. ఆ బలహీనుల స్థానం దైవం దృష్టిలో బహు ఉన్నతమయిందని తెలుసుకోవాలి. తమకు ప్రాప్తమయిన సఫలత వారి వేడుకోళ్ళు, ప్రార్థనల వల్లనే సాధ్యమయిందని గ్రహించాలి. మహనీయ అబూ దర్దా (ర), తాను ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవీయగా విన్నానని చెప్పారు:

ابغونى الضعفاء فانما ترزقون و تنصرون بضعفائكم [٣]

**బలహీనుల్ని వెదికి నా వద్దకు తీసుకురండి, ఎందువల్లనంటే మీకు ఈ బలహీనుల వల్లనే ఉపాధి ఇవ్వబడుతుంది, సహాయమూ చెయ్యబడుతుంది.**[2]

మరో ఉల్లేఖనంలో ఈ పదాలూ ఉన్నాయి:

ابغونى فى ضعفائكم فانما ترزقون و تنصرون بضعفائكم[١]

**నన్ను మీలోని బలహీనులలో అన్వేషించండి. ఎందుకంటే మీకు మీలోని ఈ బలహీనుల వల్లనే ఉపాధీ కల్పించబడుతుంది, సహాయమూ చెయ్యబడుతుంది.**[3]

భావమేమిటంటే, బలహీనుల్ని వెదకండి, వారికి వారి హక్కును అప్పజెప్పడానికి; మీరు వారిని భోజన పానీయాలు పెడుతున్నామని తలచకండి, మీకు ఇవ్వబడేదేమయినా అది వారి వల్లనే ప్రాప్తమవుతుంది. దైవ సందేశహరులు (స) స్వయంగానూ

---

1. నసాయి : కితాబుల్ జిహాద్.
2. అబూ దావూద్ : కితాబుల్ జిహాద్; నసాయి : కితాబుల్ జిహాద్.
3. తిర్మిజి : అబ్వాబ్ ఫజాయిలుల్ జిహాద్.

అనునిత్యం బలహీనులను కనిపెట్టుకు ఉండేవారు. అందువల్లనే అన్నారు: నేను మీకు బలహీనులు అశక్తులలోనే లభిస్తానని, నన్ను వెదకాలనుకుంటే వారి మధ్యనే వెదకండి. నన్ను మీరు, ధనవంతులు, శ్రీమంతులు, ఉన్నవారి మధ్య కానలేరు.

ఇస్లామ్ ఎటువంటి మనస్తత్వం సృజించగోరుతుందో వాస్తవానికి అది పుట్టినట్లయితే మనిషి బలహీనులు, అశక్తులకు ఏదయినా సానుభూతి చూపి, సహాయం చేసి దాన్ని ఉపకారంగా భావించడు. అది తన విధిగా భావిస్తాడు. వారి హక్కును నిర్వర్తించినప్పటికీ, అతనికి నిత్యం అందులో లోపమున్నట్లే అనుభూతి కలుగుతూ ఉంటుంది.

దివ్యఖుర్ఆన్‌లో విశ్వసించినవారి ఒక ఉన్నత గుణాన్ని ప్రస్తావిస్తూ వారి సంపదలో అడిగేవారి, ఉపేక్షితుల వాటా ఉంటుందిన వక్కాణిస్తుంది:

وَ فِيْٓ اَمْوَالِهِمْ حَقٌّ لِّلسَّآئِلِ وَالْمَحْرُوْمِ (الذاريات:١٩)

**వారి సంపదల్లో అడిగేవారి, ఉపేక్షితుల వాటా ఉంటుంది.** ***(అజ్జారియాత్ : 19)***

మరో చోట వారి సంపదలో ప్రశ్నించేవారికీ, ఉపేక్షితులకూ నిర్ణీతమయిన వాటా లభిస్తుందని ఉంది:

وَ فِيْٓ اَمْوَالِهِمْ حَقٌّ مَّعْلُوْمٌ ۝ لِّلسَّآئِلِ وَالْمَحْرُوْمِ ۝ (المعارج:٢٤-٢٥)

**వారి సంపదల్లో ప్రశ్నించేవారికీ, ఉపేక్షితులకూ నిర్ణీతమయిన హక్కు ఉంటుంది.** ***(అల్ మఆరిజ్ : 24, 25)***

ప్రశ్నించేవారంటే ఉద్దేశ్యం, తన అవసరాలను గురించి చెప్పుకునేవాడు, సహాయం కొరకు చెయ్యిచాచేవాడు. ఉపేక్షితుడంటే అర్థం, ఉపాధి మార్గాలు లేకపోయి నప్పటికీ ప్రశ్నించి చెయ్యిచాచనివాడు అన్న మాట. ప్రశ్నించేవాడు, ఉపేక్షితుల్లో వృద్ధులు, వ్యాధిగ్రస్తులు, వికలాంగులు, కుంటివారు, తొంటివారు, అనాథ బాలురు, ఇంకా ఇటువంటి వారందరూ చేరి ఉన్నారు. వీరిలో కొందరు తమ అవసరాలను తెలిపి సహాయాన్ని అర్థించేవారుంటారు, మరికొందరు తమ బీదరికం, లేమిని గురించి ప్రస్తావించడం సహాయాన్నర్థించడం ఇష్టపడని వారూ ఉంటారు. ఒక విశ్వాసి సొమ్ములో వీరందరి హక్కు తప్పనిసరిగా ఉంటుంది. వీరి ఆవశ్యకతల్ని లేమిని అంతమొందించడం ప్రభుత్వ బాధ్యత కూడా.[1]



1. బలహీనులయిన వ్యక్తులు వర్గాల హక్కుల మరిన్ని వివరాల కొరకు రచయిత పుస్తకం 'ఇస్లామ్‌లో సంఘసేవ భావన' (ఉర్దూ) అనే పుస్తకాన్నీ చదవండి.

# 6. వికలాంగుల నైతిక, శాసనపరమయిన హక్కులు[1]

పరమ ప్రభువు అల్లాహ్ ఎవరిని సంపూర్ణ ఆరోగ్యవంతునిగా అంగసౌష్టవంతో సృష్టించాడో అతనిపైన ఆయన మహోపకారం జరిగిందన్నమాట. మనోమస్తిష్కాలు, కళ్ళూ చెవులు, నోరూ ముక్కు, కాళ్ళూ చేతులు అన్నీ సామాన్యంగా అందరికీ సవ్యంగా అనుగ్రహించాడాయన. అయితే ఈ ప్రపంచంలో, వీటిలో ఏదో ఒక వరప్రసాదం పొందనివారూ ఉన్నారు. ఇస్లామ్ వారిలో ధైర్యసాహసాలను సృష్టించింది. షరీఅత్ ఆదేశాలలో వారి కొరకు రాయితీ ఇవ్వడం జరిగింది. దీనితోపాటు వారి సేవ కొరకు, వారిని ప్రోత్సాహపరచడానికి, వారి పట్ల సానుభూతికి దైవం తన కృప వల్ల శారీరక మానసిక వరప్రసాదాలను పొందినవారిని పురికొలిపి అది వారి ధార్మిక, నైతిక బాధ్యత అని నిర్ణయించింది.

## సహనం వహించాలన్న ఉపదేశం

మొట్టమొదట ఇస్లామ్, స్వయంగా వికలాంగులయిన వారిని సహనం వహించాలని ఉపదేశించింది. అల్లాహ్ మనిషిని విభిన్న రీతుల్లో పరీక్షిస్తాడని తెలుపుతూ మిమ్మల్ని వికలాంగులుగా సృష్టించి పరీక్షించడం జరుగుతోందని, దీనికి సహనం వహిస్తే ప్రతిఫలం పొందగలుగుతారని, దైవ నిర్ణయాన్ని నిండుగుండెతో స్వీకరిస్తే అల్లాహ్ ప్రసాదించే బహుమానాలకు అర్హతను అందజేస్తుందని, దాని మీద రుసరుసలాడితే నింద వచనాలను వెల్లడిస్తే ఫలం మాత్రం దక్కదు, ఏ లోటు కూడా తీరదు. అయితే మనిషి, సహనం వల్ల ప్రాప్తమయ్యే ప్రతిఫలానికీ పుణ్యఫలానికీ నోచుకోకుండా పోతాడు.

హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (ర) ఉల్లేఖనం ప్రకారం దైవసందేశహరులు (స) అల్లాహ్ తెలిపినట్లు ఇలా నుడివారు:

---

1. *బలహీనులయిన వ్యక్తులు, వర్గాల విషయంలోపలే వికలాంగుల (Handicaped) వ్యక్తులూ వస్తారు. ఇస్లామ్ వారి విషయంలో చాలా వివరమయిన ఆదేశాలిచ్చింది. ఇక్కడ వారిని గురించి ప్రత్యేకంగా ప్రస్తావించడం జరుగుతోంది.*

اذا ابتليتُ عبـدى بحبيبتيه فصبر عوَّضته منهما الجنة يريد عينيه[1]

**నేను నా దాసుని అతని రెండు ప్రియమయిన పదార్థాల ద్వారా పరీక్షించినప్పుడు అతను సహనం వహిస్తే నేను వాటికి బదులుగా అతనికి స్వర్గం అనుగ్రహిస్తాను. రెండు ప్రియమయిన పదార్థాలంటే ఆయన రెండు కళ్ళని ఉద్దేశించారు.[1]**

హజ్రత్ అబూ హురైరా ఉటంకించిన ఉల్లేఖనం ఈ పదాలలో ఉంది:

من اذهبتُ حبيبتيه فصبر و احتسب لم ارض له ثوابا الا الجنة[2]

**ఏ వ్యక్తి నుండి అతని రెండు ప్రియమయిన పదార్థాలను (కళ్ళను) నేను తీసుకుంటానో అతను సహనం వహించి ప్రతిఫలాన్ని అర్థిస్తూ ఉంటే నేను అతని కొరకు స్వర్గం తప్ప మరే ప్రతిఫలాన్నీ ఇష్టపడను.[2]**

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ ఉల్లేఖనం ప్రకారం ఒక స్త్రీకి మూర్ఛ రోగం వచ్చేది. ఆమెకు ఆ రోగం వచ్చినప్పుడు తన బట్టల స్పృహ కూడా ఉండేది కాదు. ఆమె ప్రవక్త మహనీయుల (స) వద్దకు వచ్చి వేడుకోలుకు అభ్యర్థించింది. 'నీవు కోరితే నేను దుఆ చేస్తాను (అల్లాహ్ నీకు నివారణ కల్పిస్తాడని ఆశిస్తున్నాను) లేదా నీవు సహనం వహించగోరితే అదీ మంచిదే. అల్లాహ్ దానికి బదులుగా నీకు స్వర్గప్రాప్తిని కల్పిస్తాడు' అని ఆయన (స) పలికారు. దానికి ఆవిడ ఇలా బదులిచ్చింది, 'అలా అయితే నేను సహనమే వహిస్తాను కాని రోగం వచ్చినప్పుడు నా ఆచ్ఛాదన తప్పిపోకుండా ప్రార్థన చేయండి.' ఆయన(స) తదనుగుణంగా దుఆ చేశారు.[3]

ఆ స్త్రీ ప్రార్థనకు వేడుకుంది. ఆయన (స) ఆమె అభ్యర్థనను కాదననయితే అనలేదు. కాని సహనంలో గల ఘనతను వివరించారు. దాన్ని ఉపదేశించారు. ఆవిడ విషయంలో ఆయన ఇదే ఉత్తమమని భావించి ఉండవచ్చు. అయితే ఈ విషయం తెలుసుకునే మరో మార్గం మన వద్ద ఏదీలేదు. ఇందులో ప్రార్థనను కాదనలేదు. ఒక వికలాంగి లేదా వ్యాధిగ్రస్తుడు తన అశక్తత దూరం కావాలని దైవాన్ని ప్రార్థించనూ వచ్చు, ఇతరులచేత ప్రార్థన చేయించనూ వచ్చు. అలాంటి వారు సతతం తమ మేలు కొరకు దుఆ చేస్తూనే ఉండాలి. అయితే ఒక విషయం నిత్యం మరచిపోకుండా

1. బుఖారి : కితాబుల్ మరజా. 2. తిర్మిజీ : అబ్వాబుజ్జుహ్ద్.
3. బుఖారి: కితాబుల్ మరజా; ముస్లిమ్: కితాబుల్ బిర్ర వస్సిలా

గుర్తుంచుకోవాలి, అల్లాహ్ కోరితే, ఆ దుఆ అతని విషయంలో ఫలించడం ప్రయోజన కరమని భావిస్తే ఆ దుఆ స్వీకరించబడుతుంది లేకపోతే లేదు. అతను ఎట్టి పరిస్థితి లోనూ అల్లాహ్ నిర్ణయం పట్ల సంతుష్టుడయి ఉండాలి, సంతృప్తి చెంది మెలగాలి, సహనాన్ని ఎప్పటికీ విడనాడరాదు. హదీసుల్లో సహనంతోపాటు దుఆ చెయ్యాలన్న ఉపదేశమూ ఉంది.

హజ్రత్ ఉస్మాన్ బిన్ హనీఫ్ ఇలా ఉల్లేఖించారు: ఒక చూపులేని వ్యక్తి దైవసందేశహరుని వద్దకు వచ్చి అల్లాహ్ తనకు కళ్లు వచ్చేలా చెయ్యాలని తనకు క్షేమం కలగజెయ్యాలని దుఆ చేయండని అర్థించాడు. ఆయన, 'నీవు కోరితే నేను అలాగే దుఆ చేస్తాను. కాని నీవు సహనం వహించినట్లయితే అదే నీకు మేలు' అని బోధిం చారు. కాని అతను మళ్ళీ అభ్యర్థించాడు దుఆ చెయ్యమని. అప్పుడు ఆయన "సరే అయితే నీవు వుజూ చేసి ఈ దుఆ చెయ్యి" అని అన్నారు:

**اللهم انی اسألک و اتوجه الیک بنبیک محمد نبی الرحمة انی توجهت بک الی ربی لیقضی لی فی حاجتی اللهم فشفعه فیّ**[1]

**అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక, వ అత వజ్జహు ఇలైక, బినబియ్యిక, ముహమ్మదన్ నబియిర్రహ్మా, ఇనీ తవజ్జహత్ బిక ఇలా రబ్బీ : లియఖ్జీలీ ఫీహాజతీ; అల్లాహుమ్మ ఫషఫఅహు ఫీయ్యి.**

**అల్లాహ్, నేను నిన్ను అర్థిస్తున్నాను. నీ ప్రవక్త ముహమ్మద్, కారుణ్య ప్రవక్త అయిన ఆయన అండగా నీ వైపునకు మరలుతున్నాను. నేను ఆయన ద్వారా నా ప్రభువు వైపునకు ఏకాగ్రచిత్తంతో మరిలాను. ఆయన నా అవసరాన్ని తీర్చాలని. అల్లాహ్ నా విషయంలో నీవు ఆయన సిఫారసును స్వీకరించు.**[1]

వికలాంగి తనలోని కొరత వల్ల తీవ్రంగా భావుకుడయి ఉంటాడు. అతని పైన నిరాశ నిస్పృహలు ఆవహించి ఉంటాయి. అతనికి పరిస్థితుల్ని ఎదుర్కొనే శక్తి ఉండదు. అందువల్ల సహనం అతని విషయంలోబహుప్రముఖమయింది. దాని వల్ల అతనికి ఊరట కలుగుతుంది, నెమ్మది నెలకొంటుంది, ప్రశాంతత ఏర్పడుతుంది. నేడు తాను ఒక వరప్రసాదాన్ని కోల్పోయి ఉన్నా రేపు దైవ సాన్నిధ్యంలో తనకు దానికి బదులుగా ఉత్తమమయిన బహూకృతి ప్రదానమవుతుందన్న నమ్మకం ఏర్పడుతుంది. సహనం అతన్ని దైవం సమక్షంలో తనకు లేని దాన్ని గురించి వాపోయే, నిందలు మోపే అల్పత్వాన్నుంచి కాపాడుతుంది. ఒక విశ్వాసిలోని గొప్పదనం ఏమిటంటే,

1. తిర్మిజీ, కితాబుద్దావాత్స

అతను దైవప్రసన్నత పట్ల ప్రసన్నుడయి ఉంటాడు. ఆ ఉత్తమ గుణం జీవితంలో ప్రతి సంక్లిష్ట సమయంలోనూ ఉపయోగపడుతుంది. దాని వల్ల అతను నిలకడ కలిగి ఉంటాడు. సహనం అంటే, మనిషి వివశుడయి మూర్తీభవించిన అశక్తుడయి నిలువడం కాదు. సహనం అంటే స్థిరచిత్తంతో ధైర్యశౌర్యాలు చూపడం. నిలకడ కలిగి ఉండటం. సహన గుణం ఒక వికలాంగి అయిన వ్యక్తిలోనూ సాహసం, ధీమాను సృజిస్తుంది. అతను ధైర్యం విడనాడి కూర్చుండి పోకుండా, పరిస్థితుల్ని ఎదుర్కొని పోరాడేలా, సంఘర్షణ జరిపేలా, జీవన సమరంలో తన పాత్రను కడు ధైర్యంగా నిర్వర్తించేలా చేస్తుంది.

## బాధ్యతల్లో తగ్గుదల

వికలాంగి అయిన వ్యక్తికి ఒక భావం నిత్యం బాధిస్తూ ఉంటుంది. తాను దైవధర్మ సేవ చేయడం సాధ్యం కావడం లేదు, ఇతరులు చేస్తున్న రీతిలో తన వల్ల సేవ జరగటం లేదు అన్న భావన అతన్ని ఆందోళనకు గురిచేస్తుంది. ఇస్లామ్ అతనికి ఈ విషయంలో బాధపడవద్దని అభయమిస్తుంది. అల్లాహ్ ప్రతి వ్యక్తి పైన అతని శక్తి మేరకే భారం మోపాడని ధైర్యం పలుకుతుంది. ఇంకా శరీర పుష్టిగల వారికీ అంగ సౌష్టవంగలవారికీ మోపే పనులన్నింటి భారం అతనిపైన మోపడం జరగదని చెబుతుంది. ఇస్లామ్‌లో సత్య ధర్మం కొరకు సతత సమరం (జిహాద్) జరపడం పట్ల అత్యంత మహత్తుగలదు. కొన్ని సందర్భాలలో ఇస్లామీయ రాజ్యం దాని పౌరులందరి పైనా దాన్ని విధిగా నిర్ణయించనూ వచ్చు. ఇటువంటి పరిస్థితుల్లో ఎవరయినా ఈ మహత్కార్యం పట్ల నిరాసక్తి చూపడం మహా పాపంగా పరిగణించబడుతుంది. అయితే ఇటువంటి సందర్భంలోనూ వికలాంగికి దీని విషయంలో వినాయింపు ఉంటుంది. కాగా జిహాద్ (సతత సమరం)కు సంబంధించిన ఆదేశాలలో ఇలా సెలవీయడం జరిగింది:

لَيۡسَ عَلَى الۡاَعۡمٰى حَرَجٌ وَّلَا عَلَى الۡاَعۡرَجِ حَرَجٌ وَّلَا عَلَى الۡمَرِيۡضِ حَرَجٌ ؕ وَمَنۡ يُّطِعِ اللّٰهَ وَ رَسُوۡلَهٗ يُدۡخِلۡهُ جَنّٰتٍ تَجۡرِىۡ

**గుడ్డివాడు, కుంటివాడు, వ్యాధిగ్రస్తుడు- (జిహాద్‌లో పాల్గొనకపోయినా) వారికి పాపం లేదు. మరే వ్యక్తి అల్లాహ్, ప్రవక్తల ఆజ్ఞాపాలన చేస్తాడో అతన్ని అల్లాహ్ స్వర్గాలలో ప్రవేశింపజేస్తాడు. వాటి దిగువన కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. మరెవ**

مِنْ تَحْتِهَا الْاَنْهٰرُ ۚ وَمَنْ يَّتَوَلَّ يُعَذِّبْهُ عَذَابًا عَظِيْمًا ○ (الفتح:١٧)

రయితే విముఖుడవుతాడో అతనికి వ్యధా భరితమయిన శిక్ష పడుతుంది.

***(అల్ ఫత్హ్ : 17)***

ఒకచోట ఖుర్ఆన్, దైవ మార్గంలో సతతం కృషి సలిపేవారు, కృషి సలపని వారు ఒక్కటి కారని చెప్పింది. కృషి సలిపేవారి స్థానాలు ఉన్నతమయినవని వక్కాణించింది. దానితోపాటు ఈ సూత్రప్రాయమయిన విషయంలో అంగ వికలురకు వినాయింపు ఉందనీ ప్రకటించింది. ఇలా సెలవిచ్చింది:

لَا يَسْتَوِى الْقٰعِدُوْنَ مِنَ الْمُؤْمِنِيْنَ غَيْرُ اُولِى الضَّرَرِ وَالْمُجٰهِدُوْنَ فِىْ سَبِيْلِ اللّٰهِ بِاَمْوَالِهِمْ وَ اَنْفُسِهِمْ ؕ فَضَّلَ اللّٰهُ الْمُجٰهِدِيْنَ بِاَمْوَالِهِمْ وَاَنْفُسِهِمْ عَلَى الْقٰعِدِيْنَ دَرَجَةً ؕ وَكُلًّا وَّعَدَ اللّٰهُ الْحُسْنٰى ؕ وَ فَضَّلَ اللّٰهُ الْمُجٰهِدِيْنَ عَلَى الْقٰعِدِيْنَ اَجْرًا عَظِيْمًا ○ دَرَجٰتٍ مِّنْهُ وَ مَغْفِرَةً وَّرَحْمَةً ؕ وَّكَانَ اللّٰهُ غَفُوْرًا رَّحِيْمًا ○ (النساء:٩٥-٩٦)

ముస్లిముల్లో ఎవరయితే ఏ అశక్తత, ఏ కారణమూ లేకుండా ఇంట కూర్చుండి పోతారో మరెవరయితే దైవమార్గంలో ధనప్రాణాలతో పోరాడతారో వీరుభయుల స్థాయి సమానమయినది కాదు. అల్లాహ్, కూర్చుండిపొయ్యే వారికి ప్రతిగా ధన ప్రాణాలతో పోరాడే వారి స్థాయిని ఒక ఎత్తు పెంచే ఉంచాడు. ఇంతకూ ప్రతి ఒక్కరికీ మేలు చేసే వాగ్దానమే అల్లాహ్ చేసి ఉన్నప్పటికీ (పోరాడే) ముజాహిద్‌ల సేవలకు ఆయన సన్నిధిలో ప్రతిఫలం, కూర్చుండిపోయే వారికన్నా మహా గొప్పది. వారి కొరకు అల్లాహ్ తరఫున ఉన్నత స్థానాలు, మన్నింపు, కారుణ్యం లభిస్తాయి. అల్లాహ్ ఎంతో మన్నించేవాడు, మరెంతో కరుణించేవాడూను. ***(అన్ నిసా: 95, 96)***

ఈ ఆయత్‌లలో అంగవికలురను వేరుగా ప్రస్తావించి, అంగవికలురు కాని వారు, ఆరోగ్యవంతులయిన వ్యక్తుల మధ్య బేరీజువేసి చూపడం జరిగింది. ఇందులో ఓ సంకేతముంది. ఎవరిలోనయినా చిత్తశుద్ధి ఉండి, దైవమార్గంలో ధన ప్రాణాలు ధారపోసే సద్భావన ఉన్నట్లయితే, అతను కేవలం తన అశక్తత, అంగ వైకల్యం కారణంగా అందులో పాల్గొనలేకపోతూ ఉన్నట్లయితే అల్లాహ్ అతనికీ సతత సమరం

సలిపే ముజాహిద్‌ల పుణ్యఫలమే ప్రసాదిస్తాడన్నది ఆ సంకేతం. హదీసుల్లో ఈ విషయం మరింత విడమర్చి తెలుపడం జరిగింది.

హజ్రత్ అనస్ (ర) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు (స) ఒక గజ్వా (యుద్ధం)లో ఇలా సెలవిచ్చారు:

ان اقواما خلفنا ما سلكنا شعبا و لا واديا الا وهم معنا حبسهم العذر

నిస్సందేహంగా మన వెనకాల కొందరు ఉండిపోయారు. మనము ఏ కొండల్లో, ఏ లోయల్లో పయనిస్తున్నామో వారూ తమ సంకల్పం రీత్యా మనతోపాటు ఉన్నారు. వారిని వారి అశక్తత వారించింది, అంతే.[1]

ఇదే హదీసు దిగువ పదాలలోనూ వచ్చింది:

لقد تركتم بالمدينة اقواما ما سرتم مسيرا ولا انفقتم من نفقة ولا قطعتم من واد الا وهم معكم فيه قالوا وكيف يكونون معنا وهم بالمدينة قال حبسهم العذر

మీరు మదీనాలో కొందరిని వదలిపెట్టి వచ్చారు, మీరు ఎంతెంతగా నడుస్తూ ఉంటారో, లేదా ఖర్చుపెడుతూ ఉంటారో లేదా ఏదయినా లోయను దాటుతూ ఉంటారో- అక్కడల్లా వారూ మీతోపాటు ఉంటారు. సహచరగణ్యులు, వారు మదీనాలో ఉంటూ మనతోపాటు ఎలా ఉండగలుగుతారు? అని అడగ్గా ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు, ఈ జనులు దృఢసంకల్పం కలిగి ఉన్నప్పటికీ వారి అశక్తత వారిని ఆపి ఉంచింది.[1]

అనారోగ్యం, ప్రయాణ సౌకర్యాలు లేకపోవడం కూడా ఒక విధంగా అశక్తతే. అయితే వీటిలో శారీరక వైకల్యం (అశక్తత) ప్రథమమయింది. పైన పేర్కొన్న ఆయత్‌లలో ఈ అశక్తతనే ప్రస్తావించడం జరిగింది. ఈ హదీసులు సర్వసాధారణ పదాల రీత్యా ఈ భావాన్ని సమర్థిస్తున్నాయి.

జమాఅత్‌తోపాటు నమాజ్ చెయ్యడం ఎంతో ఘనమయిన విషయం. దీన్ని తాకీదు చెయ్యబడిన సున్నత్ (సున్నతె ముఅక్కిద), ఇంకా వాజిబ్‌గా పరిగణించారు. కొందరు ధర్మవేత్తలు పైన పేర్కొన్న జిహాద్‌కు సంబంధించిన ఆయత్‌ల అనువర్తనతో

1. బుఖారి : కితాబుల్ జిహాద్.
2. అబూ దావూద్, కితాబుల్ జిహాద్; బాబ్ అర్రుఖ్సా ఫిల్ కుఊద్ మినల్ ఉజ్ర్

అశక్తతగల వారు జమాఅత్‌లో పాల్గొన అవసరంలేదని వాదించారు. ఒక హదీసులో దీని విశదీకరణ కూడా ఉంది. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

**ఎవరయితే అజాన్ వింటాడో అతను జమాఅత్ నమాజ్‌లో పాల్గొనకపోతే అతని నమాజ్ నెరవేరదు. అయితే అతనికి ఏదయినా అశక్తత ఉన్నట్లయితే దాని కారణంగా అతను జమాఅత్‌లో చేరకపోతే అది వేరే విషయం.**[1]

**من سمع النداء فلم يات الصلوٰة فلا صلوٰة الا من عذر**[1]

ఇక్కడ రెండు ఉదాహరణలివ్వబడ్డాయి. ఇవికాక ఇంకా ఎన్నయినా ఇటువంటి ఉదాహరణలు ముందుంచడం సాధ్యమే. వాటిలో షరీఅత్ అశక్తులయినవారిని షరీఅత్ ఆదేశాలలో వినాయింపయినా ప్రకటించింది, లేదా వారికి రాయితీ, తగ్గింపులనయినా ప్రకటించింది.

## సామర్థ్యాల గుర్తింపు

కొందరు వ్యక్తులు ఏదో ఒక శారీరక లోపం కలిగి ఉన్నప్పటికీ అనేక సామర్థ్యాలు, సద్గుణాలూ కలిగి ఉంటారు. వారికి ప్రోత్సాహం లభిస్తే, వారికి అవకాశాలు కల్పిస్తే వారు గౌరవప్రదమయిన జీవితాన్ని గడపగలరు. సమాజానికి ఎంతో ప్రయోజనకరంగా మారగలరు. ఇస్లామ్ అశక్తుడు, వికలాంగి అయిన వ్యక్తిలోని సామర్థ్యాలకు, సద్గుణాలకు గుర్తింపునిస్తుంది. వాటి ద్వారా ప్రయోజనం పొందుతుంది. తమకు అశక్తత ఉన్నప్పటికీ వారు ఏదయినా సేవ నెరవేర్చినట్లయితే దాన్ని ఎంతో ఆదరంగా చూస్తుంది. నేటి కాలంలో ధార్మిక సేవలు చాలా మటుకు విలువ లేకుండాపోయాయి. అందువల్ల అజాన్ ఇవ్వడం, ఇమామత్ చెయ్యడాన్ని అతి తక్కువగా అంచనా కడతారు జనం. ఈ సేవలకు ఆర్థికంగానూ సామాజికంగానూ అథమ స్థాయిలో ఉన్నవారిని ఎంపిక చెయ్యడం జరుగుతుంది. నిజానికి ఇస్లామ్‌లో ఈ సేవలకు ఎంతో ప్రాముఖ్యత ఉంది. వీటికిగాను బాగా సమర్థులయిన, భయభక్తులు, ధర్మనిష్ఠ గలవారిని ఎంపిక చెయ్యాలన్న ఆదేశముంది. తొలినాళ్ళల్లో ఈ ప్రమాణాన్నే అమలుపరిచేవారు. ఈ పూర్వరంగంలో కాస్త గమనించండి, ప్రవక్త

---

1. ఇబ్నుమాజ, దారుకుత్నీ, ఇబ్ను హిబ్బాన్, హాకిమ్.

కాలంలో ఇమామత్ సేవనయినా, ముఅజ్జిన్ సేవలనయినా ఎవరు అందజేసేవారు? దైవప్రవక్త (స) దివంగతులయ్యే వరకు స్వయంగా ఆయనే ఇమామత్ బాధ్యతలు ఒనర్చేవారు. అయితే ఇద్దరు ముఅజ్జిన్‌లను ఆయన (స) నియమించారు. వారిలో హజ్రత్ బిలాల్ (ర) ఒకరయితే రెండవాయన, అమ్ర్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (ర).[1]

హజ్రత్ బిలాల్ (ర) స్వేచ్ఛ పొందిన బానిస. హజ్రత్ అమ్ర్ (ర) గ్రుడ్డివారు. దీన్నిబట్టి ఇస్లామ్ బానిసలకు వికలాంగులకు ఏ స్థానమిస్తుందో, ఎంతగా గౌరవిస్తుందో ద్యోతకమవుతుంది. ఇంతకన్నా గొప్ప సంఘటన ఏమిటంటే, తబూక్ పోరాటానికి బయలుదేరుతున్నప్పుడు హజ్రత్ అమ్ర్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (ర)ని తన స్థానంలో ఇమామ్‌గా నియమించారు ప్రవక్త మహనీయులు (స).[2]

ఇదేదో యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన కాదు. బరా బిన్ ఆజిబ్ (ర) ప్రకారం, "మక్కా నుండి హిజ్రత్ చేసినవారిలో ప్రథమంగా ముస్ అబ్ బిన్ ఉమైర్(ర) మా వద్దకు మదీనా వచ్చారు. ఆ తరువాత అమ్ర్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్(ర) వచ్చారు. దైవప్రవక్త (స) చాలా పోరాటాల సందర్భం లో ఆయన్ని తన స్థానంలో నియమించారు, ఆయన (ర) మదీనాలో ఇమామత్ చేసేవారు.[3]

అల్లామా ఇబ్నె అబ్దుల్ బిర్ర్, వాకిదీ ద్వారా ఇలా చెప్పారు. ప్రవక్త మహనీయులు (స) ఆయన్ని పదమూడు పోరాటల సందర్భంలో తన స్థానంలో మదీనాలో ఇమామ్‌గా నియమించారు.[4]

ఉతబాన్ బిన్ మాలిక్ అన్సారీ (ర), బద్ర్ యుద్ధంలో పాల్గొన్న సహాబాల్లోనివారు. వయసు చివరి దశలో ఆయన చూపు క్షీణించింది. కాని తన తెగవారి ఇమామత్ ఆయనే నెరవేర్చేవారు.[5]

ఉమైర్ బిన్ అదీ బిన్ ఖర్షా (ర), గ్రుడ్డివారని తెలుస్తోంది. కాని తన తెగవారిలో ప్రప్రథమంగా ఇస్లామ్ స్వీకరించినవారు ఈయనే. దివ్యఖుర్ఆన్ కూడా కొంత కంఠస్థం చేసుకున్నారు. ఈ కారణంగా ఆయన్ని 'కారి' (ఖుర్ఆన్ పాఠి)గా పేర్కొన్నారు. తన తెగవారికి ఇమామ్‌గా వ్యవహరించేవారు.[6]

---

*1. ముస్లిమ్ - కితాబుస్సలాత్.* *2. అబూదావూద్ - కితాబుస్సలాత్.*
*3. ఇబ్నె హజర్ : అల్ ఇసాబ.* *4. ఇబ్నె అబ్దుల్ బిర్ : అల్ ఇస్తియాబ్.*
*5. బుఖారి : కితాబుల్ హిక్మ్.* *6. అత్ ఇసాబ : 4/599; అల్ ఇస్తియాబ్ : 3/29.*

## వికలాంగి రెండింతల ప్రతిఫలానికి అర్హుడు

ఇస్లామ్ భావన ప్రకారం వికలాంగి తాను వికలాంగి అయినప్పటికీ ఏదయినా ధార్మిక సేవ ఒనర్చినట్లయితే అతని పుణ్యఫలం, ప్రతిఫలం కూడా దైవం సమక్షంలో అధికమే అవుతుంది. ఎందుకంటే, అతను ఇతోధికంగా శ్రమపడవలసి ఉంటుంది, కష్టాన్ని ఓర్చుకోవలసి ఉంటుంది. హజ్రత్ ఆయిషా (ర) ప్రవక్త మహనీయులు ప్రవచించినట్లు ఈ హదీసును ఉల్లేఖిస్తున్నారు:

**ఖుర్ఆన్ విషయంలో ప్రావీణ్యంగలవాడు దైవగ్రంథాలు వ్రాసే, అత్యంత సుగణశీలు రయిన వారి (దైవదూతల)తోపాటు ఉంటాడు. మరే వ్యక్తి ఖుర్ఆన్ పఠిస్తూ ఉంటాడో, పఠనంలో ఇబ్బందిననుభవి స్తాడో, ఆ కారణంగా అతను ఖుర్ఆన్ నేర్వడం, పఠించడం దుర్భరమవుతుందో అతనికి రెండింతల ప్రతిఫలం లభిస్తుంది.**[1]

**الماهر بالقرآن مع السفرة الكرام البررة والذى يقرء القرآن و يتتعتع فيه وهو عليه شاق له اجران**[1]

ఈ హదీసులో ఒక వైపున ఖుర్ఆన్‌లో నైపుణ్యం గలవాని మహత్తును తెలుపడం జరిగింది. అతనికి మహిమాన్వితులయిన ఉన్నత దైవదూతల సాంగత్యం ప్రాప్తమవుతుంది. ఆ దైవదూతలు ఈ పవిత్ర గ్రంథం ఖుర్ఆన్‌ని తమ చేతుల్లోనే పట్టుకు ఉంటారు. మరో వైపున ఇటువంటి నైపుణ్యం లేని వ్యక్తిని ప్రోత్సహించడం జరిగింది. అతను తన నోరు తిరగకపోవడంచేత లేదా అతని సామర్థ్యం స్వల్పం కావటాన ఖుర్ఆన్ ధారాళంగా చదవలేకపోతాడు. అయినప్పటికీ తన ప్రయత్నమేదో తాను చేస్తూనే ఉన్నాడు. కష్టపడి, శ్రమకోర్చి ఖుర్ఆన్ పారాయణం చేస్తున్నాడు. ఇతని ప్రతిఫలం సాధారణ పారాయణకర్తకన్నా రెండింతలుగా ప్రాప్తమవుతుంది. ఖుర్ఆన్ పారాయణం గురించి ఇక్కడ చెప్పిన విషయాన్ని, ఒక వికలాంగి అడ్డంకులున్నా నెరవేర్చేందుకు కృషి చేసే ఆరాధనలు, ధార్మిక కార్యకలాపాల విషయంలోనూ వర్తింపజేసుకోవచ్చు.

ఈ విధంగా ఇస్లామ్ వ్యాధిగ్రస్తులు, వికలాంగులలో ఓ సరికొత్త బలాన్ని, శక్తిని సృజించింది. వారు కూడా మహోద్వేగంతో, ఉత్తేజంతో ధార్మిక సేవల్ని అందజేశారు.

జమాఅత్‌తోపాటు నమాజ్ విషయంలో సహచర మాన్యుల అభిరుచి,

1. ముస్లిమ్ : కితాబుల్ ఫజాయిలుల్ ఖుర్ఆన్. 2. ముస్లిమ్ : కితాబుల్ మసాజిద్.

ఉత్సాహం, ఉత్తేజం విషయాన్ని వర్ణిస్తూ మహనీయ అబ్దుల్లా ఇబ్ను అబ్బాస్ (ర) ఇలా తెలిపారు:

ان كان المريض ليمشى بين رجلين حتى ياتى الصلوٰة[2]

**నిస్సందేహంగా వ్యాధిగ్రస్తుడయిన వ్యక్తి కూడా ఇద్దరు వ్యక్తుల మధ్య వారి ఆధా రంగా నడిచి నమాజ్‌లోకి వచ్చి చేరే వాడు.**[2]

మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది:

لقد كان الرجل يوتىٰ بها يهادى بين الرجلين حتى يقام فى الصف[1]

**ఒక మనిషిని ఇద్దరు వ్యక్తుల మధ్య (ఆధార మిచ్చి) తీసుకువచ్చేవారు. అతన్ని వరుస లో నిలబెట్టడం జరిగేది.**[1]

అమ్ర్ ఇబ్ను ఉమ్ము మక్తూమ్ ప్రస్తావన ఇంతకు ముందే వచ్చింది. చూపు లేక పోయినప్పటికీ ఆయన 'కాదిసియా యుద్ధం'లో పాల్గొన్నారు. ఆ యుద్ధం లోనే అమరగతులయ్యారు.[2]

## సమాజం బాధ్యత

ఇస్లామ్ ఒక వైపున వికలాంగులలో ఆత్మవిశ్వాసం, ధైర్యసాహసాలు, స్థయిర్యం నూరిపోయడంతోపాటు మరో వైపున సమాజానికి వారి పట్ల బాధ్యతల్ని గుర్తు చేసింది. ఆ బాధ్యతల్ని నెరవేర్చి అది తన విధిని మటుకే నిర్వర్తిస్తుంది తప్ప మరెవరికీ ఉపకారం చేయడం లేదని నొక్కి పలికింది.

## గౌరవ స్థానం ఇవ్వాలి

సాధారణంగా సమాజంలో వికలాంగుల్ని నీచంగా చూస్తారు. ఇస్లామ్ బోధనల ప్రకారం వారిని అధమ స్థాయివారుగా పరిగణించడం సరయినది కాదు, వారికి గౌరవ స్థానం ఇవ్వాలి. మక్కా కాలంలో ప్రారంభ దశ నాటి సంఘటన ఒకటుంది. ప్రవక్తశ్రీ (స) కొందరు కురైష్ నాయకులతో ఇస్లామ్‌ను గురించి చర్చిస్తున్న సందర్భంలో అమ్ర్ బిన్ ఉమ్ము మక్తూమ్ (ర) అక్కడికి విచ్చేశారు. ఆయన రాకను ప్రవక్త మహనీయులు (స) కాస్త అయిష్టంగా చూశారు. ఆయన (ర) గ్రుడ్డివారు, తలబిరుసుగల కురైష్ నాయకులు ఆయనతోపాటు కూర్చోవడాన్ని ఇష్టపడరన్న

---

*1. ముస్లిమ్: కితాబుల్ మసాజిద్. 2. ఇబ్ను అబ్దుల్ బిర్ర్ : అల్ ఇస్తియాబ్.*

తలంపు ప్రవక్తశ్రీ (స) కి కలిగింది. తానేవిధంగానయినా కురైష్ నాయకులకు దైవ సందేశాన్ని వినిపిం చాలని ఆయన (స) మనసారా కోరుకున్నారు. ఎందుకంటే వారు ఆ సందేశాన్ని స్వీకరిస్తే ఇతరులు సయితం దాన్ని స్వీకరించడానికి ముందుకు వస్తారన్నది వాస్తవం. ఆ సందర్భంలో దివ్యఖుర్ఆన్ ఇలా ఈ తలబిరుసుతనంగలవారి వెంట పడటాన్ని వారించింది. ఎందుకంటే వారు సత్యాన్ని స్వీకరిస్తే అది వారికే ప్రయోజనకరం, స్వీకరించకపోతే నీకు కలిగే నష్టమేమీ లేదు, పూర్తిగా అది వారికే నష్టదాయకం. ఈ తలబిరుసుతనం గలవారి కొరకు అల్లాహ్ భయంగలవారి పట్ల నీ శ్రద్ధ కొరవడరాదు.

عَبَسَ وَتَوَلّٰىٓ ۙ اَنْ جَآءَهُ
الْاَعْمٰى ۗ وَمَا يُدْرِيْكَ لَعَلَّهٗ
يَزَّكّٰىٓ ۙ اَوْ يَذَّكَّرُ فَتَنْفَعَهُ
الذِّكْرٰى ۗ اَمَّا مَنِ اسْتَغْنٰى ۙ
فَاَنْتَ لَهٗ تَصَدّٰى ۗ وَمَا عَلَيْكَ
اَلَّا يَزَّكّٰى ۗ وَاَمَّا مَنْ جَآءَكَ
يَسْعٰى ۙ وَهُوَ يَخْشٰى ۙ فَاَنْتَ
عَنْهُ تَلَهّٰى ۚ كَلَّآ اِنَّهَا تَذْكِرَةٌ ۙ
فَمَنْ شَآءَ ذَكَرَهٗ ۘ (عبس:۱-۱۲)

**ముఖం చిట్లించుకోవడం, అలక్ష్యం చెయ్యడం, కేవలం ఆ గుడ్డివాడు తన దగ్గ రికి వచ్చినందుకే. నీకేం తెలుసు బహుశా అతను సంస్కరించుకుంటాడేమో, లేదా ప్రబోధన పట్ల శ్రద్ధ చూపుతాడేమో, హితవు పలకడం అతనికి ప్రయోజనకరమవు తుందేమో! అలక్ష్యం చేసే వాని పట్ల నీవు శ్రద్ధ చూపుతావు, నిజానికి అతను సంస్కరించుకోకపోతే ఆ బాధ్యత నీకేముం దనీ? స్వయంగా నీ వద్దకు పరుగెత్తుకు వచ్చేవాడిని, భయపడేవాడినీ నిర్లక్ష్యం చేస్తావు.** ***(అబస : 1 - 12)***

ఈ విధంగా దైవం దృష్టిలో గౌరవస్థానం, గౌరవ ప్రమాణాలు, బాహ్య రూపు రేఖలు, ఆరోగ్యం, అంగసౌష్టవం, ధనం సంపదలు కావని, ధర్మనిష్ఠ, పరిశుద్ధ మనస్సు, శీల స్వభావాలని ఇస్లామ్ విశదపరచింది. గ్రుడ్డివాడయినా సత్యార్థి అయిన వ్యక్తి, తన సంస్కరణ, పవిత్రతను కోరుకునే వ్యక్తి, అందమయిన కళ్ళు గలవారికన్నా ఉన్నతుడు. వారి గుండెలు శిలలయిపోయాయి, వారు తమ ధనం, సామాజిక స్థానాల గర్వంలో దేవుని మార్గనిర్దేశన తమకు అనవసరమని భావిస్తున్నారు. అటువంటి ధిక్కా రులు, మదాంధుల కొరకు దేవుని దాసులయిన వికలాంగుల పట్ల ఉపేక్ష చూపడం సరయినది కాదని ప్రబోధిస్తుంది.

వికలాంగులలో సాధారణంగా న్యూనతాభావం కూడా ఉంటుంది. వారు

అన్యులతో కలివిడిగా మెలగటానికీ భోజన పానీయాలలో కలిసి పాల్గొనడానికీ, సామాజిక సంబంధాలు పెట్టుకోవడానికీ జంకుతారు. ఇస్లామ్ ఈ న్యూనతాభావాన్ని దూరం చేసింది. ఈ భావం ఉన్నంత వరకు అటువంటి వారు తాము అధములనే భావిస్తూ ఉంటారు. ఆరోగ్యవంతులు, శరీర సౌష్టవం గలవారితోపాటు కలిసి కూర్చోవ డానికీ జంకుతారు. ఆ కారణంగానే ఒక చోట సామాజిక ఆదేశాల క్రింద ఇలా పేర్కొనడమూ జరిగింది:

لَيْسَ عَلَى الْاَعْمٰى حَرَجٌ وَّلَا عَلَى الْاَعْرَجِ حَرَجٌ وَّلَا عَلَى الْمَرِيْضِ حَرَجٌ وَّلَا عَلٰى اَنْفُسِكُمْ اَنْ تَاْكُلُوْا مِنْ بُيُوْتِكُمْ (النور:٦١)

**ఒక గుడ్డివాడయినా, కుంటివాడయినా, రోగి అయినా (ఎవరి ఇండ్లల్లోనయినా తిన వచ్చు) ఇది తప్పు కాదు. అలాగే మీరూ మీ ఇండ్లల్లోనయినా.....తినవచ్చు..."**

***(అన్ నూర్ : 61)***

భావమేమిటంటే, వికలాంగులు, వ్యాధిగ్రస్తులకు తమ ఆప్తులు, బంధువులు, స్నేహితుల ఇండ్లల్లోకి వెళ్ళి భోజన పానీయాలు గ్రహించేందుకు పూర్తిగా అనుమతి ఉంది. ఇస్లామ్ వారిపైన ఎటువంటి ఆంక్షలు పెట్టనప్పుడు వారు కూడా స్వేచ్ఛను అనుభవించాలి. తాము సమాజంలో వేరుగా లేమని సమాజంలోనే ఒక భాగమని భావించాలి. అందరితో సమానంగా సంబంధాలు పెంపొందించుకోవాలి.

కొందరు వ్యాధిగ్రస్తులతో, వికలాంగులతో కలసిమెలిసి మెలగ గలగడం పట్ల, కలసి తినడం, త్రాగడం పట్ల ఇబ్బంది అనుభవిస్తారు, ఏవగింపు ప్రదర్శిస్తారు. వారిని కూడా ఇస్లామ్ విమర్శించింది, ఇటువంటి వారి రాకపోకలకు ఇతరులకు ఏ విధంగానూ భారం కారాదని హెచ్చరించింది. ఇది వారి హక్కు అని, వారికి సేవలు అందజెయ్యడం మీ బాధ్యత, విధి అని, వారి పట్ల వెగటు ప్రదర్శించడం, వారికి దూరంగా పరిగెత్తడం సరికాదని బోధించింది.

## ఉత్తమ రీతిలో వ్యవహరించాలి

సమాజం, వికలాంగుల్ని, బలహీనుల్ని, అశక్తులయినవారిని ఆదుకునేదిగా వారితో సహకరించేదిగా ఎదగాలని ఇస్లామ్ బోధించింది, ప్రేరేపించింది. ఇటువంటి వారి పట్ల ఉత్తమ రీతిలో వ్యవహరించాలని ఆదేశించింది కూడా. వీరికి సహాయపడే విధానాలు ఎన్నయినా కావచ్చు. ఒకటి ధన సహాయం. ధన సహాయం ప్రాముఖ్యాన్ని

సాధారణంగా అందరూ గ్రహిస్తారు కూడా. దీన్నే దానధర్మాల క్రింద పరిగణించడం జరుగుతుంది. అయితే సహాయపడే ఇతర విధానాలూ తక్కువ ప్రాముఖ్యంగలవి కావు. కొన్ని సందర్భాలలో ఇవే అధికంగా అవసరమయి ఉంటాయి. ఇస్లామ్ ధన సహాయాన్నీ ఇతర రూపేణ జరిగే సహాయాన్నీ ప్రోత్సహించింది. దాని దృష్టిలో దేవుని దాసుల కొరకు ఏ విధంగా ధనం వెచ్చించడం ధర్మంగా పరిగణించబడుతుందో అదే విధంగా తమ శక్తి సామర్థ్యాలను వారి కొరకు వెచ్చించడం కూడా 'సదకా' లేదా 'ధర్మం'గానే పరిగణించబడుతుంది. మనిషి పరమ ప్రభువు సంస్మరణ, ధ్యానం, ఆయన పరిశుద్ధతను కొనియాడటం, ఆయన పవిత్రతను స్తుతించడం ద్వారా మాత్రమే దైవప్రీతిని పొందదు, ఇంకా అనేక మార్గాలున్నాయి. తన నైతిక ప్రవర్తన, శీల స్వభావాలు, సమాజ సేవ, బలహీనులూ వికలాంగుల పట్ల సానుభూతి, సమాజంలో మంచినీ సదాచారాన్నీ సర్వసామాన్యం చేసి, జనుల్ని చెడు నుండి దుష్కార్యాల నుండి వారించి కూడా దైవం ప్రసాదించిన శక్తి సామర్థ్యాలను సద్వినియోగ పరచడం ద్వారా కూడా దైవప్రసన్నతను మనిషి పొందగలుగుతాడు.

మహనీయ అబూ జరి (ర) ఉల్లేఖనం ప్రకారం, దైవసందేశ హరులు (స) ఇలా సెలవిచ్చారు, నీవు నీ సోదరుని ఎదుట చిరునవ్వు నవ్వడం కూడా సదకా, ధర్మమే; మంచిని ఆదేశించడం, చెడును వారించడం కూడా సదకాయే; దారి తప్పిన వానికి దారి చూపడం కూడా సదకాయే; ఒక గ్రుడ్డివానికి సహాయపడటం కూడా సదకాయే; దారిలో పడి ఉన్న ఎముకను, ముల్లును, రాయీ రప్పను తొలగించడం కూడా సదకాయే; తన సోదరుని బొక్కెనలో నీరు నింపడం కూడా సదకాయే.[1]

ఇంతకన్నా అధిక వివరణ మరో హదీసులో వచ్చింది.

హ్జ్రత్ అబూ జర్(ర) ప్రకారం ప్రవక్తశ్రీ (స) ఇలా అన్నారు: ప్రతి రోజు సూర్యుడు ఉదయించినప్పుడు మనిషి పైన తన ఆత్మ పక్షాన సదకా (దాన ధర్మం) విధ్యుక్తమవుతుంది. దానికి నేను, దైవప్రవక్తా, మా వద్దనయితే ధనం లేదు ప్రతిదినం సదకా చెయ్యడానికి. ఆయన అప్పుడు, సదకా చేసే విధానాలు అనేకమున్నాయి. వీటిలో ఒకటి **"అల్లాహు అక్బర్, అల్‌హమ్దులిల్లాహ్, లా ఇలాహ ఇల్లల్లాహ్, అస్తగ్‌ఫిరుల్లాహ్"** అని పలకడం కూడా సదకాయే అని అన్నారు. ఇంకా, మంచిని

---

*1. తిర్మిజీ; అబ్వాబ్ బిర్ర్ వస్సిలా.*

ఆదేశించు, చెడును వారించు, దారి నుండి ముల్లు, రాయి రప్ప, ఎముక ముక్క తొలగించు, ఒక గ్రుడ్డివానికి దారి చూపించు, మూగవానికీ చెవిటివానికీ, మాట బోధపరచు, ఒక అగత్యపరునికి అతని అవసరం తీరే స్థానాన్ని చూపించు, నష్టాల్లో ఉన్న వానికి సహాయపడేందుకు చెయ్యగలిగేది చెడో, బలహీనుడి సహాయార్థం సదా సిద్ధంగా ఉండు – ఇవన్నీ సదకాకు మారు రూపాలే.[1]

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర) ప్రకారం ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

**من قاد مكفوفا اربعين خطوة غفرله ما تقدم من ذنبه و ما تاخر**

**ఎవరయినా ఒక కళ్ళు లేని కబోదికి నలభయి అడుగులు దారి చూపినట్లయితే అతని మునుపటి, వెనుకటి అపరాధాలన్నీ క్షమించడం జరుగుతుంది.**[2]

## ప్రోత్సాహపరచాలి

వికలాంగునికి దీనికన్నా ప్రధానమయింది అతన్ని ప్రోత్సహించడం. అతని పట్ల సానుభూతితో పాటు బాధను పంచుకోవాలి, అతని భావోద్రేకాలను గౌరవించాలి. దానివల్ల అతనికి సాంత్వన, నెమ్మది, ప్రశాంతత ప్రాప్తమవుతుంది. తాను అన్యుడు, పరాయివాడు అన్న మనస్తత్వం కలగదు. ఈ విషయంలో ప్రవక్త మహనీయుల సౌజన్యశీలత, ఆయన శీలస్వభావాలను ఈ క్రింది సంఘటన ద్వారా అర్థం చేసుకోవచ్చు.

లోగడ ఉత్బాన్ బిన్ మాలిక్ ప్రస్తావన వచ్చింది. చివరి రోజుల్లో ఆయన చూపు బాగా దెబ్బతిన్నది. తాను వర్షం పడిన రోజుల్లో మస్జిద్‌కు చేరలేనని దైవసందేశహరుల్ని ఆయన వేడుకున్నారు. ఇంకా 'మీరు నా ఇంట ఎక్కడయినా ఒకచోట నమాజ్ చెయ్యండి, నేను అక్కడే నమాజ్ చేసుకుంటాను' అని అభ్యర్థించారు. ప్రవక్తశ్రీ (స) దానికి ఒప్పుకున్నారు. 'ఇన్షాఅల్లాహ్, మేము తప్పక వస్తాము' అని అన్నారు. మరుసటి రోజు ఆయన (స) కాస్త పొద్దెక్కిన తరువాత మహనీయ అబూబక్ర్ (ర)తో పాటు

1. ముస్నద్ అహ్మద్: 5/169.
2. అల్లామా సియోతీ – తబ్రానీ, అబూ నుఅయ్మ్, బైహకీ ప్రభృతుల ద్వారా అనేక ఉల్లేఖనాలు ఉటంకించారు. అవి బలహీనమయినవి. ఇక్కడ హాఫిజ్ ఇబ్ను హజర్ వ్రాసిన 'అల్ ఖిసాలుల్ మక్‌ఫ్రీ' ద్వారా గ్రహించిన హదీసు పదాలు ఉటంకించబడ్డాయి.

చేరుకున్నారు. 'నేను ఎక్కడ నమాజ్ చెయ్యాలని నీవు కోరుకుంటున్నా'వని ప్రవక్త(శ్రీ (స) అడిగారు. నేను ఒక మూలవైపున సంజ్ఞ చేశాను. ఆయన రెండు రక'తుల నమాజ్ చేశారు. మేమున్నూ ఆయన వెనక నమాజ్ చేశాము, సలామ్ పలికాము. ఆ తరువాత మేము ఖజీర్ (మాంసం, గోధుమ పిండితో చేసే ఓ వంటకం) తినిపించడానికి ఆయన్ని ఆపుకున్నాము.[1]

హజ్రత్ జుబైర్ బిన్ ముత్యిమ్ (ర) ప్రకారం, దైవ సందేశహరులు (స) మాతో, 'పదండి, వాకిఫ్ వీధికి వెడదాము. అక్కడ బసీర్‌ని కలసుకుని వద్దాము' అన్నారు. బసీర్ ఓ గ్రుడ్డి వ్యక్తి.[2]

ఇబ్నుస్సున్న్ ప్రకారం ఆయన పేరు ఉమైర్ బిన్ అదీ. దైవసందేశహరులు (స) ఆయన్ని కలసుకునేందుకు తరచూ వెళ్ళేవారు.[3]

## చెడుగా ప్రవర్తించరాదు

ఇస్లామ్ ఒక వైపున వికలాంగుల పట్ల సద్వర్తన కలిగి ఉండాలని దానికి ఎంతో ప్రాధాన్యత ఉందని ప్రోత్సహించింది, బోధించింది. మరో వైపున వారి పట్ల చెడుగా ప్రవర్తించరాదని, వారిని బాధించరాదని గట్టిగా వారించింది. అలా చెయ్యడం దేవుని అభిశాపానికి గురిచేస్తుందని హెచ్చరించింది. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర) ఉల్లేఖనం ప్రకారం దైవసందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు :

**గ్రుడ్డివాణ్ణి దారి తప్పించే వాడిపైన అల్లాహ్ అభిశాపం పడుతుంది.**[4]

**لعن الله من كمه الاعمٰى عن السبيل**

## మతి చలించినవాడిపైన బాధ్యత లేదు

శారీరక వైకల్యంకన్నా తీవ్రతరమయింది, కష్టతరమయింది, గుణపాఠం గరిపేది మేధోపరమయిన వైకల్యం. ఇందులోనూ విభిన్న దశలున్నాయి. దీని తీవ్రతరమయిన రూపం పిచ్చి, మతి చలించడం. ఈ దశలో మనిషి తన స్పృహ కోల్పోతాడు. అతనికి తన చేష్టల, వాటి పరిణామాల స్పృహ అసలే ఉండదు. బుద్ధీ

---

1. బుఖారి : కితాబుస్సలాత్; ముస్లిమ్ : కితాబుల్ మసాజిద్.
2. ముస్జిరి, బజ్జార్ ఉల్లేఖనం, అత్ తర్‌గీబ్ వత్తర్‌హీబ్ : 3 – 248
3. అల్ ఇసాబ : ఫీ తమీయిజిస్సహాబా : 4–599.
4. ముస్నద్ అహ్మద్ : 1–309; అల్ అదబుల్ ముఫ్రద్ : 2–338.

జ్ఞానాలున్నప్పుడే మనిషి చేసిన ఏదయినా చేష్టకు బాధ్యుడుగా పరిగణించబడతాడు. ఇస్లామ్‌లో కూడా ఇటువంటివారికి ఎటువంటి షరీఅత్ బాధ్యతలూ లేవని వినాయింపునిచ్చింది. హజ్రత్ అలీ (ర) ఉల్లేఖనం ఒకదానిలో ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చినట్లుంది :

ان القلم رفع عن ثلاثة عن المجنون حتى يفيق و عن الصبى حتى يدرك و عن النائم حتى يستيقظ

**ముగ్గురు వ్యక్తుల విషయంలో కలం ఎత్తి వేయడం జరిగింది. వారిని ఏ విషయంలోనూ పట్టుకోవడం జరగదు: పిచ్చివాడి పిచ్చి కుదిరి బుద్ధివివేకాలు పునఃస్థాపితం కానంత వరకు; పిల్లవాడు యుక్త వయసుకు రానంత వరకు; నిద్రపోతున్నవాడు మేల్కోనంత వరకు.**[1]

## పిచ్చివాని గురించి కొన్ని ఆదేశాలు

ఇస్లామీయ ఫిక్‌హ్‌వేత్తలు (ధర్మశాస్త్రజ్ఞులు) పిచ్చివాని విషయంలో క్రింది విషయాలు నిర్ధారించారు :

1. పిచ్చివానిపైన ఎటువంటి షరీఅత్ బాధ్యత లేదు. భావమేమిటంటే, దైవం నిర్ణయించిన విధినిషేధాలు అతను నిర్వర్తించకపోతే అతన్ని ప్రశ్నించడం జరగదు.
2. అతని వల్ల ఏదయినా పాపం జరిగినట్లయితే అతన్ని పట్టుకోవడం జరగదు.
3. పిచ్చివాడు చేసిన ఏ చర్య అయినా విశ్వసనీయం కాదు. అంటే అతను లావాదేవీలు జరిపినా, ధర్మంగా ఏదయినా ఇచ్చివేసినా, నికాహ్ చేసుకున్నా, తలాక్ ఇచ్చినా, తదితర ఏ చర్య చేసినా అది ప్రభావశూన్యం, అమలు జరపలేనిదిగానే పరిగణించబడుతుంది.
4. అతడు శిక్షార్హమయిన నేరం చేసినట్లయితే అతన్ని శిక్షించడం జరగదు.
5. అయితే అతని వల్ల ఏదయినా ప్రాణ నష్టమో, ధన నష్టమో జరిగితే దానికి పరిహారం చెల్లించడం జరుగుతుంది.[2]

---

*1. బుఖారీ – కితాబుత్తలాక్ ; అబూదావూద్ – కితాబుల్ హుదూద్.*

*2. వివరాలకు చూడండి, హిదాయ, కితాబుల్ హిజ్ర్ : 3-349-351.*

ఈ విధంగా ఇస్లామ్ ఒక వైపున మతి చలించినవానికి పరలోకపు లెక్కల నుండి విముక్తి కలిగించింది. మరో వైపున అతని ప్రయోజనాల పరిరక్షణ ఏర్పాట్లు చేసింది. ఈ విధంగా అతని పట్ల ఎటువంటి అన్యాయం జరగకుండా జాగ్రత్తపడింది, అతని వైకల్యం వల్ల ఎవరయినా తప్పుగా ప్రయోజనం పొందకుండా చేసింది.

## బుద్ధిమాంద్యం గలవారికి రాయితీలు

కొందరు పూర్తిగా మతి చలించినవారో, పిచ్చివాళ్ళో కారు. కాని తీవ్రమయిన బుద్ధిమాంద్యానికి గురయి ఉంటారు. వారికి వ్యవహారావగాహన సామర్థ్యం ఉండదు. వారు మంచీ చెబ్బరల తేడాను సరిగ్గా పాటించలేరు. ఇస్లామ్ బోధనల ప్రకారం వారిని ఏ విషయంలోనూ వంచించరాదు. ఇచ్చిపుచ్చుకోవడాల్లో వారి పట్ల రాయితీని పాటించాలి. వీలయినంతమేర ఉత్తమ రీతిలో వారితో వ్యవహరించాలి.

ఒక అన్సారీ సహచరులు (ర) ఇటువంటి బుద్ధిమాంద్యానికి గురయి ఉండే వారు. మహనీయ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర) ఇలా ఉల్లేఖించారు : ఆయన (ర) దైవ ప్రవక్త(స)తో విన్నవించుకున్నారు, తాను వ్యాపారం చెయ్యకుండా ఉండలేరని, వ్యాపారంలో వంచనకు గురవుతారని. దానికి ఆయన ఇలా అన్నారు, 'ఒకరితో ఏద యినా వ్యవహారం నెరపినప్పుడు **لا خلابة (లా ఖలాబ)** - 'మా ధర్మంలో మోసం చెయ్యడం నిషిద్ధం' అని ప్రకటించు. కాగా ఆయన ఎప్పుడు ఏ వ్యవహారం జరిపినా 'లా ఖలాబ' అని అనేవారు.[1]

ఈ హదీసు ద్వారా నేటి సమాజం, ఇస్లామీయ సమాజం మధ్యన గల వ్యత్యాసాన్ని అర్థం చేసుకునేందుకు బాగా ఉపయుక్తంగా ఉంది. నేడు ఎవరయినా బలహీనులు, వైకల్యం గలవారని తెలిస్తే వారిని స్వార్థప్రయోజనం కొరకు వినియోగించుకునేందుకు ప్రయత్నం జరుగుతుంది. కాని ఇస్లామీయ సమాజంలో ఒక వ్యక్తి వైకల్యం గలవాడని, అతన్ని ప్రేమకు, సానుభూతికి అర్హునిగా, శ్రేయోపాత్రునిగా పరిగణించడం జరుగుతుంది. అతని లోపం కారణంగా అతని వల్ల ప్రయోజనం పొందడానికి బదులు అతనికి ప్రయోజనం చేకూర్చే ప్రయత్నం చెయ్యడం జరుగుతుంది. అందువల్ల ఎవరయినా ఇస్లామీయ సమాజంలో **'లా ఖలాబ'** అనడం అతని పట్ల ఎట్టి పరిస్థితిలోనూ వంచన జరగదన్న విషయం మరింతగా రూఢమవుతుంది,

1. బుఖారి - కితాబుల్ బుయూ.

ఇంకా అతనికి వీలయినంత రాయితీ ఇవ్వడం జరుగుతుందన్న హామీ కూడా అందులో ఉంది. ఏ సాదా సీదాతనం వల్ల నేడు మనిషి బజారులో దోపిడికి గురవు తాడో అదే సాదాసీదాతనం ఇస్లామీయ సమాజంలో అతన్ని అన్ని రకాల కీడుల నుండి రక్షణ కల్పిస్తుంది.

## వికలాంగుని పోషణ

గ్రుడ్డివాడు, అవిటివాడు, కుంటివాడు, కాళ్ళూ చేతులు కోల్పోయినవాడు, లేదా బుద్ధిమాంద్యం గలవాడు– వీరిలో ఎవరయినా ఇస్లామీయ శాసనాంగం రీత్యా ప్రప్రథమంగా అతని తండ్రి అతని సంరక్షణకు బాధ్యుడు. తండ్రి లేకపోతే దగ్గరి బంధువులు అతని బ్రతుకు తెరువుకు బాధ్యులు.[1]

దగ్గరి బంధువులు లేకపోయినా లేదా వారు అతని జీవనోపాధి బాధ్యతలు మోయలేనివారయినా ఇస్లామీయ రాజ్యం ఆ బాధ్యత తీసుకుంటుంది. అతన్ని పోషిస్తుంది.

ఇస్లామీయ రాజ్యం కేవలం అతని జీవన భృతి మటుకే కాదు, ఇతర అవశ్య కతలు సయితం పూర్తి చేస్తుంది. సయీద్ బిన్ యర్బూ(ర) ఒక కురైషీ సహచరులు. ఆయన చూపు ఏదో కారణంగా పూర్తిగా పోయింది. హజ్రత్ ఉమర్ (ర) ఆయన్ని పరామర్శించడానికి వెళ్ళారు. దానితోపాటు 'మీరు జమాఅత్‌తోపాటు నమాజ్, జుమా నమాజ్ విడిచిపెట్టకండి' అని కూడా అన్నారు. దానికి ఆయన, మస్జిద్ వరకు తోడుకొనివెళ్ళేవాడు ఎవరూ లేడని చెప్పారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (ర) ఆ ఏర్పాటు మేము చేస్తాము అని హామీనిచ్చారు. తన వద్ద ఉన్న ఒక బానిస అబ్బాయిని ఆయన వద్దకు హజ్రత్ ఉమర్ (ర) పంపించారు.[2]

ఇస్లామీయ రాజ్యం ఒక గ్రుడ్డివాని జమాఅత్‌తోటి నమాజ్, జుమా నమాజ్ ఏర్పాటు చేస్తే ఇతర ఆవశ్యకతలు ప్రప్రథమంగా చేస్తుంది.



---

1. హిదాయ – ఫత్‌హుల్ కదీర్.

2. అల్ ఇసాబ – ఫీ తమీజిస్సహాబా.

# 7. ఆత్మరక్షణా అధికారం

ప్రపంచంలో ఏ వ్యక్తి అయినా మరో వ్యక్తిపైన ఏ విధంగానయినా దౌర్జన్యం చేసినట్లయితే ఆ వ్యక్తికి తన రక్షణ చేసుకునే అధికారం ఉంది. ఇలా రక్షించుకోవడాన్ని బుద్ధిగల ఏ వ్యక్తీ తప్పుగా పరిగణించలేడు. అలాగే ఏ రాజ్యమూ దీన్ని నిరాకరించ లేదు. అందరి దృష్టిలోనూ ఇది ఓ అంగీకృత హక్కు. ఈ హక్కు ఎవరికయినా లేదనడం దౌర్జన్యాన్ని బలోపేతం చేయడమే అవుతుంది. ఎవరు ఎప్పుడు అన్యాయం ఎదుట వంగిపోయినా అప్పుడు దౌర్జన్యపరుని సాహసం పెరిగింది, దౌర్జన్యమూ పెరిగింది. ఇదంతా నేడూ జరుగుతూనే ఉంది. దీని మరో పెద్ద నష్టం ఏమిటంటే, స్వయాన బాధితుని మనోస్థితి మారిపోతుంది. అన్యాయాన్ని సహించడం, దౌర్జన్యం హింసాకాండను భరించడం తన భాగ్యంలో ఉందని అతను తలుస్తాడు. కొన్ని పరిస్థితుల్లో అతను, అన్యాయానికీ అత్యాచారానికీ జవాబు ఇచ్చే తన హక్కు కూడా తనకు ఉందని అంగీకరించడు. తాను నిజానికి ఎంతగా వివశుడూ, అశక్తుడో తాను అంతకన్నా వివశుడూ అశక్తుడుగా పరిగణిస్తాడు. కొన్ని సందర్భాలలో నయితే అతని పిరికితనం, చేతకానితనమే అతన్ని బాధిత స్థాయి వరకు చేర్చుతుంది.

ఆత్మరక్షణ అన్నది చాలా సున్నితమయిన విషయమన్నది వాస్తవం. ఇందులో చాలా జాగ్రత్త వహించడం అవసరం. కొన్ని సందర్భాలలో ఆత్మరక్షణ పేరుతో అత్యా చారం, అన్యాయం, అధర్మంగా రక్తపాతం కూడా సంభవమే. అలాంటప్పుడు ఆత్మ రక్షణకు సంబంధించిన పరిధులు, అవధుల్ని పరిగణనలోకి తీసుకోవడం జరగదు. ఈ చేష్ట ఇస్లామ్ పేరిట జరిగినప్పుడు ప్రపంచం దీన్ని అత్యాచారంగా, హింసగా, ఉగ్రవాదంగా నిర్ణయించి ఇస్లామ్‌నే అప్రదిష్టపాలు చేస్తుంది. పైగా ఆత్మ రక్షణ చేసు కునే ధర్మబద్ధమయిన హక్కును సయితం అంగీకరించడానికి సిద్ధమవదు.

ప్రతి వ్యక్తికీ ఆత్మరక్షణ చేసుకునే హక్కును ఇస్లామ్ ప్రసాదించిందన్న విషయంలో సందేహం లేదు. కాని అన్యాయానికి ఎటువంటి అనుమతి ఎన్నడూ ఇవ్వ లేదు. దాని బోధనల ప్రకారం మనిషి తానెవరిపైనా చెయ్యెత్తరాదు. తనపైనా మరెవ

రయినా చెయ్యెత్తే అవకాశమూ ఇవ్వరాదు. అత్యాచారి సమక్షంలో లొంగిపోరాదు, అతన్ని సాహసోపేతంగా ఎదిరించాలి. అది పిరికిదనాన్నీ, అధైర్యాన్నీ ఇష్టపడదు. మనిషి చేతులు కట్టుకుని తన ధన మాన ప్రాణాలు అన్నీ శత్రువుకు అప్పజెప్పడాన్ని, ఎటువంటి ప్రతిఘటన చెయ్యకపోవడాన్ని అది సుతరామూ ఇష్టపడదు. అయితే దీనికీ అది చేసిన నియమాలు, నిబంధనలు, పరిమితులు పూర్తిగా న్యాయబద్ధమయినవి. ఇస్లామీయ షరీఅత్‌వేత్తలు వాటి ఆధారంగా చాలా సూక్ష్మంగా ఆత్మరక్షణా వివరాలు సంకలనం చేశారు.

ఆత్మరక్షణ విషయంలో రకరకాల అనుమానాలు, అపార్థాలు చోటుచేసు కున్నాయి. అందువల్ల వాటిని గురించి వేరుగా చర్చించడం జరుగుతుంది. ఇక్కడ ఒక విషయం మటుకు గుర్తుంచుకోవలసి ఉంది. ఇక్కడ చర్చనీయాంశం వ్యక్తిగత, వైయక్తిక రక్షణకు సంబంధించింది. రెండు రాజ్యాల మధ్య జరిగే పోరాటం ఇక్కడ చర్చనీయాంశం కాదు. దానికి సంబంధించిన ఆదేశాలు వేరు.

## ఆత్మరక్షణలో ప్రాణాలర్పించుకోవడం 'షహాదత్'!

దైవసందేశహరులు (స) సూక్తులలో అతి స్పష్టంగానూ విశదంగానూ తెలుపడం జరిగింది. మనిషి తన ధర్మం, విశ్వాసం, ధనం, ప్రాణం, ఇల్లు, భూమి, ఆస్తి, భార్యాపిల్లలు, బంధువులు ఆప్తుల రక్షణలో ప్రాణం కోల్పోవడం సరయినదే, ఇంకా ఇలా ప్రాణాలు ధారపోయడం షహాదత్‌గా పరిగణించబడుతుంది అని. షహాదత్ లేదా అమరగతి అన్నది సౌభాగ్యవంతులకు ప్రాప్తమయ్యే ఉన్నత స్థానం.

మహనీయ సయీద్ బిన్ జైద్, దైవప్రవక్త (స) చెప్పగా ఇలా ఉల్లేఖించారు:

**من قتل دونه ماله فهو شهيد**
**ومن قتل دون دينه فهو شهيد و**
**من قتل دون دمه فهو شهيد و**
**من قتل دونه اهله فهو شهيد** ﷺ

**ఎవరు తన తల్లిదండ్రుల రక్షణలో చంప బడతాడో అతను షహీద్. ఎవరు తన ధర్మ రక్షణలో చంపబడతాడో అతను షహీద్, ఎవరు తన ప్రాణరక్షణలో ప్రాణం కోల్పో తాడో అతనూ అమరగతి పొందినవాడే, మరెవరు తన ఇంటివారల రక్షణలో చంప బడతాడో అతనూ షహీద్.**[1]

---

1. *తిర్మిజీ – అబ్వాబుద్దియాత్; నసాయి, అబూదావూద్.*

హ్రజత్ అబూ హురైరా (ర) ప్రకారం ఒక వ్యక్తి దైవసందేశహరుణ్ణి (స) ఓ ప్రశ్న అడిగాడు, "ఎవరయినా సొమ్ము దోచుకుంటే నేనేమి చెయ్యాలి" అని. ఆయన, "నీ సొమ్ము అతనికి అలా ఇచ్చివెయ్యకు" అని అన్నారు. దానికి అతను, 'ఒకవేళ అతను పోరుకు సిద్ధమయితే?' అని అడిగాడు. 'నీవు కూడా పోరుపడు' అని ఆయన (స) చెప్పారు. అతను తిరిగి, 'అతను నన్ను చంపివేస్తే' అని అడగ్గా, ఆయన (స) ఇలా సెలవిచ్చారు, 'నీవు అమరగతి పొందుతావు.' 'మరి నేను అతన్ని చంపివేస్తేనో?' అని ఆ వ్యక్తి అడగ్గా ప్రవక్తశ్రీ, 'అతను నరకానికి పోతాడు' అన్నారు.[1]

మనిషి తన ధన మాన ప్రాణాల రక్షణకు కడ వరకూ ప్రయత్నిస్తాడు. అవసరమయితే దానికి ఇరుగుపొరుగు, సమాజం, ప్రభుత్వ సహాయాన్ని సయితం పొందగలడు. కాగా నసాయి తదితర హదీసు గ్రంథాల్లో వచ్చిన ఓ హదీసు ప్రకారం, ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరయి, 'ఎవరయినా కొందరు నా సొమ్ము దోచుకోగోరినట్లయితే నేనేమి చెయ్యాలి?' అని అడిగాడు. ప్రవక్త మహనీయులు (స), 'అల్లాహ్ పేరు చెప్పి వారిని వారించు, బోధపరచు' అని పురమాయించారు. 'దానికీ వారు ఒప్పుకోకపోతే ఏం చెయ్యాలి?' అని ఆ వ్యక్తి అడిగాడు. 'దగ్గరనున్న ముస్లిము లను సహాయానికై అర్థించు' అని ప్రవక్త శ్రీ(స) పలికారు. 'దగ్గర ఏ ముస్లిమ్ కూడా లేకపోతే ఏం చెయ్యాలి?' అని ఆ వ్యక్తి తిరిగి అడిగాడు. దానికి ప్రవక్త మహనీ యులు(స), 'ప్రభుత్వ సహాయాన్ని అర్థించు' అని ఆదేశించారు. అతడు మళ్ళీ విన్నవిం చుకున్నాడు, 'ప్రభుత్వ సహాయం వరకూ చేరలేకపోతేనో?' అని. 'నీ సొమ్మును కాపాడుకునేందుకు నీవు ఒంటరిగా నిలబడు. ఈ కృషిలో నీ ప్రాణమయినా పోయి నీవు షహీదుల్లో పరిగణించబడాలి, లేదా నీ సొమ్ము భద్రంగా నీకే దక్కాలి.[2]

ఈ హదీసుల ద్వారా తెలిసేదేమిటంటే, మనిషి తన ధన, మాన, ప్రాణాలు, భార్యాపిల్లలు, ధర్మం విశ్వాసాల పరిరక్షణ కొరకు ప్రాణాలను సయితం అర్పించుకో గలడు. ఇలా ప్రాణాలు కోల్పోవడం షహాదత్ (అమరగతి)గా పరిగణించబడుతుంది. ఇదీ రక్షణకు కృషి చేసేవాని అంతిమ పరిణామం. దీనికి భిన్నంగా దాడి చేసిన వ్యక్తి హతుడయితే అతను నరకపాత్రుడు. ఈ భావన పుడితే మనిషి ఎన్నడూ అన్యాయానికి తలొగ్గడు. నిజానికి ఈ భావన పుట్టిన వ్యక్తిపై చెయ్యెత్తే ప్రయత్నం చెయ్యడమూ ఎవరికయినా అంత సులువు కాదు. అల్లామా షోకానీ ఈ సంబంధంలో వచ్చిన హదీసులను గురించి వ్రాస్తూ ఇలా అన్నారు :

---

*1. ముస్లిమ్, కితాబుల్ ఈమాన్.* *2. నసాయి, కితాబుల్ మహారబ.*

و احاديث الباب مصرحة بان المقتول دون ماله و نفسه و اهله و دينه شهيد و قاتله اذا قتل فى النار لان الاول محق والثانى مبطل[1]

ఈ విషయంలో వచ్చిన హదీసుల వల్ల విశదమయ్యే విషయం, తన ధన మాన ప్రాణాలు, భార్యాపిల్లలు, ధర్మం కొరకు హతుడయిన వ్యక్తి షహీద్‌గా పరిగణించ బడతాడు. ఇతన్ని చంపిన వ్యక్తి నరకానికి పోతాడు, ఎందువల్లనంటే తొలి వ్యక్తి ధర్మాన ఉన్న వ్యక్తి. రెండవవాడు అధర్మం పైన ఉన్నవాడు.[1]

## రక్షణ ఒక చట్టపరమయిన హక్కు

రక్షణ హక్కు ఇస్లామ్‌లో ప్రతి వ్యక్తికీ చట్టపరమయిన హక్కు. దీన్నుండి ఏ వ్యక్తీ అతన్ని వారించలేడు. ఫుకహా ఏకగ్రీవంగా, రక్షణలో దాడిచేసే వానికి కలిగే ఎటువంటి నష్టమయినా దాని బాధ్యత రక్షణ చేసుకునేవానిపైన మోపబడదు. అతనికి ఎటువంటి శిక్షా విధించబడదు. అతను ఎటువంటి పరిహారమూ చెల్లించనవసర ముండదు. హదీసువేత్త ఇబ్ను బత్తాల్ ఇలా వ్రాశారు, 'హదీసులో రక్షణలో ప్రాణాలు కోల్పోయిన వ్యక్తి షహీద్‌గా పరిగణించబడిన తరువాత, ఆ విషయం ద్వారా స్వయం గానే ఈ విషయం ముందుకు వస్తుంది, అతను దాడి చేసినవాణ్ణి చంపివేసి నట్లయితే (ఏ విధంగానయితే జిహాద్ చేసే వ్యక్తి (ముజాహిద్) పైన హత్యాపరిహారమో, లేదా హత్యా ప్రతీకారమో విధించబడదో, అదే విధంగా) అతనిపైన హత్యా ప్రతీకారమో, హత్యా పరిహారమో విధించడం జరగదు.[2]

---

1. *షోకానీ, నైలల్ ఔతార్.*
2. *ఇబ్ను హజర్ - ఫత్‌హుల్ బారి : 5/76.* కాని ఈ వాదన అంతగా బలమయినది కాదు. ఎందువల్లనంటే దైవమార్గంలో దేవుని శత్రువులతో పోరాడి ప్రాణాలొడ్డిన షహీద్‌కు షహాదత్ పొందినందుకు పుణ్యఫలమూ సద్‌ఫలితమూ ప్రాప్తిస్తాయి. షహీద్‌కు వర్తించే షరీఅత్ ఆదేశాలూ అతనికి వర్తిస్తాయి. ఉదాహరణకు, అతని శవస్నానం చేయించడం జరగదు మొదలయినవి. మరో విధమయిన షహీద్‌కు షహాదత్ శుభవార్తనయితే ఇవ్వబడింది. కాని ప్రపంచంలో వర్తించే షరీఅత్ ఆదేశాలు తొలి విధమయిన షహీద్‌కు వర్తించేవి కావు. (వివరాలకు చూడండి, నవవీ, షరహ్ ముస్లిమ్, సం. 1, రెండవ భాగం, పు: 140). అందు వల్ల ఇరు విధాల షహీదులను ఒకే విధంగా ఊహించలేము. అయితే రక్షణ చేసుకునే వాని హక్కు విషయంలో ఫుకహా ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు. వివరాలు మున్ముందు రాబోతున్నాయి.

## ఆత్మరక్షణ

ఇమామ్ షాఫియీ ప్రకారం : ఒకరి ధన, మాన, ప్రాణాలపైన, భార్యాపిల్లల పైన దాడి జరిగినట్లయితే అతనికి రక్షణ చేసుకునే హక్కు ఉంది. ఆ రక్షణలో దాడి చేసినవాడు చంపబడినట్లయితే రక్షణ చేసుకునే వానిపైన హత్యా పరిహారంగాని, మరే పరిహారంగాని విధించబడదు.[1]

హనఫీ ఫిక్హ్ ప్రకారం ఎవరయినా హత్యాసంకల్పంతో మరొకరిపైన కత్తి ఎత్తినట్లయితే, ఈ వ్యక్తికి తన ప్రాణాన్ని కాపాడుకోవడానికి దాడి జరిపినవాణ్ణి హత్య చెయ్యడం తప్ప గత్యంతరం లేకపోతే అతను ఆ దాడి జరిపేవాణ్ణి హత్య చెయ్యవచ్చు. అతణ్ణి దీనిగ్గాను పట్టుకోవడం జరగదు. హనఫీ ఫిక్హ్‌లో ఇంకా ఈ విధంగానూ తెలుపడం జరిగింది, ఒక ముస్లిమ్‌పైన ఆయుధం ఎత్తడం ముస్లిమ్ సమాజంపైన ఆయుధం ఎత్తడంతో సమానం. ఏ విధంగానయితే సమాజంపైన ఆయుధం ఎత్తినవాణ్ణి చంపడం సరయినదో అదే విధంగా వ్యక్తిపైన ఆయుధం ఎత్తినవాణ్ణీ చంపవచ్చు.[2]

దాడి జరిపేవాడు ఒక వ్యక్తి అయినట్లయితే అతనికెదురుగా రక్షణ చేసుకునే హక్కు ఏ విధంగా ఉందో అదేవిధంగా, ఒక ముఠా దాడి జరిపినప్పుడు కూడా ఈ హక్కు ఉంటుంది. ఇమామ్ ఇబ్ను తైమియ్య అభిప్రాయంలో: "దొంగలు ఎవరి ప్రాణాలు తీయగోరితే అతను వారిని ఎదుర్కొంటాడు, తన రక్షణలో అతను వారిని చంపవలసివచ్చినా సరే, ఈ విషయంలో అందరికీ ఏకాభిప్రాయముంది.[3]

## ఆత్మరక్షణ విధి అయినదా?

మనిషి తన రక్షణలో దాడి జరిపేవాణ్ణి హత్య చెయ్యవచ్చు అన్నది కేవలం ఒక చట్టపరమయిన హక్కు మాత్రమేనా లేదా దాడి జరిపేవాడిని హత్య చెయ్యకుండా తన్ను తాను రక్షించుకోవడం సాధ్యం కాకపోతే అతన్ని చంపివెయ్యడం తప్పనిసరి అవుతుందా? హన్బలీ ఫిక్హ్‌లో దీన్ని ఒక్క హక్కుగానే పరిగణించడం జరిగింది. మనిషి తన ఈ హక్కును వినియోగించుకోవడం తప్పనిసరి కాదు. అల్లామా ఇబ్ను కద్దామ హన్బలీ ఇలా అన్నారు :

1. ఇబ్ను హజర్ - ఫత్‌హుల్ బారి : 5/76.
2. అలాఉద్దీన్ వ ఇబ్ను ఆబిదీన్, రద్దుల్ ముఖ్తార్ మఅద్దుర్రాల్ ముఖ్తార్ - 5/481.
3. ఫతావా ఇబ్ను తైమియ్య : 34/242 (కొత్త ఎడిషన్)

తన ధన ప్రాణాల రక్షణ మానవుని హక్కు. ఈ సందర్భంలో అతను దాడి జరిపేవాడిని గత్యంతరంలేక చంపివేసినా అతన్ని పట్టు కోవడం జరగదు. కాని ధన ప్రాణాల రక్షణ విధి అయినది కాదు.[1]

అయితే ఇమామ్ ఇబ్ను తైమియ్య ఇలా అంటారు :

తన ఆత్మరక్షణను విధిగా కూడా పరిగణించడం జరిగింది. కొందరు విధి కాదు అని కూడా అంటారు. ఇమామ్ అహ్మద్ రెండు అభిప్రాయాలూ ప్రకటిం చినట్లు దాఖలాలున్నాయి.[2]

హనఫీ ఫిక్హ్‌వేత్తల దృష్టిలో ఆత్మరక్షణ విధి అయినది. దాడి జరిపేవాడిని చంపి మనిషి తన ప్రాణరక్షణ చేసుకోగలిగితే అతన్ని చంపడం విధి అయినదే, అలా చెయ్యకపోతే మనిషి పాపం చేసినవాడవుతాడు.[3]

## ధన రక్షణ

ప్రాణ రక్షణలానే ధన రక్షణ హక్కు కూడా చట్టపరంగా ప్రతి మనిషికీ ఉంది. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (ర) దొంగను చూడగానే కత్తిదూశారు. ఉల్లేఖనకర్త ప్రకారం, మేము ఆయన్ని వదలివేస్తే, చంపకుండా ఆపకపోతే ఆయన అతన్ని చంపివేసేవారే.

హసన్ బస్రీని ఎవరో అడిగారు, నా ఇంట దొంగ చొరబడితే, అతని చేతిలో కత్తి ఉన్నట్లయితే నేను అతన్ని చంపివెయ్యాలా? దానికి ఆయన సమాధానంగా, అవును, ఏ విధంగానయినా సరే, నీవు అతన్ని చంపివెయ్యి' అన్నారు.

ఇమామ్ అహ్మద్ ఇలా అన్నారు, దొంగల ముఠా ఏదయినా నీ ప్రాణం లేదా ధనం దోచుకోదలిస్తే నీవు నీ ధన ప్రాణాల రక్షణలో దాన్ని చంపివెయ్యి.

హజ్రత్ ఇబ్ను సీరీన్ ఇలా చెప్పారు, హరూరియ వర్గం వారినీ, దొంగల్నీ పోరాడి చంపడాన్ని ఎవరున్నూ పాపంగా భావించి వదలిపెట్టలేదు. ఎవరయినా పిరికితనంతో వదలిపెడితే అది వేరే విషయం.[4]

హనఫీ ఫిక్హ్ ప్రకారం, రాత్రివేళ ఎవరయినా ఒకరి ఇంట జొరబడి ధన

---

1. ఇబ్ను కద్దామ – అల్ ముగ్నీ –12 : 533–534.
2. ఫతావా ఇబ్ను తైమియ్య – 34 : 242.
3. అల్ కిఫాయ అల్ హిదాయ – 5 : 1264.
4. ఇబ్ను కద్దామ, 12, అల్ ముగ్ని – 12 : 531–533.

సామగ్రి దొంగిలిస్తూ ఉండగా లేదా దొంగిలించే సంకల్పం చేస్తూ ఉండగా గమనించి నట్లయితే అతణ్ణి ఇల్లుగల వ్యక్తి చంపివెయ్యగలడు. అలాగే ధన సామగ్రి దోచుకుని అతడు పరారవుతూ ఉండగా గమనించినా అతన్ని వెంబడించి చంపివెయ్యవచ్చు. ఆ వ్యక్తిని పట్టుకోవడం జరగదు.[1]

ధన రక్షణ విషయంలో ఒక ప్రశ్న తలెత్తుతుంది. మనిషి కొద్దిపాటి ధనాన్ని కూడా రక్షించుకోవాలా లేదా దానికి ఏదయినా పరిమాణం ప్రత్యేకమయి ఉందా? ఇమామ్ నవవీ ప్రకారం -

ఎవరయినా ఒకరి సొత్తు అధర్మంగా దోచుకోదలిస్తే అతన్ని ఆ వ్యక్తి చంపనూ వచ్చు, ఆ సొత్తు కొద్దిపాటిదయినా అధికమయినా. ఎందుకంటే హదీసుల్లో ఇలాంటి ఎటువంటి నిర్బంధం లేదు, పదాలు సామాన్యమయినవి ధర్మవేత్తలందరి అభిప్రాయమూ ఇదే. ఇమామ్ మాలిక్ శిష్యులు కొందరు, సొమ్ము కొద్దిపాటిదయితే దోచుకునేవాణ్ణి చంపడం తగదు. కాని సరయిన మాట ధర్మవేత్తలు చెప్పినదే.[2]

హనఫీ ఫిక్హ్‌లో ఒక అభిప్రాయం ప్రకారం సొమ్ము పది దిర్హములు లేదా దానికన్నా అధిక విలువగలది కావడం అవసరం. మరో అభిప్రాయం ప్రకారం జకాత్ విధి అయ్యేంత సొమ్ము అయినట్లయితే దాడి జరిపేవాణ్ణి అవసరమయినప్పుడు చంపడం లోనూ తప్పులేదు. అంతకన్నా తక్కువయినట్లయితే దాడి జరిపేవాడిని ఎదుర్కోవడం అవసరమే కాని అతన్ని చంపడం తగదు. కాని హనఫీ ఫిక్హ్‌వేత్తలు జకాత్ విధి అయ్యే సొమ్ముకన్నా తక్కువ ధనం కోసం కూడా మనిషి, దాడి జరిపేవాడిని ఎదుర్కొని అతణ్ణి చంపే హక్కు కలిగి ఉన్నాడు. ఎందుకంటే హదీసుల్లో ఇటువంటి నిర్బంధం ఏదీ లేదు.[3]

ఇమామ్ ఇబ్ను తైమియ్య ఇలా అన్నారు : దొంగలు ఒకరి సొత్తు బలవంతాన దోచుకోదలిస్తే వారికి కొద్దిపాటి సొమ్ము అయినాసరే అప్పజెప్పడం సరయినది కాదు, ఈ విషయంలో ఇమాములందరూ ఏకాభిప్రాయానికి ప్రయత్నించాలి. కాని రక్షణలో దొంగల్లో ఎవడయినా మరణిస్తే అతని హత్యానేరంగా పరిగణించబడదు. ధనం గల వాడిని పట్టుకోవడం జరగదు.[4]

---

1. జస్సాస్, అహ్కాముల్ ఖుర్ఆన్- *2 : 40;* ముర్గియానీ, హిదాయ - *4 : 565;* ఇబ్ను ఆబిదీన్ *రద్దుల్ ముఖ్తార్ - 5 : 284.*
2. నవవీ - *షరహ్ ముస్లిమ్, సం. 1, భాగం 2, పు. 140.*
3. ఇబ్ను ఆబిదీన్, *రద్దుల్ ముఖ్తార్ - 5 : 482.*
4. ఫతావా ఇబ్ను తైమియ్య - 34 : 243.

ధర్మవేత్తల అభిప్రాయాన్ని సమర్థిస్తూ చెప్పే మరో మాట ఏమిటంటే సొమ్ము ప్రాముఖ్యత వ్యక్తుల్నిబట్టి నిర్ణయమవుతుంది. ఒక వ్యక్తికి పది దిర్హముల ప్రాముఖ్యత ఎంతో ఉండవచ్చు. మరో వ్యక్తికి వంద దిర్హముల ప్రాముఖ్యత కూడా అంతగా ఉండకపోవచ్చు.

## ధనం రక్షించుకోవడం విధియా?

ఇమామ్ ఇబ్ను తైబియ్య తన గత చర్చను కొనసాగిస్తూనే ఇంకా ఇలా అంటారు : సొమ్మును రక్షించుకోవడం విధికాదు. అందువల్ల వ్యక్తి దొంగల్ని ఎదుర్కొనకుండా తన సొమ్ము దొంగలకు అప్పజెప్పగలడు.[1]

ఇమామ్ నవవీ ఇలా అంటారు :

ధనం రక్షించుకోవడం, ధర్మసమ్మతమే కాని విధి కాదు.[2]

కొందరు ధర్మవేత్తలు సొమ్మును రక్షించుకోవడం విధి అని నిర్ణయించారు. భావమేమిటంటే, ధన రక్షణలో దాడి జరిపేవానితో కలయబడవలసివస్తే తప్పనిసరిగా పోరాడాలి. బహుశా వీడి వాదనకు ఆధారం మహనీయ అబూ హురైరా ద్వారా ఉల్లేఖించబడిన ఉల్లేఖనం కావచ్చు అందులో దాడి జరిపేవాణ్ణి ఎదురొడ్డి పోరాడాలని, సొమ్ము అతనికి అప్పజెప్పరాదని చెప్పడం జరిగింది.[3]

## కుటుంబం, భార్యాపిల్లల రక్షణ

సమాజంలో మానవుని అతి సమీప సంబంధం భార్యాపిల్లలు, కుటుంబం వారితో ఉంటుంది. వారి పట్ల అనేక నైతిక, చట్టపరమయిన బాధ్యతలు అతనిపైన విధ్యుక్తమవుతాయి. వారికి ఏదయినా ప్రమాదకరమయిన సమయం తారసపడితే అతను తన ప్రాణాలొడ్డి పోరగలడు, ధనం ధారపోసి కాపాడగలడు. అయితే వాళ్ళ రక్షణ చట్టం పరిధిలో జరగాలి. దాన్ని ఇస్లామ్ ప్రశంసించింది. ఒక హదీసులో ఇలా ఉంది :

خيركم المدافع عن عشيرته مالم يأثم ۲

**మీలో ఎవరయినా తన కుటుంబంవారి రక్షణ చేస్తూ అపరాధానికి పాల్పడనంత వరకు అతను ఉత్తమమయినవాడు.**[4]

1. పైన పేర్కొన్న సూచనే. 2. నవవీ, షరహ్ ముస్లిమ్, సం. 1, భాగం 2, పు. 141.
3. షోకానీ, నైలల్ అవ్తార్ - 6 : 75. 4. అబూ దావూద్, కితాబుల్ అదబ్.

ఈ హదీసు వివరణలో అల్లామా మనావీ (రహ్మ) ఇలా అన్నారు :

... فيرد عنهم من ظلمهم فى مال او عرض او بدن ... مالم يظلم الدافع فى دفعه بان تعدى الحد الواجب فى الدفع٣

... అతను కుటుంబం వారి ధన మాన దేహాల పైన దాడి జరిగినప్పుడు దాన్ని త్రిప్పికొడతాడు... ఇలా రక్షణ చేసేవాడు, ఈ విషయంలో అవసరం మేరకు దాట కుండా ఉన్నంత వరకు ప్రశంసనీయుడే.[1]

భార్యాపిల్లల రక్షణకు సంబంధించిన చట్టపరమయిన స్థితిని గురించి అల్లామా నవవీ ఇలా అంటారు :

و اما المدافعة عن الحريم فواجبة بلا خلاف١

భార్యాపిల్లల పక్షాన రక్షణ విషయం విధి అయినదనడంలో ఎటువంటి భేదాభిప్రాయం లేదు.[2]

## శీలం, మానాల రక్షణ

శీలం, మానాలు సయితం మానవుని ప్రాథమిక హక్కుల్లో ఒకటి. వాటి పైన దాడి జరిగినట్లయితే అతను కడవరకూ పోరాడి రక్షించుకోగలడు. ఈ విషయంలో దాడి జరిపేవానికి కలిగే హానికి అతనిపైన ఎటువంటి బాధ్యత మోపడం జరగదు. హనఫీ ఫిక్హ్‌లో ఇలా ఉంది :

ఎవరయినా ఒక స్త్రీ పట్ల బలాత్కారానికి పాల్పడ ప్రయత్నిస్తే అరచినా కొట్టి పారద్రోల ప్రయత్నించినా అతడు పారిపోడని ఆమెకు అనిపిస్తే ఆమె అతన్ని చంపి వేయగలదు. ఈ సందర్భంలో హతుని హత్యకు పరిహారం లేదు. ఇదే హక్కు తక్కువ వయసులో ఉన్న పిల్లవానికి వర్తిస్తుంది, ఎవరయినా అతని పట్ల బలవంతాన చెడు పనికి పూనుకుంటే అతను ఆ వ్యక్తిని చంపివేయగలడు.[3]

ఇమామ్ అహ్మద్‌ని ప్రశ్నించడం జరిగింది, ఏ వ్యక్తి అయినా ఒక స్త్రీ పైన దుష్ట సంకల్పంతో దాడిచెయ్యగా ఆ స్త్రీ తన మాన రక్షణ కోసం అతన్ని చంపివేస్తే దాని పట్ల షరీఅత్ ఆదేశమేమిటీ అని. దానికి ఆయన, ఆ స్త్రీకి, అతను తనను మానభంగం చేయగోరుతున్నాడన్న నమ్మకం కలిగితే ఆమె అతన్ని చంపివెయ్యగలదు. ఆమెను పట్టుకోవడం జరగదు.

---

1. *మనావీ - అత్ తైసీర్ బి షరహిల్ జామియిస్సగీర్ - 1 : 534.*
2. *నవవి - షరహ్ ముస్లిమ్ - 1:81.*
3. *అలాఉద్దీన్, ఇబ్ను ఆబిదీన్, దుర్ర్ ముఖ్తార్ మఅరద్దుల్ ముఖ్తార్ - 3 : 248.*

ఈ సందర్భంలో ఆయన హజ్రత్ ఉమర్ (ర) చేసిన ఒక తీర్పును సయితం ఉటంకించారు. ఒక వ్యక్తి ఒక స్త్రీతో చెడు పనికి పూనుకున్నాడు. ఆ స్త్రీ అతన్ని బండరాయితో కొట్టి చంపివేసింది. అప్పుడు మహనీయ ఉమర్ (ర) ఇలా అన్నారు: దైవం సాక్షి! ఈ హత్యకు పరిహారం ఇవ్వడం జరగదు.[1]

## శీల రక్షణ విధి అయినదా?

అల్లామా ఇబ్ను కద్దామ హన్బలీ ప్రకారం, ఒక వ్యక్తి ఏ స్త్రీతోనయినా చెడు పనికి పూనుకుంటే ఆమె తన మాన రక్షణ చేసుకోవడం విధి అయినది, ఎందుకంటే అతనికి మానభంగం అవకాశం కల్పించడం హరామ్, నిషిద్ధం కాబట్టి. రక్షణకు పోరాడకపోవడం అంటే అర్థం ఆ స్త్రీ దాడి చేసేవాడికి ఒక విధంగా ఆ అవకాశాన్ని కల్పిస్తుందన్నమాట.[2]

## రక్షణలో సహాయపడటం

ఒకరి ధన, మాన, ప్రాణాలు, భార్యాపిల్లలపైన దాడి జరిగినప్పుడు ఇస్లామ్ ప్రకారం, ఆ దాడి జరిపేవాడిని ఆపగలిగే వ్యక్తి ఆపాక, బాధితుని రక్షణలో చేయగలిగిం దేమయినా చేయాలి. ఇది సమాజం నిర్వర్తించవలసిన నైతిక బాధ్యత. ఇంకా ముందుకు వెళ్ళి, బాధితుణ్ణి రక్షించడానికి దాడి జరిపేవాడి ప్రాణాలు తీయవలసి వచ్చినా దానికీ వెనుకాడరాదని ఇస్లామ్ అనుమతినిస్తుంది. ఒకే షరతు, అతని ప్రతి చర్య చట్టం పరిధి లోపలే ఉండాలి.

అల్లామా ఇబ్ను కద్దామ హన్బలీ ఇలా అన్నారు: "ఎవరయినా ఒకరి ధన ప్రాణాలపైన దాడి జరిపినట్లయితే లేదా ఒక స్త్రీ మానం దోచుకోదలిస్తే, ఎవరిపైన దాడి జరగలేదో వారు, వీరిని రక్షించడానికి సహాయపడాలి. అలాగే దొంగలు దోపిడిదారులు ఏ బిడారుపైనయినా దాడి జరిపినట్లయితే, బిడారులో లేనివారికి, వీరికి సహాయపడే అనుమతి ఉంది. దైవ సందేశహరులు (స) ఇలా నుడివారు, "మీ సోదరునికి సహాయపడండి, అతను అత్యాచారి అయినా, అత్యాచారానికి గురయిన వాడయినా." మరో హదీసులో, "ఉపద్రవ జనకులకు ఎదురుగా విశ్వాసులు ఒండొకరికి సహాయపతారు." అన్యాయానికి ఎదురుగా ఒకరికొకరు సహాయపడకపోతే ప్రజల ధన ప్రాణాలూ సమస్త కొల్లగొట్టబడతాయి. దొంగలు, దోపిడిదారులూ ఒకరి

---

1. ఇబ్ను కద్దామ - అల్ ముగ్ని - 12 : 533.
2. ఇబ్ను కద్దామ - అల్ ముగ్ని - 12 : 533.

సొమ్ము, దోచుకున్నప్పుడు ఇతరులు అతనికి సహాయపడకపోతే ఒకరి తరువాత మరొకరి సొమ్ము, అందరి సొమ్ము వారు దోచుకుపోతారు. అలాగే ఇతరుల విషయమూ ఇంతే.[1]

హనఫీ ఫిక్హ్‌లో ఇలా ఉంది : ఒక వ్యక్తి ఎవరిపైనయినా కత్తిదూసి నప్పుడు మరో వ్యక్తి అతన్ని చంపి వేసినట్ల యితే చట్టపరంగా ఇతన్ని పట్టుకోవడం జరగదు.[2].

అయితే అనవసరంగా ఎవరి ప్రాణాలూ తీయరాదన్న విషయాన్నీ చట్టం గమనిస్తుంది.

ఒక వ్యక్తి దాడి జరిపిన తరువాత, మళ్ళీ తిరిగివచ్చి దాడి జరిపే సంశయమే లేనట్లుగా పారిపోయినట్లయితే, దాని జరిగిన వ్యక్తి లేదా మరో వ్యక్తి ఎవరయినా అతన్ని చంపినట్లయితే అతను అపరాధిగా పరిగణించబడతాడు. అతన్ని హత్యకు ప్రతీకార చట్టం ప్రకారం హత్య చెయ్యడం సాధ్యమే.[3]

దొంగ ఒకరి ఇంట్లో కన్నం వేస్తూ ఉండగా ఎవరయినా చూస్తే, కేకలు వేసినా అతను పారిపోకపోతే ఆ దొంగను చంపివేయడం న్యాయబద్ధమే.[4]

ఒక వ్యక్తి ఓ పరాయి స్త్రీతో ఉన్నట్లు ఎవరయినా గమనించి, ఆ వ్యక్తి కేకలు పెట్టినా భయపెట్టినా ప్రాణాంతకంకాని కర్రతోగాని మరే ఆయుధంతోగాని కొట్టినా స్త్రీని వదలి పారిపోడని నమ్మకం కుదిరినట్లయితే అతను ఆ వ్యక్తిని చంపగలడు. కాని చంపకుండా అతన్ని పారద్రోలడం సాధ్యమయితే చంపడం సరయినది కాదు.[5]

ఇదే ఆదేశం, ఇతరులకు హాని కలిగించే అపరాధాలు చేసే వారికి వర్తిస్తుంది. బాహాటంగా, ప్రకటితంగా అన్యాయానికీ అక్రమానికీ పాల్పడేవారికీ ఇదే ఆదేశం వర్తిస్తుంది. సాధారణ పౌరులకు ఇది ధర్మసమ్మతమయినదయితే ప్రభుత్వానికి దీన్ని అమలుపరచడం విధ్యుక్తమయినది.[6]

ఇది ఒక వ్యక్తికి సంబంధించిన విషయం. ఒక వ్యక్తి ఎక్కడయినా సాధారణ ముస్లిమ్ జనావాసం పైన దాడి చేసి, బాహాటంగా లూటీలు, హత్యాకాండ మొదలెడితే, అతను ఎవరిపైన దాడి చేశాడో మరెవడు దాడి నుండి భద్రంగా ఉన్నాడో అన్న

---

1. ఇబ్ను కద్దామ - అల్ ముగ్ని - *12 : 534, 535.*
2. అలా ఉద్దీన్, ఇబ్ను ఆబిదీన్, దుర్రుల్ ముఖ్తార్ - రద్దుల్ ముఖ్తార్ - *5 : 481.*
3. అలా ఉద్దీన్, ఇబ్ను ఆబిదీన్, దుర్రుల్ ముఖ్తార్ - రద్దుల్ ముఖ్తార్ *-5 : 482*
4. పై సూచన; 5. పై సూచన*-2 : 248;* 6. పై సూచన పు. *249*

విషయాన్ని అలా ఉంచి అతన్ని వారించే ప్రయత్నం చెయ్యడం అందరి విధి. ఇందులో సఫలం కాకపోతే అతన్ని చంపివేయాలి. అతన్ని చంపివేసిన వ్యక్తిపైన హత్యా పరిహారంగాని, హత్యాప్రతీకార చట్టంగానీ వర్తించవు. హిదాయ కృతికర్త అల్లామ మర్గయినాని ఇలా అన్నారు: దీనికి ఒక ఆధారం దైవసందేశహరుల (స) ఈ హదీసు:

من شهر على المسلمين سيفاً فقد اطل دمه[1]

**ఎవరయితే ముస్లిములకు వ్యతిరేకంగా కత్తి దూశాడో అతను తన రక్తం వృథా చేసుకున్నాడు. (అంటే అతన్ని చంపివేసినా అతని ప్రాణానికి విలువలేదు.)[1]**

రెండవ ఆధారం, అతను ఇస్లామీయ రాజ్యం పట్ల తిరుగుబాటుదారు. తిరుగుబాటు వల్ల అతను హత్యకు పాత్రుడయ్యాడు. అందువల్ల అతన్ని హతమార్చడం సరయినదే. మూడవ ఆధారం ఏమిటంటే, తన హత్యకు స్వయంగానే ఇతరుల్ని వివశులు చేశాడు. ఎందుకంటే, తమ ప్రాణాలు కాపాడుకోవడానికి అంతకు మించి మరో మార్గం మిగుల లేదు.[2]

హనఫీ ఫిక్‌హ్‌లో ఇలా ఉంది: ఇస్లామీయ రాజ్యం ముస్లిమ్ పౌరులపైకి కత్తి దూసినవారికి సంబంధించిన ఆదేశమే, ముస్లిమేతర పౌరులపైన కత్తి దూసినవారి పట్లనూ వర్తిస్తుంది.[3]

దీని భావమేమిటంటే, ఏ వ్యక్తి ఇస్లామీయ రాజ్యంలో ముస్లిమేతర పౌరులకు (జిమ్మీలకు) ప్రతిగా కత్తిదూసి హత్యాకాండకు పూనుకుంటాడో అతడు ముస్లిమ్ వ్యక్తి అయినా సరే హత్య చెయ్యకుండా అతన్ని ఆపడం వీలుకాకపోతే అతన్ని హతమార్చడం తప్పనిసరి.

## రక్షణ చేసుకునేవానిపైన దాడి జరిపేవాని నష్టం పట్ల బాధ్యత లేదు

రక్షణ కృషిలో దాడి జరిపేవాని ప్రాణం కూడా పోవచ్చు. అతనికి మరేదయినా

---

1. *ఈ హదీసు, హదీసు గ్రంథాలలో ఈ పదాలలో ఉటంకించబడలేదు. దీని సమానార్థక హదీసులు నసాయి, ఇస్‌హాక్, హాకిమ్, తబ్రాని ప్రభృతులు ఉటంకించారు. నసాయిలోని పదాలు ఇవి .... (అరబీ)... 'ఎవరయితే కత్తిదూసి ప్రజల మధ్య రక్తపాతం జరిపాడో అతని హత్యకు విలువ ఉండదు.' వివరాలకు చూడండి, అద్దిరాయితుఫీ తఖ్‌రీజ్ ఆహాదిసుల్ హిదాయ – పుట : 363.*
2. *మర్గయినానీ, హిదాయ – 4 : 564*   3. *ఇబ్ను ఆబిదీన్, రద్దుల్ ముఖ్తార్ – 5 : 481.*

హాని కలగవచ్చు. ఈ హాని లేదా నష్టం అతని దాడి వల్ల జరిగినట్లయితే రక్షణ చేసుకునే వానిపైన హత్యా పరిహారంగాని, హత్యా ప్రతీకారం గాని విధించబడదు.

హజ్రత్ ఇమ్రాన్ బిన్ హిసీన్ (ర) ఉల్లేఖనం ప్రకారం, ఇద్దరు వ్యక్తుల మధ్య పోట్లాట జరిగింది. ఒకడు మరొకని చెయ్యి కొరికివేశాడు. అతను తన చెయ్యి బలంగా లాక్కున్నాడు. అప్పుడు ఆ కొరికేవాని రెండు ముందు పల్లు రాలిపోయాయి. వారి ఈ పోట్లాట తీర్పుకై దైవప్రవక్త మహనీయుల (స) వద్దకు వెళ్ళింది. ఎవరి పల్లు రాలిపోయాయో అతను పరిహారం కోరాడు. ఆయన, 'మీలో ఎవరయినా మరొకరి చెయ్యి ఒంటెలా నమిలివేస్తే అతను గమ్మున ఉండిపోవాలా?' అని అడిగారు, ఇంకా, 'వెళ్ళండి దీనికి ఎటువంటి పరిహారం లేదు.'[1] అని పురమాయించారు.

ఈ హదీసు ద్వారా ఇమామ్ అబూ హనీఫా, ఇమామ్ షాఫియీ, ఇమామ్ అహ్మద్ ప్రభృతులు పండితగణ్యులు అధికంగా ఇలా నిర్ణయానికి వచ్చారు: ఎవరయినా మరో వ్యక్తి చెయ్యి తన పల్లతో కొరికినప్పుడు అతన్నుండి విడిపించుకునే కృషిలో ఆ వ్యక్తి పల్లు రాలిపోయినట్లయితే విడిపించుకునే వ్యక్తిపైన పరిహారం మోపబడదు, ప్రతీకారం తీర్చుకోబడదు. ఎందుకంటే దాడి జరిపినవాని నుండి రక్షణకు సంబంధించిన వ్యవహారమిది.

ఇమామ్ మాలిక్ ప్రకారం, ఏ వ్యక్తి కారణంగా ఒకరి పల్లు ఊడిపోయాయో అతను దానికి బాధ్యుడవుతాడు. ఇమామ్ మాలిక్‌ను సమర్థిస్తూ చేసిన వాదనలన్నింటినీ హాఫిజ్ ఇబ్ను హజర్ ఖండించారు. కొందరేమో, బహుశా ఇమామ్ మాలిక్ వరకు ఈ హదీసు చేరలేదేమో అని అన్నారు. ఎందుకంటే హదీసు వంటి మూలాధారం ఉండగా ఆయన ఊహ ద్వారా సమస్యకు పరిష్కారాన్ని చూపెట్టేవారు కారు.[2]

కాని మాలికీ ధర్మవేత్తల్లో తరువాతివారు ఈ హదీసు సందర్భాన్ని నిర్ధారించడానికి ప్రయత్నించారు. కాగా ఇలా అన్నారు : ఒకవేళ ఎవరయినా ఒకరి చెయ్యి పల్లతో కొరకగా ఆ వ్యక్తి తన చెయ్యిని కావాలని ఎదుటివాని పల్లు విరిగేటట్లు లాక్కున్నట్లయితే అతనిపైన పరిహారం విధించబడాలి. కాని అతను కావాలని అలా చెయ్యకపోతే, అతని పల్లు విరగకుండా తన చెయ్యిని కాపాడుకోవడం అతనికి సాధ్యపడకపోతే అతనికి పరిహారం విధించబడదు. దీన్ని సమర్థిస్తూ పైన పేర్కొన్న హదీసు ఉటంకించబడింది.[3]

---

1. *బుఖారి - కితాబుద్దియ్యాత్*
2. *షరహ్ ముస్లిమ్, నవవి, సం.6, భాగం 11, పు.133; ఫత్‌హుల్ బారి 12/180*
3. *అహ్మద్ అద్ దర్‌దైర్, అష్‌షరహుస్సగీర్ అలా అక్రబల్ మసాలిక్ 4/506*

ఇదే మాటను ధర్మవేత్తలందరూ పలికారు. కాగా హాఫిజ్ ఇబ్ను హజర్ ఇలా అన్నారు :

ధర్మవేత్తల్లో అధికుల (జమ్హూర్) అభిప్రాయంలో, దాడి జరిపేవాని పల్లు విరిగే బాధ్యత తొలగాలంటే రెండు షరతులు ఉండాలి. ఒకటి, దాడి జరిపేవాడు పల్లతో కొరికినప్పుడు రక్షణ చేసుకునేవానికి దాని బాధ నొప్పి కలగాలి. రెండు, గట్టిగా చెయ్యిని విడిపించుకోవడం తప్ప అతనికి మరో గత్యంతరం మిగులరాదు. ఉదాహరణకు, అతను దాడి జరిపేవాని ముఖాన లేదా చెంపపైన కొట్టి విడిపించుకోలేకపోతే, ఇలా సంభవమయ్యే ఆస్కారమున్నప్పటికీ దాడి జరిపేవాని పల్లు ఊడిపోయేలా అతను విడిపించుకునే ప్రయత్నం చేసి ఉన్నట్లయితే అతని ఈ చర్య క్షమార్హమయింది కాదు.[1]

కొందరు పండితులయితే దానికి ఒక ప్రత్యేక పద్ధతి కూడా చూపెట్టారు. అల్లామా ఇబ్ను కద్దామ హన్బలి ప్రకారం, దానికి ఎటువంటి ప్రాముఖ్యత లేదు. దీనివల్ల కొన్ని ఇతర చిక్కులు పుట్టే అవకాశముంది.[2]

షాఫియా పండితులలో ఓ అభిప్రాయం ప్రకారం, ఎవరయినా ఒక వ్యక్తిని పల్లతో కొరుకుతున్నట్లయితే అతనికి తన చెయ్యిని లాక్కునే హక్కుంది. అతడు మరో సులువయిన పద్ధతి అవలంబించగలడా లేదా అన్న విషయానికి ఎటువంటి ప్రాముఖ్యత లేదు.[3]

ఎవరిని కొరకడం జరిగిందో అతను తన రక్షణలో కొరికేవానిని ఎక్కడయినా దెబ్బతీయవచ్చు. హాఫిజ్ ఇబ్ను హజర్ ఇలా అన్నారు :

ولو جرحه المعضوض فى موضع آخر لم يلزمه شيء

**ఎవరినయితే పల్లతో కొరకడం జరిగిందో అతను కొరికేవాడిని మరో చోట గాయ పరిస్తే అతనిపైన ఎటువంటి బాధ్యత తారసపడదు.**[4]

---

1. *ఇబ్ను హజర్ – ఫత్హుల్ బారి, 12/180* 2. *అల్ ముగ్ని 12/538, 539*

3. *అల్లామా షోకానీ కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు. నైలల్ అవ్తార్ – 7/172. ఒక వ్యక్తి ఎవరినయినా పల్లతో కొరికినట్లయితే అతను తన్ను తాను ఎలా కాపాడుకోవాలి అన్న అంశంపైన చర్చ చెయ్యవచ్చు. కాని రక్షణలో ఒక క్రమపద్ధతిని అనుసరించాలన్న విషయం మటుకు అవసరం. వివరాలు ముందు వస్తున్నాయి.*

4. ఫత్హుల్ బారి – 12 : 180

పల్లతో కొరకడం ఒక ఉదాహరణ. అది ఈ ప్రస్తావిత హదీసులో చర్చకు వచ్చింది. దీన్నిబట్టి ముందుకు వచ్చిన వాదన ప్రకారం దాడి ఏ విధంగా జరిగినప్పటికీ మనిషికి దాన్నుండి రక్షణ పొందే హక్కుంది. దాని ఫలితంగా దాడి జరిపే వానికి ఏదయినా హాని కలిగితే, కడకు అతని ప్రాణం పోయినా రక్షణ చేసుకునే వానిపైన దీని బాధ్యత ఉండదు. హాఫిజ్ ఇబ్ను హజర్ ఇలా అన్నారు :

**فيه دفع الصائل و انه اذا لم يكن الخلاص منه الا بجناية على نفسه او على بعض اعضائه ففعل به ذلك كان هدرا[2]**

**ఈ హదీసులో దాడి జరిపేవాని నుండి రక్షణపొందే నిరూపణ ఉంది. దాడి జరిపే వాని ప్రాణం తీయకుండా, లేదా అతని ఏ అవయవానికీ హాని కలిగించకుండా దాడి నుండి రక్షణ పొందే అవకాశం లేకపోతే రక్షణ పొందేవాడు అటువంటి చర్య ఏదయినా తీసుకుంటే దాని బాధ్యత అతనిది కాదు.[1]**

అల్లామా ఇబ్ను కద్దామ హన్బలీ ఇలా అన్నారు :

**... كذلك الحكم فى ما اذا عضه فى غير يده او عمل به عملا غير العض اقضى الى تلف شىء من الفاعل لم يضمنه[3]**

**ఆ వ్యక్తి చెయ్యినికాక మరో చోట కొరకినా మరే విధంగా చర్య తీసుకోవడం వల్ల ఫలితంగా దాడి జరిపేవానికి ఏదయినా హాని కలిగినా రక్షణ చేసుకునేవాడు దానికి బాధ్యుడు కాదు.[2]**

## రక్షణ చర్యల్లో అత్యంత సులువయిన పద్ధతి అవలంబనను పాటించాలి

ధన రక్షణ విషయంలో హజ్రత్ అబూహురైరా (ర) హదీసు ఇంతకు ముందు వచ్చింది. అదే హదీసు ముస్నద్ అహ్మద్‌లో ఈ పదాలలో వచ్చింది :

**يا رسول الله أرأيت ان عدى على مالى قال فانشد الله قال فان ابوا على قال انشد الله قال**

**దైవప్రవక్తా, నా సొమ్ముపైన అత్యాచారం జరిగితే (దాన్నెవరయినా దోచుకోయత్నిస్తే) నేనేమి చేయాలి అని అడిగినదానికి ఆయన, 'దోచుకునేవారికి అల్లాహ్ పేరు**

1. ఫత్‌హుల్ బారి - 12:180. 2. అల్ ముగ్ని - 12 : 538

చెప్పి భయపెట్టు.' అని అన్నారు. అతను, 'వారు నా మాటను ఖాతరు చేయక పోతే?' 'వారికి అల్లాహ్ పేరు చెప్పి భయపెట్టు.' 'అప్పటికీ వారు మాట వినకపోతే,' అప్పుడు (ఆయన మూడవసారి కూడా) వారికి అల్లాహ్ పేరిట భయపెట్టు అనే సెలవిచ్చారు. ఆపైన 'అప్పటికీ వారు నా మాటను ఖాతరు చేయకపోతే', అని అడిగిన దానికి, 'వారిని ఎదుర్కో, నీవు చంపబడితే స్వర్గంలోకి పోతావు, నీవు అతన్ని చంపివేస్తే అతను నరకంలోకి పోతాడు.'[1]

فان ابو على قال فانشد الله قال فان ابوا على قال فقاتل فان قتلت ففى الجنة و ان قتلت ففى النار[1]

ఈ హదీసును ఆధారం చేసుకుని అత్యంత సులువయిన విధానం అవలంబించడం జరుగుతుందన్న సూత్రాన్ని ఏర్పరచుకోవడం జరిగింది.[2]

దీని భావమేమిటంటే, రక్షణకు సాధ్యమయిన సులభతర విధానాన్ని అవలంబించడం జరగాలన్నమాట. ఈ పద్ధతి సరిపోదని లేదా ప్రయోజనకరం కాదని. తేలితే కాస్త కఠినమయిన పద్ధతి నవలంబించడం జరుగుతుంది. దాడి జరిపేవాడు కేకలు పెట్టడం వల్ల పారిపోయే అవకాశముంటే అతనిని దుడ్డు కర్రతో కొట్టి పారద్రోలే ప్రయత్నం జరగదు. లేదా అతన్ని కర్రతో కొట్టి పారద్రోలడం సాధ్యమయితే కత్తితో చంపడం జరగదు. అల్లామా షోకాని ఇలా అన్నారు :

రక్షణలో అన్నింటికన్నా ముందు సులభతరమయిన పద్ధతిని అవలంబించాలి, ఆ తరువాత కాస్త కఠినమయిన పద్ధతిని అవలంబించాలి. మనిషిని చంపకుండా రక్షణ పొందే అవకాశం ఉన్నంత వరకు, రక్షణ కోరుకునేవాడు, దాడి జరిపేవాణ్ణి చంపే చర్యకు పూనుకోలేదు. దైవ

ينبغى تقديم الاخف فالاخف فلا يعدل المدافع الى القتل مع امكان الدفع بدونه ويدل على

1. ముస్నద్ అహ్మద్ - 2 : 339; నసాయి - కితాబ్ తహ్రీముద్దమ్
2. షోకాని - నైలల్ అవ్తార్ : 6 : 74

ذالک امــره صلی الله علیه وسلم بانشاد الله قبل المقاتلة[1]

**సందేశహరులు (గత హదీసులో), చంపే క్రియకు పూర్వం దాడి జరిపేవానిని అల్లాహ్ పేరిట ఆపాలని చెప్పడం దీన్నే సూచిస్తోంది.**[1]

అల్లామా ఇబ్ను కద్దామ హన్బలి ప్రకారం, ఒక వ్యక్తి ఎవరి ఇంట్లోనయినా చొరబడితే ఇంటివారు కేకలు పెట్టడం వల్ల అతను పారిపోతే ఇంటి యజమానికి అతని ప్రాణం తీసే హక్కు లేదు. ఎందుకంటే ఉద్దేశ్యం కేవలం అతను ఇంటి నుండి వెళ్ళిపోవాలన్నదే. అలాగే దుడ్డుకర్ర ప్రయోగంతో అతను పారిపోతే ప్రాణాంతక మయిన ఆయుధం ప్రయోగించే అనుమతి లేదు. ఇంకా దాడి జరిపేవాణ్ణి గాయపరచి అతన్ని దాడి జరపకుండా అశక్తుణ్ణి చేసివేసినట్లయితే అతన్ని చంపివేసే అధికారం లేదు. (ఇలా జాగ్రత్తపడినప్పటికీ) ఎదురుపోరులో దాడి జరిపినవాడు చనిపోతే అతని హత్య వృధాపోతుంది. రక్షణ చేసుకునేవాని బాధ్యత దాని పట్ల ఏమీ ఉండదు. ఎందుకంటే ఇటువంటి పరిస్థితుల్లో దాడి జరిపేవాడు స్వయంగానే ఇంటి యజమానిని గత్యంతరంలేని స్థితిలో వదిలాడు. మరో విధంగా అతను ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పవచ్చు.[2]

హనఫీ ఫిక్‌హ్ ప్రకారం రాత్రివేళ ఎవరయినా ఒకరి ఇంటిలో చొరబడి అతని సొమ్ము దోచుకోదలిస్తే అతన్ని చంపడం సరయినదే. అలాగే ఎవరయినా సొమ్ము తీసుకుని పారిపోతున్నట్లయితే వెంబడించి కూడా అతన్ని చంపివేయవచ్చు. అయితే చంపడం తప్ప తమ సొమ్ము తిరిగి తీసుకునే గత్యంతరంలేని పక్షంలోనే ఇలా చెయ్యడం సరయినది.[3]

ఇదే మాటను ఈ విధంగా కూడా చెప్పడం జరిగింది :

ھٰذا اذا لم یعلم انه لو صاح علیه طرح ماله و ان علمه ذٰلک فقتله مع ذٰلک وجب علیه القصاص[2]

**దొంగను చంపడం ఒకరికి అనుమతించబడాలంటే అతను కేకలువేసి గలాభా చేస్తే దొంగ, సొమ్ము వదలిపెట్టిపోతాడన్న విషయం అతనికి తెలియకపోయి నప్పుడే సాధ్యం. కాని ఇది తెలిసినప్పటికీ అతను**

---

1. షోకాని – నైలల్ అవ్‌తార్ : 6 : 75
2. వివరాలకు చూడండి – అల్ ముగ్ని :12 : 531, 532.
3. ముర్గైనానీ : హిదాయ : 4 : 565.

**దొంగను చంపివేసినట్లయితే అతనిపైన హత్యా ప్రతీకారం విధించడం జరుగుతుంది.**[1]

ఇస్లామీయ రాజ్యంలో ఎవరయినా ముస్లిమ్‌పైనయినా, జిమ్మీ (ముస్లిమేతర పౌరుడి పైనయినా కత్తి ఎత్తినట్లయితే అటువంటి వారిపైన ప్రభుత్వం తీసుకునే చర్యను గురించి ముందు చర్చించబడింది. ఈ విషయంలో హనఫీ ఫిక్‌హ్‌లో ఇలా ఉంది:

ويجب دفع من شهر سيفاً على المسلمين ولو بقتله ان لم يمكن دفع ضرره الا به

**ఎవరయితే ముస్లిములకు ఎదురుగా కత్తి ఎత్తి పోరాడతాడో అతన్ని ఎదుర్కొని రక్షణ పొందడం తప్పనిసరి; దానికి అతన్ని చంపవలసి వచ్చినాసరే. మరో విధంగా అతన్ని వారించడం వీలుకాని పక్షంలోనే ఇది వర్తిస్తుంది.**

దీనికి కారణం ఏమిటంటే, మూలతః హానిని తప్పించడమే విధి అయినది. ఎవరినయినా చంపడం, ప్రాణం తీయడం కాదు. ఒకరి ప్రాణం తీయకుండా హానిని వారించడం సాధ్యమయితే అతని ప్రాణం ఎట్టి పరిస్థితుల్లోనూ తీసుకోవడం జరగదు.[2]

## ఏ చర్య తీసుకునే నిర్ణయమయినా పరిస్థితుల రీత్యా జరుగుతుంది

ఏ సమయాన ఏ రక్షణ చర్య తీసుకోవాలి, ఏ చర్య అప్పుడు సరయినది, చట్టానికి అనుగుణ్యమయినది, ఏది తప్పయినది ఏది చట్టానికి విరుద్ధమయినదిగా పరిగణించబడుతుంది అన్న విషయం దాడి జరిగిన పరిస్థితులను బట్టి ఉంటుంది.

ఎవరయినా ప్రాణాలు తీసే ఉద్దేశంతో ఒక వ్యక్తిపైన కత్తి దూసినట్లయితే లేదా మరే ప్రాణాంతకమయిన ఆయుధం ఎత్తినా ఆ వ్యక్తికి తన రక్షణలో దాడి జరిపేవాణ్ణి చంపే హక్కుంది. ఆ దాడి జనావాసంలో జరిగినా జనం లేనిచోట జరిగినా, పగలు జరిగినా రాత్రి జరిగినా, ఎందుకంటే చర్య తీసుకోవడంలో అతను జాగు చేసినట్లయితే అతని ప్రాణాలు పోయే ప్రమాదముంది. అలాకాక దాడి, ఏదయినా కర్రతో, చేతి కర్రతో లేదా ఏదయినా ప్రాణాంతకం కాని ఆయుధంతో జరిగినట్లయితే దాడి ఎప్పుడు

1. *ఇబ్ను ఆబిదీన్, రద్దుల్ ముఖ్తార్ : 5 : 486.*
2. *ఇబ్ను ఆబిదీన్, రద్దుల్ ముఖ్తార్ – దుర్రుల్ ముఖ్తార్ : 5 : 481*

జరిగింది, ఎక్కడ జరిగింది అన్న అంశాలు పరిగణనలోకి వస్తాయి. దాడి జనావాసంలో జరిగినట్లయితే దాడి చేసేవాణ్ణి చంపే అధికారం ఆ వ్యక్తికి ఉండదు. ఎందుకంటే అతను తన సహాయార్థం ఇతరుల్ని పిలువగలడు. ఇతరులు వచ్చే వరకు అతని ప్రాణాలు పోయే ప్రమాదం లేదు. దాడి రాత్రివేళ జరిగినట్లయితే లేదా ఏదయినా ఏకాంత ప్రదేశంలో జరిగినట్లయితే అతను తన రక్షణలో దాడి జరిపేవాణ్ణి చంపగలడు. ఎందుకంటే అక్కడ సహాయానికి ఎవరయినా చేరడం సాధ్యమయ్యేపని కాదు. కర్ర లేదా దుడ్డుకర్ర దాని దెబ్బకు ప్రాణం పోయే ఆస్కారమున్నట్లయితే, ఇమామ్ అబూ యూసుఫ్, ఇమామ్ ముహమ్మద్ (ర) ప్రకారం, దాడి రాత్రివేళ జరిగిందా పగలా అని చూడటం జరగదు.[1]

ధనం రక్షణ విషయంలో ఒక దొంగను లేదా దోపిడీదారుని చంపాలంటే పరిస్థితుల రీత్యా, కేకలు వేసినట్లయితే అతను సొమ్ము వదలిపోవడని తెలిసినప్పుడే సాధ్యం. భయపెట్టడం, బెదరించడం, కేకలు పెట్టడం, గలాభా చెయ్యడం ద్వారా అతను పారిపోగలడని తెలిసినప్పటికీ అతన్ని చంపినట్లయితే హంతకునిపై హత్యా ప్రతీకారం విదితమవుతుంది.[2]

## రక్షణ చర్యకు ఆధారం కావాలి

రక్షణకు ఎటువంటి చర్య తీసుకోవాలన్నా దానికి సరయిన ఆధారం నిరూపణ కావాలి. అల్లామా ఇబ్ను కద్దామ హన్బలీ ప్రకారం:

ఎవరయినా, ఫలానా వ్యక్తి తన ఇంట చొరబడ్డాడని చెప్పి అతన్ని హత మార్చడం తప్ప పారద్రోలే మార్గం ఏదీ లేకపోయిందని అతనంటే అతని ఈ మాటను నిరూపణ లేకుండా అంగీకరించడం జరగదు. అతన్నుండి హత్యా ప్రతీకారం గ్రహించడం జరుగుతుంది. హతుడు దొంగతనాలకు, వంచనలకు ప్రసిద్ధి చెందిన వాడా కాదా అన్న విషయం వల్ల ఎటువంటి వ్యత్యాసం తారసపడదు. హతుడు ఒకరి ప్రాణం తీయడానికి ప్రసిద్ధమయిన ఆయుధాలు చేతబూని హంతకుని వైపునకు పురోగమిస్తూ ఉండగా చూసినట్లు, హంతకుడు తన రక్షణలో హతుని చంపినట్లు సాక్షులు సాక్ష్యం ఇవ్వాలి. కాని ఒకవేళ సాక్షులు, తాము ఆ వ్యక్తిని అతని ఇంటికి వెళుతున్నట్లు చూశాము అని చెప్పి ఆయుధాలను ప్రస్తావించకపోయినట్లయితే అతన్నుండి హత్యా ప్రతీకారం తొలిగిపోదు. ఎందువల్లనంటే మనిషి ఎవరి

1. మర్గయినాని, హిదాయ : 4 : 564 2. దారుల్ ముఖ్తార్ రద్దుల్ ముఖ్తార్ 5/282

ఇంటినయినా ఏ అవసరంతోనయినా ప్రవేశించగలడు. కేవలం అతను ఇంట ప్రవేశించినంత మాత్రాన అతని రక్తం చిందించడం ధర్మసమ్మతమయిపోదు.[1]

కాని కళ్ళారా చూసే సాక్షులు అక్కడలేని పరిస్థితులు కూడా తారసపడటం సాధ్యమే. తనకు సాక్షులు ఎవరూ లేరన్న సంశయంతో ఎవరయినా తన రక్షణ చేసుకోకపోతే అతని ధనప్రాణాలకు ముప్పు మూడే ప్రమాదముంది. హనఫీ ఫిక్హ్‌లో ఈ సమస్యను పరిష్కరించే ప్రయత్నం జరిగింది. అదేమిటంటే, ఇంటిలోకి ప్రవేశించిన వ్యక్తి తనతో వాదులాడాడని, తనతో ఘర్షించాడని సాక్ష్యాధారంతో నిరూపిస్తే అతన్ని హతమార్చడం సరయినదే. అతన్నుండి హత్యా ప్రతీకారం గ్రహించడం జరగదు. కాని అతను అటువంటి నిరూపణ పొందుపరచలేకపోతే అప్పుడు హతుడు కల్లోలాలు సృష్టించడంలో చెడును వ్యాపింపజెయ్యడంలో ప్రతీతి పొందిన వాడా కాడా అన్న విషయాన్ని పరిశీలించడం జరుగుతుంది. అతను ఈ విషయంలో ప్రసిద్ధి పొందిన వాడు కాకపోయినట్లయితే ఇంటి యజమాని నుండి హత్యాప్రతీకారం గ్రహించడం జరుగుతుంది. కాని ఒకవేళ ఈ విషయంలో ప్రసిద్ధి పొందిన వాడే అన్న విషయం తేలినప్పటికీ అతన్నుండి హత్యాప్రతీకారం తీర్చుకోవడమే సరయినదని తెలుస్తోంది. కాని ఉత్తమ పద్ధతి ఏమిటంటే హతుని వారసులకు హంతకుని ద్వారా 'దియత్' (హత్యా పరిహారం) ఇప్పించడమే సరయినదిగా విదితమవుతుంది. ఎందుకంటే పరిస్థితులయితే హత్యాప్రతీకార విషయాన్ని సందేహాస్పదం చేసివేశాయి, కాని దియత్ విషయంలో ఎటువంటి సందేహం లేదు.[2]

ఒకవేళ ఇద్దరు వ్యక్తులు పోరాడుకుని ఒండొకరిని గాయ పరచుకుంటే, అప్పుడు ప్రతి ఒక్కడు తాను తన రక్షణలోనే ఎదుటి వ్యక్తిని గాయపరచినట్లు వాదించినట్లయితే ఇబ్ను కద్దామ హన్బలీ ప్రకారం ఇద్దరినీ, ఎదుటి వ్యక్తి వాదన తప్పయినదని ప్రమాణం చెయ్యమని చెప్పాలి. వారు ప్రమాణం చేసినప్పుడు గాయపడినవాని బాధ్యత ఎదుటివానిపైన పడుతుంది, ఎందుకంటే ఇద్దరిలో వాదించే వాడు ఒకతనుంటే మరో అతను దాన్ని తిరస్కరిస్తున్నాడు. వాస్తవానికి దాని మూలం అసలే లేదు.[3]

---

1. అల్ ముగ్నీ : 12/536, 537 2. ఇబ్ను ఆబిదైన్, రద్దుల్ ముఖ్తార్ : 5/482
3. అల్ ముగ్నీ : 12 / 537

## రక్షణ చర్య దాడి జరిపినప్పుడే జరుగుతుంది

రక్షణ విషయంలో ఒక విషయం గుర్తుంచుకోవలసి ఉంటుంది. దాడి జరిగినప్పుడే రక్షణ ప్రసక్తి వస్తుంది. దాడి తరువాత రక్షణ ప్రసక్తే రాదు.

ఒక వ్యక్తి దాడి జరిపి వెనక్కి తగ్గినట్లయితే, అతను తిరిగి దాడిజరిపే ప్రమాదం లేకపోతే, అప్పుడు ఎవరిపై దాడి జరిగిందో అతను లేదా మరే వ్యక్తి అయినా ముందుకు వచ్చి అతన్ని హతమార్చినట్లయితే హంతకునిపైన హత్యాప్రతీకారం విధితమవుతుంది. ఎందుకంటే దాడి జరిపిన వ్యక్తి వెనిక్కి తగ్గి దాడిని మానుకోగానే, మునుపు ఏ విధంగా సంహారానికి పాత్రుడు కాడో ఇప్పుడూ మళ్లీ సింహారానికి పాత్రుడు కాడు. అతని రక్తం చిందించడం ధర్మబద్ధం కాదు.[1]

అయితే అతను వెనక్కి తగ్గినా ఆయుధం చేతబూని ఉన్నట్లయితే (అందువల్ల మళ్లీ దాడి జరిపే ప్రమాదమున్నట్లయితే) అతన్ని సంహరించవచ్చు.[2]

## చర్చకు సారాంశం

ఈ విధంగా ఇస్లామ్ బాధితునిలో ధైర్యస్థయిర్యాలను, దృఢసంకల్పాన్ని నూరి పోస్తుంది. వారు తమ ధన, మాన, ప్రాణాలను, భార్యాపిల్లలను, కుటుంబ సభ్యులను, తమ ధర్మం, విశ్వాసాలను ఇతరుల దయాదాక్షిణ్యాలపైన వదలిపెట్టరాదని కోరు తుంది. దానికి బదులుగా అన్యాయం అక్రమం ఏ వైపు నుంచి జరిగినా దాన్ని శూరత్వంతో ఎదుర్కోవాలని కోరుతుంది. అది సమాజానికి బోధించే విషయాల్లో, అత్యాచారానికి ఎదురుగా రక్షణకు స్వయంగా అదీ నిలబడాలి, అటువంటి రక్షణకు బాధితునికి తోడుగా నిలువాలి, ఇంకా అత్యాచారాన్ని అన్యాయాన్ని రూపుమాపడానికి, బాధితుని కాపాడటానికి సాధ్యమయిన ప్రతి యత్నమూ చెయ్యాలి. అంతేకాదు, అన్యాయాన్ని అక్రమాన్ని అత్యాచారాన్ని ఆపడానికి బాధితుడు, అతని తోపాటు సమాజం మొత్తం ఏ చర్య తీసుకున్నా దానికి అది చట్టబద్ధతా ప్రమాణాన్ని అందజేస్తుంది. ఆ విధంగా సమాజం ఏ పరిస్థితిలోనూ చట్టబద్ధంగా అది వివశ స్థాయిలో, నిరాశ్రయ స్థాయిలో ఉన్నట్టు భావించరాదని కోరుకుంటుంది. అయితే బాధితుడు ఏ దశలోనయినా స్వయంగా అత్యాచారిగా మారకుండా, ఆత్మ రక్షణ పేరిట అన్యాయానికి ఒడిగట్టకుండా కూడా పర్యవేక్షణ, పరిశీలన జరుపుతూ ఉంటుంది.



---

1. హిదాయ : 4 / 565
2. ఇబ్ను ఆబిదీన్, దుర్రుల్ ముఖ్తార్, రద్దుల్ ముఖ్తార్ : 5 / 462

# 8. మతపరమయిన స్వేచ్ఛ హక్కు

ఇస్లామ్ మానవులకు ఇచ్చిన హక్కుల విషయంలో మాటిమాటికీ తలెత్తే ప్రశ్న ఏమిటంటే, ఇస్లామీయ రాజ్యంలో ముస్లిమేతరులకు ప్రాప్తమయి ఉన్న హక్కు లేమిటీ? కొన్ని సందర్భాలలో ఈ ప్రశ్నను లేవనెత్తేవారు, ఇస్లామీయ రాజ్యంలో ముస్లిమేతరులు తమ ఉనికినీ ప్రత్యేకతనూ కోల్పోతారన్న విధంగా ముందుచుతారు. వారిని బలవంతాన ఇస్లామీయ చట్టాన్ని అనుసరించేందుకు నిర్బంధించడం జరుగు తుంది అన్నట్లుగా చిత్రిస్తారు. ఇక్కడ ఈ విషయంలో ఇస్లామ్ ప్రతిపాదించే విధానం ఏమిటో విశదపరిచే ప్రయత్నం జరుగుతుంది.

## విశ్వాసం, మతం విషయంలో బలాత్కారానికి అనుమతి లేదు

ఇస్లామ్, పరమ ప్రభువు అల్లాహ్ అవతరింపజేసిన ధర్మం రూపంలో మన ముందుకు వస్తుంది. ఇప్పుడు ప్రపంచంలో అదొక్కటే నిజధర్మం. అదికాక ఉన్న మిగతా మతాలన్నీ సత్యం ఏమీలేనివి కాకపోయినా, వాటిలో సత్యత ఎంతో కొంత ఉన్నా అవి సత్యాసత్యాల సమాహారమయిపోయాయి. అందువల్ల అవి పూర్తిగా విశ్వసనీయం కావు. ఇస్లామ్ దాని ఈ వాదనను సాధారణంగా ముందుంచింది. కాని ఇతరుల్ని ఎవరినీ దానిగ్గాను బలవంతపెట్టలేదు. ఈ వాదాన్ని నమ్మడానికయినా నమ్మకపోవడానికయినా స్వేచ్ఛనిచ్చింది.

ప్రవక్త మహనీయులు (స) సహజంగానే ప్రజలందరూ ఇస్లామ్‌ను దైవధర్మంగా స్వీకరించాలని కోరుకునేవారు. కాని అల్లాహ్ ఆయనకు చెప్పాడు, మీ ఈ కోరిక నెరవేరదు. ఇది అల్లాహ్ ఏర్పరచిన నియమానికి భిన్నమయిన విషయం. ఆయన కోరుకున్నట్లయితే స్వయంగానే అందరినీ బలవంతాన వివశులుచేసి తన ధర్మానికి బద్ధులయ్యేలా చెయ్యగలిగేవాడే. కాని అలా చెయ్యలేదు. మానవునికి స్వేచ్ఛనిచ్చాడు. అతను దైవధర్మాన్ని స్వీకరించాలనుకుంటే స్వీకరించవచ్చు లేదా స్వీకరించకపోవచ్చు. ఆయనే స్వేచ్ఛనిచ్చినప్పుడు మరే వ్యక్తి కూడా దాన్ని స్వీకరించమని బలవంతపెట్టలేదు.

وَ لَوْشَآءَ رَبُّكَ لَاٰمَنَ مَنْ فِی الْاَرْضِ كُلُّهُمْ جَمِيْعًاؕ اَفَاَنْتَ تُكْرِهُ النَّاسَ حَتّٰى يَكُوْنُوْا مُؤْمِنِيْنَ○ (يونس:٩٩)

(భువిలో ఎల్లరూ విశ్వాసులు, విధేయులే కావాలని) నీ ప్రభువేచ్ఛ అయినట్లయితే భూమిపై నివసించే వారందరూ విశ్వసించి ఉండేవారు. అలాంటప్పుడు నీవు, విశ్వాసులే అవ్వాలని అందరినీ బలవంతం చేస్తావా? *(యూనుస్ : **99**)*

وَ اِنْ كَانَ كَبُرَ عَلَيْكَ اِعْرَاضُهُمْ فَاِنِ اسْتَطَعْتَ اَنْ تَبْتَغِيَ نَفَقًا فِی الْاَرْضِ اَوْ سُلَّمًا فِی السَّمَآءِ فَتَاْتِيَهُمْ بِاٰيَةٍؕ وَلَوْشَآءَ اللّٰهُ لَجَمَعَهُمْ عَلَى الْهُدٰى فَلَا تَكُوْنَنَّ مِنَ الْجٰهِلِيْنَ○ اِنَّمَا يَسْتَجِيْبُ الَّذِيْنَ يَسْمَعُوْنَؕ وَالْمَوْتٰى يَبْعَثُهُمُ اللّٰهُ ثُمَّ اِلَيْهِ يُرْجَعُوْنَ○ (الانعام:٣٥-٣٦)

వెనకటి ప్రవక్తల ఎడల జరిగినదేమిటో ఆ సమాచారాలు నీకు చేరే ఉంటాయి. అయినప్పటికీ ఈ జనుల నిర్లక్ష్యాన్ని సహించడం నీ వల్ల కాకపోతే నీకు సాధ్యమయితే, నేలలో ఏదయినా సొరంగం కనిపెట్టు లేదా ఆకాశానికి నిచ్చెన వెయ్యి, అలా వీరి కొరకు ఏదయినా సూచన తెచ్చే ప్రయత్నం చెయ్యి. అల్లాహ్ కోరినట్లయితే వీరినందరినీ సన్మార్గాన ఏకత్రం చేసి ఉండేవాడే, కనుక అజ్ఞానుల్లా అవకు. వినగలిగేవారే సత్యసందేశానికి స్పందిస్తారు. ఇక మృతులనయితే-అల్లాహ్ వారిని సమాధుల నుండే లేపుతాడు, తరువాత వారు (ఆయన న్యాయస్థానంలోకే) వెనక్కి మరలించబడతారు. *(అన్ఆమ్ : **35, 36**)*

ఇంకా ఇలా ప్రకటించడం జరిగింది:

لَآ اِكْرَاهَ فِی الدِّيْنِ قَدْ تَّبَيَّنَ الرُّشْدُ مِنَ الْغَيِّ فَمَنْ يَّكْفُرْ بِالطَّاغُوْتِ وَ يُؤْمِنْ بِاللّٰهِ فَقَدِ اسْتَمْسَكَ بِالْعُرْوَةِ الْوُثْقٰى لَا انْفِصَامَ لَهَا وَاللّٰهُ سَمِيْعٌ عَلِيْمٌ○ (البقرة:٢٥٦)

ధర్మావలంబనలో ఎటువంటి బలాత్కారం లేదు. సత్యవాక్కు అసత్య భావనల నుండి ప్రస్ఫుటంగా వేరుచేయబడింది. ఇక 'తాగూత్'ను తిరస్కరించి అల్లాహ్‌ను విశ్వసించిన వ్యక్తి నిజానికి, గట్టి ఆధారాన్ని పట్టుకున్నట్లు, అది ఎన్నటికీ తెగిపోనటువంటిది; (అతను ఆధారపడిన) అల్లాహ్ అంతా వింటాడు, అన్నీ తెలుసుకుంటాడు. *(అల్ బకర : **256**)*

దీనితోపాటు ఇస్లామ్ కోరేదేమిటంటే, అది ధర్మం విషయంలో ఎటువంటి బలాత్కారాన్ని అనుమతించకపోయినప్పుడు, స్వయంగా దాని మార్గంలోనూ ఎటువంటి ఆటంకం ఉండరాదు. ఏ వ్యక్తి దాన్ని స్వీకరించదలచినా స్వేచ్ఛగా స్వీకరించగలగాలి. ఆ దారిలో అవాంతరాలు సృష్టించడం, దానిపైన ప్రతిబంధకాలు కల్పించడం దాని భావస్వేచ్ఛపైన చెయ్యిచేసుకోవడమే. ఒక వ్యక్తి ప్రపంచంలో ఏ జీవన సిద్ధాంతాన్నయినా స్వీకరించే హక్కు కలిగి ఉన్నట్లయితే, అతనికి ఇస్లామ్ జీవన సిద్ధాంతాన్ని స్వీకరించే హక్కు సయితం లభించడం అతి సమంజసమయిన తర్కబద్ధమయిన విషయం. కాని ఇస్లామ్ విరోధులు ఈ విషయంలో ఇటువంటి వైఖరినవలంబించరు. వారు భావస్వేచ్ఛ హక్కును కాలరాసి బలాత్కారపు తాళాలు మానవుల పైన వేసేస్తారు. ఒకే విషయంలో రెండు వేర్వేరు ప్రమాణాలు అవలంబించడం ఏమయినా న్యాయమా, ధర్మమా? ఇస్లామ్ ప్రకారం ఈ బలవంతం, ప్రతిబంధం దైవం దృష్టిలో ఎంతో అక్రమమయింది, ఖండనీయమయింది. ఇలాంటి వారు ప్రళయ దినాన దైవం పట్టు నుండి తప్పించుకుపోలేరు.

إِنَّ الَّذِينَ كَفَرُوا وَ صَدُّوا عَنْ سَبِيلِ اللَّهِ قَدْ ضَلُّوا ضَلَٰلاً بَعِيدًا ۝ إِنَّ الَّذِينَ كَفَرُوا وَ ظَلَمُوا لَمْ يَكُنِ اللَّهُ لِيَغْفِرَ لَهُمْ وَلَا لِيَهْدِيَهُمْ طَرِيقًا ۝ إِلَّا طَرِيقَ جَهَنَّمَ خَٰلِدِينَ فِيهَا أَبَدًا ۚ وَكَانَ ذَٰلِكَ عَلَى اللَّهِ يَسِيرًا ۝ (النساء:١٦٧-١٦٩)

**దీన్ని నమ్మడానికి తామూ నిరాకరించి, ఇతరుల్నీ దైవ మార్గాన్నుండి నిరోధించే వారు, నిస్సందేహంగా మార్గం తప్పి సత్యానికి బహు దూరంగా వెళ్ళిపోయారు. ఈ విధంగా తిరస్కారం, తిరుగు బాటు వైఖరి నవలంబించి, అత్యాచారానికి, దౌర్జన్యానికి ఒడిగట్టిన వారిని అల్లాహ్ ఎన్నటికీ మన్నించడు. వారికి మరే మార్గమూ చూపడు, ఒక్క నరకానికి పోయే మార్గం తప్ప, అందులో వారు చిరకాలం ఉండి పోతారు. అల్లాహ్‌కు ఇదంతా కష్టమేమీ కాదు.** ***(అన్ నిసా : 167 -169)***

దివ్యఖుర్ఆన్, ప్రవక్తలు, దైవభక్తులయిన మానవుల చరిత్రను మనముందుంచుతుంది. వారికి దైవధర్మం ప్రకారం ఆచరించడానికి, దైవధర్మాన్ని దేవుని దాసులయిన మానవులకు అందజేయడానికి అనుమతించడం జరగలేదు. వారికి సందేశ ప్రచారం చేసే హక్కు నివ్వడానికి తిరస్కరించడం జరిగింది. సంబోధితుల్ని

దాన్ని స్వీకరించ కుండా బలవంతాన నిరోధించడం జరిగింది. మహనీయ ఇబ్రాహీమ్ (అలైహిస్సలామ్)ను సందేశ ప్రచారం కారణంగానే మంటల్లో పడవేయడం జరిగింది. మహనీయ మూసా(అ) ను హత్య చెయ్యాలని కుట్రలు జరిగినప్పుడు దేవుని ఓ దాసుడు దానికి వ్యతిరేకంగా గళం విప్పాడు.

اَتَقْتُلُوْنَ رَجُلاً اَنْ يَّقُوْلَ رَبِّىَ اللّٰهُ وَ قَدْ جَآءَ كُمْ بِالْبَيِّنٰتِ مِن رَّبِّكُمْ ؕ وَ اِنْ يَّكُ كَاذِباً فَعَلَيْهِ كَذِبُهٗ ۚ وَ اِنْ يَّكُ صَادِقًا يُّصِبْكُمْ بَعْضُ الَّذِىْ يَعِدُكُمْ ؕ اِنَّ اللّٰهَ لاَ يَهْدِىْ مَنْ هُوَ مُسْرِفٌ كَذَّابٌ ○ (مومن:۲۸)

**"మీరు ఒక వ్యక్తిని, అతను నా ప్రభువు అల్లాహ్ మాత్రమే అని అన్నంత మాత్రాన చంపివేస్తారా? నిజానికి అతను మీ ప్రభువు వద్ద నుంచి ప్రకాశమానమయిన వాటిని తీసుకువచ్చాడే; ఒకవేళ అతను అబద్ధాలు పలుకుతున్నట్లయితే అతని అబద్ధం స్వయంగా అతని పైనే తిరగబడుతుంది. కాని ఒకవేళ అతను నిజం పలుకుతున్నట్లయితే అతను ఏ భయంకరమయిన పరిణామాలను గురించి భయపెడుతున్నాడో వాటిలో కొన్నయితే మీపై తప్పక వచ్చిపడతాయి. అల్లాహ్ హద్దులుమీరిపోయే వ్యక్తికీ, మొండి అబద్ధాలకోరుకూ సన్మార్గం అసలే చూపడు."**

***(మూ'మిన్ : 28)***

మహనీయ మూసా (ర) చరిత్రకే సంబంధించిన ఒక సంఘటన. ఆయన సందేశం ఆయన మహిమలకు పోటీగా మంత్రగాళ్ళను పిలవనంపడం జరిగింది. కాని అతిత్వరగానే మంత్రగాళ్లకు వాస్తవికత తెల్లమయిపోయింది, మహనీయ మూసా(అ) సత్యం చెబుతున్నారని, మంత్రతంత్రాల గారడీతో ఆయన మహిమల్ని ఎదుర్కోవడం సాధ్యపడదని వారు గ్రహించారు. వారు మహనీయ మూసా(అ)ను విశ్వసించారు. దానికి ఫిర్ఔన్ ఆగ్రహోదగ్రుడయ్యాడు. అతని ఆగ్రహజ్వాలలు ఎంతగా ప్రజ్వరిల్లాయంటే అతను వారి కాళ్ళూ చేతులు నరికి శిలువ మీద ఎక్కించాలని ఆదేశాలు ప్రకటించాడు. ఆ దైవదాసులు ఇదంతా ఎంతో సహన స్థయిర్యాలతో భరించారు.

قَالُوْٓا اِنَّآ اِلٰى رَبِّنَا مُنْقَلِبُوْنَ ○ وَمَا تَنْقِمُ مِنَّآ اِلَّآ اَنْ اٰمَنَّا بِاٰيٰتِ رَبِّنَا لَمَّا جَآءَتْنَا ؕ رَبَّنَآ اَفْرِغْ عَلَيْنَا صَبْرًا وَّ تَوَفَّنَا مُسْلِمِيْنَ ○ (الاعراف:۱۲۵-۱۲۶)

వారు సమాధానంగా చెప్పారు, "కడకు మేము మరలవలసింది మా ప్రభువు వైపు నకే. నీవు మాపై పగ తీర్చుకోవడానికి కారణం, మా ప్రభువు నిదర్శనాలు మా సమక్షంలోకి వచ్చినప్పుడు మేము వాటిని అంగీకరించడం తప్ప మరొకటి కాదు. మా ప్రభూ! మాకు సహనాన్ని పుష్కలంగా ప్రసాదించు, మమ్మల్ని నీ ఆజ్ఞాపాలకు లయిన ముస్లిములుగానే ప్రపంచం నుండి తీసుకువెళ్ళు." *(అల్ ఆరాఫ్: 125, 126)*

దివ్యఖుర్ఆన్‌లో 'గుండాలవారి' ప్రస్తావన చేసింది వారిని మండే నిప్పు గుండాలలో పడవేయడానికి వారి అపరాధం కేవలం ఒక్కటే, వారు భూమీ ఆకాశాల స్వామి అయిన ఒకే దైవాన్ని నమ్మేవారు:

قُتِلَ اَصْحٰبُ الْاُخْدُوْدِ ○ النَّارِ ذَاتِ الْوَقُوْدِ ○ اِذْهُمْ عَلَيْهَا قُعُوْدٌ ○ وَّهُمْ عَلٰى مَا يَفْعَلُوْنَ بِالْمُؤْمِنِيْنَ شُهُوْدٌ ○ وَمَا نَقَمُوْا مِنْهُمْ اِلَّآ اَنْ يُّؤْمِنُوْا بِاللّٰهِ الْعَزِيْزِ الْحَمِيْدِ ○ الَّذِيْ لَهٗ مُلْكُ السَّمٰوٰتِ وَالْاَرْضِ ؕ وَاللّٰهُ عَلٰى كُلِّ شَيْءٍ شَهِيْدٌ ○ (البروج:۴-۹)

గుండంవారు గండంలో పడ్డారు. అందులో కణకణ మండే ఇంధనపు మంట. అప్పుడు వారు గుండం అంచుల పైన కూర్చుని తాము విశ్వసించినవారి పట్ల చేస్తున్నదేమిటో చూస్తూ ఉన్నారు. ఆ విశ్వసించిన వారి పట్ల వారి శత్రుత్వానికి మూలం మరేమీ కాదు - వారు, శక్తి మాన్యుడు, స్వయాన తానే స్తవనీయుడు అయిన అల్లాహ్‌ను విశ్వసించారు. ఆయన భూమ్యాకాశాల సామ్రాజ్యస్వామి. ఆయన సర్వం చూస్తూ ఉన్నాడు.

*(అల్ బురూజ్ :4-9)*

బొరియ వారు కొందరు యువకులు. తమ విశ్వాసాన్ని ప్రకటించే హక్కు వారికి లేకపోయింది. వారు తమ ఊరు వదలి, ఒక గుహలో తలదాచుకోవడానికి వెళ్ళిపోయారు. పరమ ప్రభువు తన మహిమతో వారిని ఎన్నో ఏళ్ళ వరకు నిద్ర పుచ్చాడు. వారు తమ సుదీర్ఘ నిద్రతో మేల్కొన్నప్పుడు అనుకున్నారు, తమలో ఒక

వ్యక్తి జాగ్రత్తగా బజారుకెళ్ళి తినడానికి ఏమయినా తీసుకురావాలని. ఈ ముందస్తు జాగ్రత్తకు కారణంగా వారు ఇలా అనుకుంటారు:

اِنَّهُمْ اِنْ يَّظْهَرُوْا عَلَيْكُمْ يَرْجُمُوْكُمْ اَوْ يُعِيْدُوْكُمْ فِيْ مِلَّتِهِمْ وَلَنْ تُفْلِحُوْٓا اِذًا اَبَدًا۝
(الكهف:٢٠)

**ఒకవేళ వారు మనల్ని కనుగొన్నారా, అంతే, మనల్ని రాళ్ళతోనే కొట్టి చంపి వేస్తారు. లేదా బలవంతాన మనల్ని తమ మత సము దాయంలోకి తిరిగి మరల్చుకు పోతారు, అలాగే జరిగినట్లయితే, ఇక మనం ఎన్నటికీ సాఫల్యం పొందలేము."**
***(అల్ కహ్ఫ్ : 20)***

దీన్నిబట్టి వారు ఎటువంటి సున్నితమయిన పరిస్థితుల్ని ఎదుర్కొంటున్నారో ఊహించుకోవచ్చు. వారి పట్ల ఎటువంటి కఠిన వైఖరినవలంబించడం జరిగేదో కూడా గ్రహించవచ్చు ఇస్లామ్ ఇటువంటి వైఖరికి లేదా Persecutionకు వ్యతిరేకం.

## దైవప్రవక్తల ఆదరణ

ప్రపంచంలో మానవుని ఉనికి ప్రారంభమయినప్పటి నుంచి పరమ ప్రభువు పక్షాన 'వహీ', 'దైవసందేశం' అవతరణ మొదలయింది. దివ్యఖుర్ఆన్ ఈ విషయంలో వివరిస్తూ ప్రతి కాలంలో, ప్రతి జాతిలో దేవుని సందేశహరులు వస్తూ ఉన్నారని అంటుంది.

اِنَّآ اَرْسَلْنٰكَ بِالْحَقِّ بَشِيْرًا وَّ نَذِيْرًا ؕ وَّ اِنْ مِّنْ اُمَّةٍ اِلَّا خَلَا فِيْهَا نَذِيْرٌ۝

**మేము నిన్ను సత్యధర్మంతో పంపాము - శుభవార్తనిచ్చేవానిగా, హెచ్చరిక చేసే వానిగా. హెచ్చరిక చేసేవాడెవ్వడూ రాని సముదాయం ఏదీ లేదు.** ***(ఫాతిర్ : 24)***

మరో చోట ఇలా అంటుంది:

اِنَّمَآ اَنْتَ مُنْذِرٌ وَّلِكُلِّ قَوْمٍ هَادٍ۝
(الرعد:٧)

**నీవు కేవలం హెచ్చరించేవాడివి మాత్రమే, ప్రతి జాతికి ఒక మార్గదర్శకుడంటూ ఉన్నాడు.** ***(అర్ రఅద్ : 7)***

వీరిలో కొందరి ప్రస్తావన దివ్య ఖుర్ఆన్‌లో వస్తుంది. మరికొందరి ప్రస్తావన లేదు:

وَلَقَدْ اَرْسَلْنَا رُسُلاً مِّنْ قَبْلِكَ مِنْهُمْ مَّنْ قَصَصْنَا عَلَيْكَ وَمِنْهُمْ مَنْ لَّمْ نَقْصُصْ عَلَيْكَ ؕ (مومن:٧٨)

**ప్రవక్తా, మేము నీకు పూర్వం అనేక మంది సందేశహరుల్ని పంపి ఉన్నాము. వారిలో కొందరి వివరాలను మేము నీకు తెలిపాము, మరికొందరిని గురించి తెలుపలేదు.** ***(మూ'మిన్ : 78)***

ఇదే విషయం నిసా సూరా *(ఆయత్ 64)*లోనూ కొందరు ప్రవక్తల ప్రస్తావన తరువాత పునరుక్తం చేయబడింది.

దివ్యఖుర్‌ఆన్ ప్రకారం ఒక ముస్లిమ్ దేవుని సందేశహరులనందరినీ విశ్వసించి వారిని సత్యబద్ధులని నమ్మవలసి ఉంటుంది. ఏ ప్రవక్తల ప్రస్తావన ఖుర్‌ఆన్ పేరు పేరునా చేస్తుందో వారి వివరణ, నిర్దిష్టతలతోనే, ఖుర్‌ఆన్ ప్రస్తావించని సందేశ హరుల్ని గురించి అతను సాక్ష్యమివ్వాలి. వారి పట్ల సంగ్రహ రూపంలో విశ్వాసం కలిగి ఉండాలి. ఈ ప్రవక్తల నిజ బోధనల్ని ఖుర్‌ఆన్ సమర్థిస్తుంది. ఏ బోధనల్లో నయితే ప్రక్షిప్తాలు జరిగాయో వాటిని సంస్కరిస్తుంది.

ఒక ముస్లిమ్ తన విశ్వాసం, నమ్మకాల రీత్యా ఏ ప్రవక్త పరాభవానికీ పాల్పడ లేదు.[1]

## జిమ్మీల హక్కులు

ఇస్లామీయ రాజ్యంలో జిమ్మీల (ముస్లిమేతర ప్రజల) ధన మాన ప్రాణాల పరిరక్షణ బాధ్యత ప్రభుత్వానిది. వారిపట్ల ఎటువంటి అత్యాచారానికయినా ఏ ముస్లిమ్ లేదా ముస్లిమేతర వ్యక్తి అయినా పాల్పడటాన్ని అది అనుమతించదు. వారి మీద ఎటునుండి దాడి జరిగినా అది దాన్ని ఎదుర్కొంటుంది.[2]

వారు శత్రువులకు వశమయిపోయినట్లయితే వారిని తత్కాలపు నియమానుసారం బందీలుగా బానిసలుగా చేసుకున్నట్లయితే ఇస్లామీయ రాజ్యం వారిని విడుదల చేయిస్తుంది. వారిని బానిసలుగా కాదు స్వతంత్రులుగా చూస్తుంది. సహీహ్ బుఖారీలో ఒక అధ్యాయం శీర్షిక ఇలా ఉంది:

يقاتل عن اهل الذمه ولا يسترقون

**జిమ్మీల పక్షాన పోరాటం జరుగుతుంది, వారిని బానిసలుగా మార్చనివ్వ బడదు.**

---

*1. వివరాల కోసం చూడండి, రచయిత పుస్తకం, 'ముస్లిమేతరులతో సంబంధాలు, వారి హక్కులు' (ఉర్దూ) 'ఇస్లామ్-ఇతర మతాలు.' (2) వివరాల కోసం చూడండి, 'ముస్లిమేత రులతో సంబంధాలు, వారి హక్కులు (ఉర్దూ) - జిమ్మీల హక్కులు*

దీన్ని సమర్థిస్తూ ఇమామ్ బుఖారీ జిమ్మీ లకు సంబంధించిన మహనీయ ఉమర్ (ర) ఉపదేశాన్ని ఉటంకించారు.[1]

అల్లామా ఇబ్ను కద్దామా హన్బలీ ఇటువంటి పరిస్థితిని గురించి ఇలా వ్రాస్తూ జిమ్మీని బానిసగా చెయ్యడం జరగదు. వారి హక్కుల్ని హరించడమూ జరగదు.[2]

మరో సందర్భంలో ఇలా అన్నారు : ఒకరు జిమ్మీ అయినట్లు ఒప్పందం జరిగి నట్లయితే పాలకుడు (ప్రభుత్వం) అతన్ని సమర్థించడం తప్పనిసరి. ఆ విధంగా ముస్లిములయినా, యుద్ధ ఖైదులయినా, ఇతర జిమ్మీలయినా అతని పట్ల అత్యాచారం జరపకుండా ఉండగలరు.[3]

## వ్యక్తిగత చట్టాలపైన అమలు

ఇస్లామీయ రాజ్యంలో ఆయా మతాలకు చెందిన వారికి తమ మతాలను అవలంబించే హక్కు స్వేచ్ఛ ఉంటాయి. వాటిలో ఆరాధనలు, వివాహం, విడాకులు, జీవన్మరణాలు తదితర వ్యక్తిగత వ్యవహారాలు, కుటుంబ వ్యవహారాలూ చేరి ఉన్నాయి. వారికి సంబంధించిన ఈ విషయాలలో రాజ్యం జోక్యం చేసుకోదు. వీటి కోసం వారికి వేరే న్యాయస్థానాలు సయితం స్థాపించడం సాధ్యమే. కాని వారు ఏ విషయంలో నయినా ఇస్లామీయ న్యాయస్థానాల వైపునకు మరలినట్లయితే అప్పుడు ఇస్లామీయ న్యాయస్థానాలు వారి చట్టం ప్రకారం కాక ఇస్లామీయ చట్టం ప్రకారం తీర్పు చేస్తాయి.

## ధర్మం విషయంలో చర్చలు జరగవచ్చు

ధర్మం విషయంలో దాని సత్యతల సవ్యత పట్ల గంభీరమయిన చర్చలు జరగడం సాధ్యమే. వాటిని గురించి చర్చాగోష్ఠులు, అభిప్రాయ మార్పిడీలు కూడా అనుమతించబడతాయి. దివ్యఖుర్ఆన్ ఈ సందర్భంలో 'జిదాలు హసన్' (ఉత్తమమయిన వాదన) అన్న పరిభాషను సృష్టించింది.

**వారితో ఉత్తమ రీతిలో వాదన చెయ్యి.** وَجَادِلْهُمْ بِالَّتِيْ هِيَ اَحْسَنُ ۝

***(అన్ నహ్ల్ : 125)*** (النحل:۱۲۵)

ఉత్తమమయిన వాదన అంటే ఆధారాలతో మాటలాడాలి, తన అభిప్రాయాన్ని, దాని సత్యతను నిరూపించే ప్రయత్నం చెయ్యాలి. మతం పట్ల చర్చ అనే పేరుతో

---

1. బుఖారీ – కితాబుల్ జిహాద్
2. ఇబ్ను కద్దామ, అల్ ముగ్ని : 13/49
3. ఇబ్ను కద్దామ, అల్ ముగ్ని : 13 /250

పక్షపాతం, ద్వేషం నిండిన వాతావరణాన్ని సృజించడం, పోరాటపు విధానం అనుస రించడం నిషిద్ధం. ఇది చాలా సున్నితమయిన విషయం. దీని విషయంలో స్పష్ట మయిన నిర్దేశాలున్నాయి. వేదికపైన అవగాహన, బోధనలు కాక ఎదుటి వ్యక్తి పక్షాన మాటల్లో చిక్కు సృష్టించి దాన్ని మరో వైపునకు మళ్ళించే ప్రయత్నం జరుగుతున్నట్లు కనిపిస్తే అటువంటి వేదికను వదలిపెట్టడమే సరయినదని కూడా బోధించడం జరిగింది:

وَ اِذَا رَاَيْتَ الَّذِيْنَ يَخُوْضُوْنَ فِىْ اٰيٰتِنَا فَاَعْرِضْ عَنْهُمْ حَتّٰى يَخُوْضُوْا فِىْ حَدِيْثٍ غَيْرِهٖ ؕ وَ اِمَّا يُنْسِيَنَّكَ الشَّيْطٰنُ فَلَا تَقْعُدْ بَعْدَ الذِّكْرٰى مَعَ الْقَوْمِ الظّٰلِمِيْنَ ○ (الرعد:٧)

**ముహమ్మద్, జనులు మా వచనాలలో తప్పులెన్నడం నీవు చూసినట్లయితే అక్కడి నుండి తొలగిపో, వారు ఆ సంభాషణ మానేసి ఇతర ముచ్చట్లలో పడనంతవరకు (అటు వెళ్ళకు). మరెప్పుడయినా షైతాన్ నిన్ను మరపునకు గురి చేసినట్లయితే నీకు దాని స్పృహ కలిగినప్పుడు ఆ వెంటనే అలాంటి దుర్మార్గుల సహచర్యంలో ఇక కూర్చోబాకు.** ***(అల్ అన్ ఆమ్ : 68)***

మతం విషయంలో అభిప్రాయ ప్రకటనకు ఇంతకన్నా సమంజసమయిన, సభ్యమయిన మరో విధానం ఊహించడం కూడా దుర్లభమే.

## మతం విషయంలో చర్చ, దాని హద్దులు

మతం పట్ల చర్చ జరిగినట్లయితే అల్లాహ్, ఆయన సందేశహరులు, ఆయన పంపిన గ్రంథాలు, మతపరమయిన ప్రముఖ వ్యక్తులను గురించి పూర్తి గౌరవాదరణ లతో సంభాషణ జరగాలి. వారి పట్ల ఏ విధమయిన అసభ్యత అగౌరవం శిక్షార్హ మయిన నేరం. దీనికి పాల్పడినవానికి ఇస్లామీయ రాజ్యం చట్టపరమయిన చర్య తీసుకుంటుంది.

గుర్ఫ బిన్ హారిస్ (ర) ప్రవక్త సహచరులు. ఈజిప్ట్‌కు చెందిన 'మంద్‌కూన్' అనే ఒక క్రైస్తవ వ్యక్తిని ఆయన కలసుకోవడం జరిగింది. ఆయన ఆ వ్యక్తికి ఇస్లామ్ సందేశాన్ని అందజేశారు. అతను ప్రవక్తశ్రీ (స) పట్ల తూలనాడటం మొదలెట్టాడు. ఈ విషయం అక్కడి గవర్నర్ అమ్ర్ బిన్ ఆస్ (ర)కు చేరవేశారు. ఆయన వారిరువురినీ పిలువనంపారు. గుర్ఫతో ఇలా అన్నారు, 'మనం వీరి (క్రైస్తవుల)తో ఒప్పందం

చేసుకున్నాము, మనం దాన్ని నిత్యం పాటించాలి.' దానికి గుర్బ ‘దైవం మన్నించాలి, మనం ఒప్పందం చేసుకుంది వీరు మనల్ని దైవం, దైవప్రవక్త విషయంలో బాధ కలిగించడానికి కాదు. మనం వారికి తమ మతాన్ని పాటించడానికి తమ చర్చీలలో తమ మత ధర్మాలను పాటించడానికి అవకాశాన్నిచ్చాము. అందులో జోక్యం చేసు కోవడం జరగదు. వారిపైన వారి శక్తికి మించిన బాధ్యతాభారం వెయ్యడం జరగదు. వారి రక్షణ కోసం అవసరమయితే యుద్ధమూ చేస్తాము. వారు తమ మత ధర్మాలను ఎట్టి పరిస్థితిలోనూ పాటించేందుకు వారికి స్వేచ్ఛ ఉంటుంది. అయితే వారు మా న్యాయస్థానాల్లో తమ వ్యాజ్యాలు తీసుకువచ్చినట్లయితే దైవగ్రంథాన్ననుసరించి మేము తీర్పు చేస్తాము' అని సమాధానంగా చెప్పారు. అమ్ర్ బిన్ ఆస్ దాన్ని పూర్తిగా సమర్థించారు.[1]

ఇస్లామీయ షరీయత్‌వేత్తల ప్రకారం ఇస్లామ్ లేదా మరే దైవిక ధర్మం విషయంలో లేదా దైవం, దైవప్రవక్తల విషయంలో ఎవరయినా అవమానకరంగా ప్రవర్తించినట్లయితే, అతను ముస్లిమయినా ముస్లిమేతరుడయినా, అతనికి వ్యతి రేకంగా చర్య తీసుకోవడం జరుగుతుంది. ఇందులో పండితులందరి ఏకాభిప్రా యముంది. చాలా మంది ఫిక్‌హ్‌వేత్తలు దీనికి మరణ దండనను ప్రతిపాదిస్తారు. ఇమామ్ అబూ హనీఫా దృష్టిలో ప్రవక్తలను తూలనాడినా, అవమాన పరచినా మరణశిక్ష విధించనవసరం లేదు. అయితే ఎవరయినా మాటిమాటికీ మరణదండన విధించవచ్చు.[2]

ఈ శిక్షలు చూడటానికి కఠినమయినవిగా అగుపిస్తున్నాయి. అయితే మతం పట్ల గౌరవాదరణలు, దానికి ఉండవలసిన దర్పం మిగిలి ఉండాలంటే ఇవి అవసరం. లేకపోతే మతం ఒక వేళాకోళమయిపోతుంది.

అరేబియా ముష్రికులు దైవదౌత్యాన్ని ఎరుగరు, నమ్మరు. వారి వద్ద ఎటువంటి దైవగ్రంథం లేదు. వారు తౌహీద్ స్థానే బహుదైవ వాదనలు, విగ్రహారాధనను అవలంబించేవారు. ఇస్లామ్ దాని అనుయాయులకు బోధించిన విషయం ఏమిటంటే, ఈ అతి సున్నిత విషయంలో వారితో మాటలాడేటప్పుడు వారి మత భావావేశాలను

1. *మజ్మ ఉజ్జవాయిద్ వ మన్బ ఉల్ ఫకాయిద్ : 5 / 636; 6/398*
2. *అల్లామా ఇబ్నుల్ కయ్యిమ్ ఈ విషయంలో సుదీర్ఘంగా చర్చించారు. చూడండి, అహ్కామ్ అహ్లజ్జిమ్మ - సం. 3, పు. 1357–1457.*

రగుల్గొలిపి వారిని ప్రతి చర్యకు పురికొలపకుండా ఉండాలి. వారు దానికి ప్రతిగా దైవం పట్లనే పరాభవకరంగా మాటలాడవచ్చు. :

ఈ సందర్భంలో చూడండి :

وَلاَ تَسُبُّوا الَّذِيْنَ يَدْعُوْنَ مِنْ دُوْنِ اللّٰهِ فَيَسُبُّوا اللّٰهَ عَدْوًا بِغَيْرِ عِلْمٍ ؕ كَذٰلِكَ زَيَّنَّا لِكُلِّ اُمَّةٍ عَمَلَهُمْ ۪ ثُمَّ اِلٰى رَبِّهِمْ مَّرْجِعُهُمْ فَيُنَبِّئُهُمْ بِمَا كَانُوْا يَعْمَلُوْنَ ○

(الانعام:۱۰۸)

**(విశ్వసించిన జనులారా) వీరు అల్లాహ్‌ను కాదని ఎవరినయితే ప్రార్థిస్తున్నారో వారిని దూషించకండి. వీరు బహుదైవారాధనను మీరి అజ్ఞానం మూలంగా అల్లాహ్‌నే దూషించడం మొదలెట్ట గలరు. మేమయితే ఇదే విధంగా ప్రతి వర్గానికి దాని చేష్టలను రమ్యమయినవిగా చేశాము. తరువాత వీరు తమ ప్రభువు వైపునకే మరలి రావలసి ఉంది. అప్పుడు ఆయన వారికి తెలుపుతాడు, వారు ఏమేమి చేస్తూ ఉన్నారో.** ***(అల్ అన్ ఆమ్ : 108)***

దీన్నిబట్టి దైవిక ధర్మాలుగా చెప్పుకోని ధర్మాలు, లేదా వేటిని గురించి అవి దైవిక ధర్మాలుగా ఆధారాలు లేవో వాటి గౌరవనీయ వ్యక్తులు లేదా వాటి ఆరాధ్యుల విషయంలోనూ నిరాదరణగా మాటలాడటం, వారిని ఆటపట్టించే విధంగా మాట లాడటం శిక్షార్హమయిన నేరంగానే పరిగణించడం సరయినదే అని చెప్పవచ్చు.

